# అల్పాహారానికి ప్రియ తోడు-
# అద్వితీయమైన
# చులు జోడు!

డైనా, ఎక్కడైనా... ప్రియ!

దయం, మధ్యాహ్నం, రాత్రి -
వేళప్పుడయినా సరే,
ల్పాహారం, భోజనం, ఉపాహారం - ఏదైనా సరే,
ఇంటా బయటా - ఎక్కడైనా సరే,
ప్రియ పచ్చళ్లుంటేనే అది బహురుచికరం!

నవకాయ పిండి వంటలెన్నున్నా
ప్రియ పచ్చళ్లతోనే భోజనం పరిపూర్ణం!

ప్రియ ఉంటేనే మీకు
ంతుష్టి!!

**రుచి... ఎంతో రుచి...**

# ప్రియ

మామిడి • నిమ్మ • గోంగూర • అల్లం • టొమాటో
పండుమిరప • పచ్చిమిరప • మిక్స్‌డ్ వెజిటబుల్.
పచ్చళ్లన్నీ వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ లభిస్తాయి.








ఉషోదయ
ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్
(ప్రియ ఫుడ్స్ డివిజన్)
ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ, హైదరాబాదు -500 482.

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

## సెప్టెంబర్ 'చతుర' నవల ది రోడ్

సమీక్షకుని పేరు : ..................................................

చిరునామా : ..................................................

..................................................

..................................................

..................................................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482

# చతుర ప్రపంచం

## విమానాల బ్యూటీపార్లర్

విమానాలకోసం ప్రత్యేకించి ఓ బ్యూటీపార్లర్‌ని లండన్‌లో నెలకొల్పిన ఘనత బ్రిటీష్ ఎయిర్‌వేస్‌కే దక్కింది. రంగులు వెలిసిపోయి వెలా తెలాపోతున్న జంబో జెట్ విమానాలకు అక్కడ మళ్లీ పెయింట్ వేసి, ముస్తాబుచేసి పంపుతారు. సుమారు 70 లక్షల పౌండ్ల ఖర్చుతో 8 అంతస్థుల భవనమంత ఎత్తుతో, ఫుట్‌బాల్ మైదానమంత స్థలంలో ఆ పార్లర్ నిర్మాణం జరిగింది.

కొత్త పెళ్లికూతురులా కళకళలాడాలంటే ఒక్కో విమానానికీ మొదటి కోటింగ్‌కిగాను 1000 లీటర్లు, రెండవ కోటింగ్ కింద 1050 లీటర్లు వెరశి 2050 లీటర్ల పెయింట్ కావాల్సుంటుంది. అంటే సుమారు 200 మారుతీకార్లకు సరిపడేంత పెయింట్ కావాలన్న మాట. 50 మంది పనివారు పెయింట్ గన్స్‌తో 20 రోజులపాటు కష్టపడితే ఒక జంబోజెట్‌కి పెయింట్ వేసి దానికి కొత్తకళ తేవచ్చు. ఆ పార్లర్‌లో బ్రిటీష్ ఎయిర్‌వేస్ విమానాలే కాక విదేశీ విమానాలకి కూడా ముస్తాబు చేస్తారు. అయితే ఒక్కోదానికీ లక్ష పౌండ్లు రుసుము చెల్లించుకోవాల్సుంటుంది.



కవర్ పేజీ ఫొటోగ్రాఫర్ : కె.భాస్కర్

# వధువుల కలలు

తాము చేసుకోబోయే అబ్బాయిల్లో ఫలానా ఫలానా లక్షణాలు ఉండాలని కలలు కంటుంటారు అమ్మాయిలు కూడా. పొడవుగా ఉండే యువకులు కొందరైతే, విశాల వక్షంగల వారు మరికొందరు. కొందరిలో ధైర్యసాహసాలు పుష్కలంగా ఉంటే, ఇంకొందరిలో చురుకుదనం, నాజూకుదనం అధికపాళ్లలో ఉంటాయి. కొందరు ఆకర్షణీయంగా ఉంటే మరికొందరు ఉదారస్వభావులై ఉంటారు. కొందరు కుబేరులైతే వారి ప్రక్కనే దరిద్రులూ ఉంటారు. ఒకే వ్యక్తిలో గొప్పలక్షణాలన్నీ ఉండడం అరుదు. కాబట్టి వీరిలో ఎలాంటి వారిని అమ్మాయిలు ఎంచుకుంటారన్నది ప్రశ్న. ఇటీవల ఈ విషయంపై దేశవ్యాప్తంగా ఉన్న అమ్మాయిల్ని సర్వే చేసింది బొంబాయిలోని ఓ మహిళాసంస్థ. ఆ సర్వేలో ఆసక్తికరమైన విషయాలెన్నో బయటపడ్డాయి.

కేవలం 3 శాతం మంది అమ్మాయిలు మాత్రమే కాబోయే తమ భర్తలు ధనవంతులై ఉండాలన్న కోరికను వ్యక్తంచేశారు. వారు తమ కంటే కనీసం పిసరంతైనా తెలివైన వాళ్లయి ఉండాలని కూడా ఆ అమ్మాయిల అభిప్రాయం.

తమ భర్తలు ఉదారస్వభావులై కలుపుగోలుతనంతో విశ్వాసపాత్రంగా ఉంటే చాలని మరి కొందరమ్మాయిల ఆకాంక్ష. కొందరు గడుసు అమ్మాయిలైతే ఆఫీసరు హోదాలో ఉండే తమకు అదే ఆఫీసులో పనిచేసే ఛప్రాసీ లాంటి వారైతే మంచిది అన్నారట. వారైతే ఇంట్లో కూడా తమకు అణగిమణగి పడిఉంటారనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు వారు.

"న్యూనతాభావం ఎక్కువగా గల భర్తలు వస్తే వారిని ఎంచక్కా ఉత్సాహపరిచి వారి విశ్వాసాన్ని చూరగొంటామ"ని చాలామంది అమ్మాయిలు అంటున్నారు. తమకంటే వయసులో 10-20 ఏళ్ల పెద్ద అయిన వారిని కూడా భర్తలుగా స్వీకరించడానికి అభ్యంతరం చెప్పడంలేదు కొందరు. అలాంటి భర్తల్ని తమ కొలీగ్స్‌నించో, బంధువర్గంనుంచో ఎన్నుకోవాలని వారు అనుకొంటున్నారు. అలాంటివారైతే ఇంటిపనులతోపాటు పిల్లల ఆలనాపాలనా



కూడా ఓపిగ్గా చూస్తారని వారి ఆశ.

తమ అందచందాల్ని పనిపాటల్ని నిత్యం మెచ్చుకునే భర్తలు కావాలని కోరుకొంటున్నారు కొందరమ్మాయిలు. డ్రెస్ విషయంలో చక్కని అభిరుచి ఉండి, మంచి హోదాలో ఉండే భర్తలైతే బాగుంటుందని మరికొందరు యువతుల అభిప్రాయం.

అయితే ఎక్కువశాతం అమ్మాయిలు డబ్బు కన్నా, హోదాకన్నా కూడా తమను అర్థంచేసుకొనే మంచి మనస్తత్వం గల భర్తలు రావాలని కోరుకుంటున్నారు. అమ్మాయిల మనోగతాలు తెలిశాయిగదా! అబ్బాయిలూ హర్రీ అప్!



# ఉత్తరాల కబుర్లు!

ఒకానొకప్పుడు ఉత్తరప్రత్యుత్తరాల్ని బట్వాడా చేసేందుకు ప్రత్యేకించి వార్తాహరులుండేవారు. హైదరాబాద్ నుండి విజయవాడకి ఏదైనా వార్తను పంపాలంటే అంచెలవారీగా ఆ వార్తను కొందరు వ్యక్తులు గమ్యానికి చేర్చేవారు. ఇతర దేశాలకిసైతం వార్తలు ఇలాగే బట్వాడా అయ్యేవి. ఆ తర్వాత కొన్నేళ్లకి చర్మంమీద, ఆకులమీద రాసిన వార్తల్ని మనుమలకిచ్చి పంపే పద్ధతి వచ్చింది. ఆ తర్వాత తర్వాత కాగితం వాడకంలోకి వచ్చింది.

నిజానికి ఆధునిక పోస్టల్ వ్యవస్థకి పునాదులు వేసినవాడు గ్రీకు చక్రవర్తి అలెగ్జాండర్. అందుకోసం ఆయన ప్రత్యేకించి కొందరు అశ్వికుల్ని ఏర్పాటు చేశాడు. వారు అతివేగంగా ప్రయాణించడంకోసం చక్కటి మార్గాల్ని వేయించాడు. ఎంతలేదన్నా ఒక్కో గుర్రం రోజుకి నగటున 60 కిలోమీటర్లకు తక్కువకాకుండా ప్రయాణం చేసేది. కాని ఆ సామ్రాజ్యంతోపాటు ఆ తపాలా వ్యవస్థ కూడా క్రమేణా కాలగర్భంలో కల్సిపోయింది.

ఆ తర్వాత క్రీ. శ. 1400లలో పారిస్‌లోని కొందరు యూనివర్శిటీ అధికారులు తమ విద్యార్థులకి సమాచారం అందించే ఉద్దేశంతో స్వచ్ఛందంగా పోస్టల్ వ్యవస్థకి మళ్లీ రూపకల్పన చేశారు. దాని ఆధారంగా ఇంగ్లాండులోని కొందరు వర్తకులు తమ వ్యాపారాభివృద్ధికోసం ఆ వ్యవస్థను మరింత పటిష్టపరిచారు. ఆ వ్యవస్థ దాదాపుగా నేటి మన 'కొరియర్ల' టపాలానే ఉండేది.

ఇంగ్లాండ్‌లో 15వ శతాబ్దంలో 4వ ఎడ్వర్డ్ ప్రభుత్వ లేఖల బట్వాడా నిమిత్తం సరికొత్త పోస్టల్ వ్యవస్థని నెలకొల్పాడు. తర్వాత తర్వాత ఆ వ్యవస్థను కొద్దిపాటి రుసుము చెల్లించి ప్రజలు కూడా వాడుకునేలా విస్తరింపజేయడం జరిగింది. అయితే ఆ రోజుల్లో పోస్టల్ స్టాంపులు లేవు. ఉత్తరం పోస్టు చేసిన చోట దానిమీద రుసుము చెల్లించినట్లుగా పోస్ట్ మాస్టర్ పెన్నుతో రాసేవాడు. అలా రాసి లేకపోతే ఉత్తరం తీసుకునే వ్యక్తి దగ్గర ఆ సొమ్ము వసూలుచేసేవారు. ఈ పద్ధతి చాలా లోపభూయిష్ఠంగా ఉండేది. అందుకే రెండు శతాబ్దాల క్రితం పోస్టేజి స్టాంపుల్ని ప్రవేశపెట్టాడు రెండవకింగ్ ఛార్లెస్. ఒక పెన్నీ స్టాంపు అంటించిన లెటర్ లండన్‌లో ఏమూలకైనా చేరేలా వ్యవస్థను మరింత పటిష్టపరిచాడతను. తర్వాత 1840లో రోనాల్డ్‌హిల్ లెటర్ల బరువుని పట్టి అధికమూల్యం వసూలుచేసే పద్ధతికి అంకురార్పణ చేశాడు. క్రమేణా అదే మరింత పటిష్టమై ఈనాటి పోస్టల్ వ్యవస్థగా రూపుదాల్చింది.





## గ్రహాంతర శిశువు

గ్రహాంతరవాసిలా కన్పించే ఓ వింతశిశువుకి జన్మనిచ్చి, గొప్ప సంచలనాన్ని సృష్టించింది పెలిన్ అనే ఒకానొక ఫ్రెంచి యువతి. ఫ్రాన్స్ లోని డల్‌హౌజ్ గ్రామంలో జనవరి 16, 1988న పుట్టిన ఆ శిశువుకి చెవులు మొనదేలి విచిత్రంగా ఉన్నాయి. మిగిలిన రూపురేఖలు కూడా చాలా అసాధారణంగా ఉన్నాయి. ఆ బిడ్డకి తండ్రెవరన్న అంశంమీద చాలా కథలు ప్రచారంలోకి వచ్చాయి. కారణం అసలా అమ్మాయికి ఇంతవరకూ పెళ్ళేకాలేదు.

ఆ అమ్మాయి తాలూకు ఫామిలీ డాక్టర్ కథనం ప్రకారం-

''ఒకానొకరోజు ఆఫీసు నుంచి ఇంటికి వెడుతున్న పెలిన్‌ని ఎగిరేపళ్ళాలమీద వచ్చిన కొందరు విచిత్ర వ్యక్తులు కిడ్నాప్ చేశారు. వారంతా నారింజకాయలవంటి కళ్ళతో, కొనదేలిన చెవులతో, పొట్టిగా ఉన్నారు. ఆమెను తమ గ్రహానికి తీసుకుపోయి వారెన్నో రకాల పరీక్షలు చేశారు. అనంతరం కృత్రిమ గర్భోత్పత్తికి అవసరమైన ప్రయోగాన్ని కూడా ఆమెపై ప్రయోగించి, తిరిగి గుట్టుచప్పుడుగాకుండా తెచ్చి ఈలోకంలో వదలివెళ్ళిపోయారు. తత్ఫలితంగానే ఆమె గర్భవతి అయింది. ఈ విషయాలన్నీ ఆమెను హిప్నటైజు చేయడం ద్వారా రాబట్టాను నేను'' అంటాడా డాక్టర్.

''డాక్టర్‌గారు చెప్పింది అక్షర సత్యం. ఇదంతా ఆ గ్రహాంతరవాసుల నిర్వాకమే! ఎందుకంటే నాకింతవరకూ ఏ పురుషుడితోనూ శారీరక సంబంధాలు లేవు'' అంటూ నమ్మబలుకుతోంది పెలిన్.

కాని ఇరుగుపొరుగులు ఇది నమ్మడంలేదు.

''పెళ్ళి కాకుండానే గర్భవతి అయినందుకు తననెవరూ తప్పుపట్టకూడదనే ఉద్దేశంతో పెలిన్ డాక్టర్‌తో కల్సి ఆడుతున్న నాటకం ఇది'' అని చెవులు కొరుక్కుంటున్నారు వారు.

హిప్నాటిజం ద్వారా అబద్ధాలు చెప్పే అవకాశమే లేదని కొందరు డాక్టర్లు అంటున్నారు. ఒకవేళ ఆ డాక్టర్ చెప్పేదంతా నిజమే అయ్యే పక్షంలో గ్రహాంతర వాసులనేవాళ్ళు నిజంగా ఉన్నట్లే మనం భావించాలి. అంతేకాదు ఈ పిల్లాడ్ని తీసుకుపోవడానికి ఆ విచిత్ర వ్యక్తులు మళ్ళీ వచ్చినా రావచ్చు. అందుకే ఎందుకైనా మంచిదని పోలీసులూ, శాస్త్రవేత్తలూ ఆ అమ్మాయి ఇంటిపై ఓ కన్నేసి ఉంచారు ప్రస్తుతం.





# డబ్బు పై చతుర సమీక్షలు

జూలై నెల 'చతుర'లో ప్రచురితమైన కె.చిన్నబాబు నవల 'డబ్బు'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## ఏదీ మనశ్శాంతి?

*(ప్రథమ బహుమతి రూ. 100/-లు పొందిన సమీక్ష)*

కలిమిలేములవల్ల కలిగే కష్టనష్టాలను ఒక వంక 'విశ్లేషణాత్మకంగా' వివరిస్తూనే మరోపక్క మనిషి జీవితంలో డబ్బుయొక్క ఆవశ్యకతను, ప్రాధాన్యతను పాఠకుల మనసుల్లో ప్రశ్నార్థకంగా మిగిల్చింది శ్రీ కె.చిన్నబాబుగారి నవల 'డబ్బు'. "డబ్బుతో చాలా కష్టాలు, సమస్యలు పరిష్కరించుకోవచ్చు. కానీ డబ్బు ఒక్కటే మనిషికి నిశ్చింత, మనశ్శాంతి ఇవ్వదు" ఇదీ- నవలద్వారా రచయిత స్థూలంగా చెప్పిన జీవితసత్యం. మరి కష్టాలు, సమస్యలు ఉన్నప్పుడు మాత్రం మనిషికి మనశ్శాంతి ఎక్కడుంది? అంటే- 'మనశ్శాంతి లేకపోవడం' అనేది డబ్బు లేనప్పుడూ, ఉన్నప్పుడూ ఉన్న సమస్యే. కాకపోతే డబ్బువల్ల సమస్యలు తీరిపోయినా, మనశ్శాంతి కలుగుతుందనుకోవడం భ్రమ కావచ్చు. డబ్బు వచ్చింతర్వాత తనవాళ్ళలో మరొక 'కొత్త కోణాన్ని' చూడగలిగిన అతడు అధికారం సంప్రాప్తించిన తర్వాత వారి ప్రవర్తనను ఊహించలేకపోయాడంటే ఆశ్చర్యంగా ఉంది. నిజంగా ప్రజాసేవ చేయాలనుకున్నప్పుడు కొడుకు వేరుపడినా బాధేమీ లేదన్నవాడు పదవిలో కొనసాగి ఉండవచ్చు కదా? తను ఎవరికీ పావులా ఉపయోగపడనని స్పష్టంగా చెప్పిఉండవచ్చుగదా? పదవికి రాజీనామా చేయడానికి వెనుకాడనివాడు దీనికి తెగించకలేకపోయాడంటే, బంధుప్రీతికి అతీతంగా ప్రవర్తించగలనన్న ఆత్మవిశ్వాసం అతనికి లేదన్నమాట.

కాని సత్యనారాయణకు మనశ్శాంతి కరువవడానికి ఇవేవీకాకుండా మరేదో కారణమున్నదన్పిస్తుంది. తనకు అయాచితంగా లభించిన డబ్బు తనలాగా ఇక్కట్లకు గురైన బాధాసర్పదష్టుల కోసం సద్వినియోగం చేసిన దాఖలాలు లేవు. కనీసం ఏవైనా చిన్న సంస్థలు నెలకొల్పి నలుగురికి బ్రతుకుతెరువు కల్పించవచ్చు. అటు తనకూ ఒక వ్యాపకం సృష్టించుకున్నట్టు ఉంటుంది. అప్పుడు మనశ్శాంతి లేకపోవడం అంటూ ఉండదు. తనడబ్బు నలుగురికీ ఉపయోగపడిందన్న తృప్తి ఉంటుంది కాబట్టి.

అన్నట్టు డబ్బు వచ్చినతర్వాత దానిని ఎలా సద్వినియోగం చేయాలా అనే ఆలోచన లేకుండా, డబ్బు రాకముందు- డబ్బు వచ్చిన తర్వాత తన బంధువుల. కుటుంబసభ్యుల గుణగణాల్ని విశ్లేషిస్తూ సమయమూ, డబ్బూ వృధాచేసిన సత్యనారాయణ ఆ డబ్బుతో తను సమాజానికి ఏ విధంగా ఉపయోగపడగలడో ఆలోచించలేకపోయాడు. 'మానవనైజం' ఔపోసన పట్టిన వ్యక్తి అయిఉంటే, వారి ప్రవర్తన లోకసహజం అని తెలిసీ దాన్నిగురించి ఇంతగా ఎందుకు బుర్రబద్దలు కొట్టుకున్నాడో అంతుపట్టదు. పైగా- "గుండెలోతులోనికి తొంగిచూసుకుంటే- ఎక్కడో ఏదో అసంతృప్తి బయటపడుతూనే ఉంటుంది. అందుకే నేను మనసులోతులలోనికి తొంగి చూసుకోదలచుకోలేదు' అని ఖచ్చితంగా చెప్పిన సత్యనారా




యణ చివరివరకూ 'ఆ పనే' తప్ప మరేదీ చేయలేదు. "ఛీ! వెధవడబ్బు మనసుకు సుఖమా? శాంతా?" అని నగటు మధ్యతరగతి మనుషులతో అనిపించడమే రచయిత లక్ష్యమైనట్టుంది.

—శేషు,
తిరుపతి.

## ఒక సూక్తి మౌక్తికం

**(ద్వితీయ బహుమతి రూ. 75/-లు పొందిన సమీక్ష)**

కె.చిన్నబాబు గారి "డబ్బు" నవల ఒక 'సూక్తి మౌక్తికం' అద్యంతం ఎంతో ఆసక్తికరంగా నవల నడిచింది. నవల చదివితే రచయితలోకొన్ని కాచి వడబోశాడా! అని అనిపిస్తుంది. 'డబ్బు' అన్నది ఆర్థిక సమస్యలను తొలగించవచ్చును. సంఘంలో మన గౌరవాన్ని పెంచవచ్చును. కానీ దానివలన ఇతర సమస్యలెదురవుతాయనీ, మనశ్శాంతి దూరమవుతుందనీ 'సత్యనారాయణ' పాత్ర తెలియజేస్తుంది. 'డబ్బు' అన్నది ఎంత ఆకర్షణీయమైనదో, ఎంతటి వారినైనా ప్రలోభ పెట్టి డబ్బే పరమావధిగా చేసి, మానవ విలువలను మంటగలిపి దిగజారుస్తుందో ఈ నవల చూపిస్తుంది. మితిమీరిన డబ్బువలన తృప్తికి దూరమవుతామని హెచ్చరిస్తుంది.

డబ్బు, అధికారం, నగలు మొ॥ వాటికే ప్రాముఖ్యతనిచ్చి, భర్తల వ్యక్తిత్వం జోలికిపోని సమాజంలోని కొంతమంది స్త్రీలకు ప్రాతినిధ్యం వహిస్తుంది కామేశ్వరమ్మ. వక్రమార్గాలలో సంపాదించలేని భర్త అంటే వీరికి అగౌరవం. ఇటువంటివారివలన భర్త, భార్యకి మానసికంగా, దూరమవుతాడు. ధనం మీద వ్యామోహంతో అంతస్తులను తూకంవేసి, ప్రేమించిన యువకులను గాయపరిచి, "దూరపు కొండలు నునుపనే" భ్రమపడే యువతులకు వసుంధర ఒక గుణపాఠం.

ఈనాటి రాజకీయ నాయకుల గూర్చి, వారి ఎన్నికలగూర్చి పెదవులపై తేనెపూసికొని ప్రజలను వాగ్దానాల వెల్లువలో ముంచే విధానం గూర్చి, తమకి లభించిన పదవులను దుర్వినియోగం చేయడం గూర్చి చాలా చక్కగా రచయిత వివరించారు. రాజేశ్వరి, పరంధామం వంటివారు ఏ ఎండకాగొడుగు పట్టగలరు. వారు ఎప్పుడూ సుఖపడగలరు. కానీ సత్యనారాయణ, పరాత్పరరావు వంటి ఆత్మశోధకులు నిజమైన తృప్తి, మనశ్శాంతి డబ్బులో, పదవిలో లేదని గ్రహించిననాడు వాటిని తృణప్రాయంగా త్యజిస్తారు. వారే వెలుగుబాటలు!

—టి.మంజుల,
విజయనగరం.

## ధనమేరా అన్నిటికీ మూలం

**(తృతీయ బహుమతి రూ. 50/-లు పొందిన సమీక్ష)**

సర్వజగత్తును మాయామోహితం చేసేది 'డబ్బే'నన్న నగ్నసత్యాన్ని రచయిత నగటు మనిషి సత్యనారాయణ జీవితాన్ని ఉదహరిస్తూ తెలియజేసిన తీరు అద్భుతం. 'డబ్బుకు లోకం దాసోహం' అన్న నానుడి పూర్వకాలంనుంచే వాడుకలో ఉంది. నగటు మనిషి సమస్యల వలయాన్ని ఛేదించేదీ, ధనవంతుణ్ణి సమస్యల సుడిగుండంలోకి తోసేసేదీ డబ్బే. ప్రతి మనిషికి తన ప్రాథమిక అవసరాలు తీరేంతవరకూ, వాటి కోసం డబ్బు సంపాదించాలనే తపన. అవి తీరాక రక్తం రుచి మరిగిన పులిలా డబ్బు వెనక, డబ్బు కోసం వెంపర్లాట. మనిషి తయారుచేసిన డబ్బే, ఆ మనిషిని తన చుట్టూ తిప్పుకుంటుందంటే అది మనల్ని ఎంత ప్రభావితం చేసిందో అర్థం అవుతుంది. నేరస్తుణ్ణి నేరం వైపుకు నెట్టేదీ, హంతకుణ్ణి హత్యచేయటానికి పురికొల్పేదీ చాలావరకు ధనమే అంటే అతిశయోక్తి కాదు.

డబ్బులేనప్పటి సత్యనారాయణ జీవితం నేటి మధ్యతరగతి మానవుడి జీవనగమనానికి ప్రతిబింబం అనిపించింది. సత్యనారాయణ ఈతిబాధలమధ్య పరాత్పరం సమస్యల్ని చర్చించడం ద్వారా సత్యనారాయణపట్ల మరింత జాలి కలుగకుండా రచయిత జాగ్రత్త పడ్డారు. నీతికి, నిజాయితీకి మారుపేరుగా నిలిచిన సత్యనారాయణకి డబ్బు వచ్చాక అత

నిలో తలెత్తిన మానసిక సంఘర్షణ నేటి సమాజంలో ఇంకా చచ్చిపోలేదనిపిస్తున్న పాప చింతన, మానవతావాదాలకి ప్రతీక.

ప్రపంచంలోని అన్ని సంబంధబాంధవ్యాలకు, ప్రేమాభిమానాలకు, ఆప్యాయతలకు మూలకారణం డబ్బేనన్న రచయిత వాదన కొంతవరకు సమంజసమే అయినా పవిత్రమైన మాతృప్రేమలోనూ పరస్పరానురాగభరితమైన భార్యాభర్తల సంబంధాలలోనూ కూడా డబ్బు చోటుచేసుకుంటుందనడం సబబుగాలేదు. తమ అవసరాలు తీరటంలేదే అన్న అసంతృప్తితోనో తమ అసహాయత కల్గిన చిరాకువల్లో భర్తని విసుక్కోవచ్చు. అంతమాత్రాన భార్యాభర్తల సంబంధాన్ని కూడా డబ్బుతో ముడిపెట్టడం అసమంజసం. ఆ మాటకొస్తే సత్యనారాయణ భార్యని విసుక్కున్న సందర్భాలు లేవంటారా? చివరికి సత్యనారాయణ పదవికి రాజీనామాతో ఈ సమాజంపై నిరసన ప్రకటించిన తీరు బావుంది. మనిషి జీవితానికి పరమార్థం ఏమిటి? తృప్తి ఎప్పుడు లభిస్తుంది? లాంటి అంతంలేని ప్రశ్నలని పాఠక లోకం మీదకి వదిలి తమ నవల ద్వారా పాఠకుల్ని ఆలోచింపచేసిన రచయితని అభినందించకుండా ఉండలేకపోతున్నాం.

—ఎ. రాధాశ్రీనివాస్,
కోదాడ.

## డబ్బు ఒక దాహం

*(రూ. 25/-లు పొందిన సమీక్ష)*

**డ**బ్బు ఆడించే నాటకాన్ని అద్దంలో చూపించినట్టు చిత్రించారు కె. చినబాబుగారు. డబ్బు నవల సాంఘికమే అయినా, అది అదృష్టం అన్న పదానికి తాత్విక నిర్వచనాన్ని అందిస్తుంది. డబ్బు మానవుడి నైతిక విలువలను పెంచనూగలదు. త్రుంచివేయనూగలదు. లౌకిక ప్రపంచంలో డబ్బు జయించలేని వస్తువులేదు, ఒక్క ప్రేమను తప్ప. డబ్బు సుఖాల్ని అందించనూగలదు, సమస్యల్ని సృష్టించనూగలదు. డబ్బు 'లేమి' అవమానాన్ని కల్గిస్తే, డబ్బు కలిమి అధికారాన్ని అందిస్తుంది. 'లేమి' ఈసడింపు తెచ్చిపెడ్తే కలిమి బంధుప్రేమే కాకుండా, ప్రజానీకపు అభిమానాన్ని గూడ చూరగొంటుంది. డబ్బు ఒక మత్తులాంటిది. సంపాదించే కొలది మరీమరీ సంపాదించాలనిపించే వ్యామోహాన్ని కల్గిస్తుంది డబ్బు.

జీవనగమనంతో ముడిపడివున్న డబ్బు అందించిన సుఖాల్ని తద్వారా ఆత్మీయుల అనురాగాన్ని అనుభవిస్తాడు సత్యనారాయణ. అధరాభిమానాల వెనుక పరచుకొని వున్న స్వార్థమనే నీలినీడల్ని గూడ గమనించగల్గి ధీచిత్తంతో ముందుకు సాగిపోతాడు
తన అధికారం పేదప్రజానీకానికి సేవచేయడానికి కాదని, తన బంధువులు, ఆత్మీయుల అవసరాలు తీర్చడానికని, తాను వారిని ఎదిరించలేని నిస్సహాయుడనని కుమిలిపోతాడు. ఈ నిజాలు తెలుసుకొన్న తర్వాత ఆత్మీయుల వత్తిడులకు లొంగి పక్కదారులు పట్టబోయి, వెంటనే తనను తాను సవరించుకున్న సంస్కారి సత్యనారాయణ. డబ్బు వ్యామోహాన్ని జయించి మానవత్వపు మహోన్నత ఆశయాల కోసం, తన పదవికి కూడా రాజీనామా చేసిన త్యాగధనుడు సత్యనారాయణ. డబ్బు సృష్టించే సమస్యల్ని సమర్థవంతంగా విశ్లేషించే నవల 'డబ్బు'.

— శమంత,
మల్లవరం.

## ఆచరించని ఆదర్శం

*(రూ. 25/-లు పొందిన సమీక్ష)*

**ఆ**ధునిక సమాజంలో డబ్బు ప్రాధాన్యతను ఒకపక్క వివరిస్తూ మరొకపక్క డబ్బు సంపాదన పాపపు కార్యంగా, అది సంపాదించేవాళ్ళు అందరూ చెడ్డవాళ్ళుగా వర్ణించడం చాలా సాహసం. భార్యాభర్తల బంధాన్ని కూడా డబ్బుతో కొలవడం, కుటుంబపు బంధాలన్నీ డబ్బుతోనే ముడిపడి ఉంటాయనుకోవడం పీనాసి మనుషులకు తప్ప శక్యం కాని విషయం.

ప్రతి విషయానికి మంచి, చెడు అనే రెండు దారులు వుంటాయి. తాను చెడు దారిలో ప్రయాణించినంత మాత్రాన అందరూ అక్కడికి అలాగే వచ్చి ఉంటారనుకోవడం పొరపాటు.




ఇదే డబ్బు సంపాదనను గురించి వివరిస్తూ ఎన్నో పుస్తకాలు వచ్చాయి. వాటిలో ప్రముఖంగా నెపోలియన్ హిల్ రాసిన 'థింక్ అండ్ గ్రో రిచ్'ను గురించి చెప్పాలి. ఒక సామాన్య మానవుడు శ్రమకు, సమయస్ఫూర్తిని, తెలివితేటలను, విల్‌పవర్‌ను పెట్టుబడిగా పెట్టి డబ్బు ఎలా సంపాదించవచ్చో రచయిత చక్కని ఉదాహరణలతో; ప్రముఖుల నిజజీవిత సంఘటనతో రాశారు.

కష్టపడి సంపాదించినది మాత్రమే మనిషికి సంతృప్తినిస్తుంది. లక్షలు కలిసి వచ్చినా సంతృప్తిని పొందలేకపోవడానికి అదే కారణం. డబ్బుతో సమస్యలు రావు. సమస్యలు సృష్టించుకొంటే వస్తాయి. అందరూ గౌరవిస్తున్నా సరే అది తనకు చెందినదిగా కాకుండా డబ్బు వల్ల వచ్చిన గౌరవంగా భావించడం; గత జీవితంలో తనను కాదన్నవారందరినీ వరుసగా అవమానించడం; దానివల్ల ఆనందం పొందడం మొదలైనవి సత్యనారాయణ మానసిక స్థితి బాగాలేదని తెలియజేస్తాయి.

సత్యనారాయణ సిద్ధార్థుని, శాస్త్రీజీని తనకు ఆదర్శంగా భావిస్తాడు. కాని వారి ఆదర్శాల దరిదాపులకు కూడా వెళ్ళడానికి ప్రయత్నించడు. ప్రజాసేవకోసమే పదవి అన్నవాడు, దానికోసం ప్రయత్నించనివాడు కూడా పదవిలోకి రాగానే ప్రజలకోసం ఏమీ చెయ్యడు సరికదా ఆ చెయ్యలేకపోవడమే పెద్ద ప్రజాసేవ అన్నట్లు నిట్టూర్చి పదవికి రాజీనామా చేస్తాడు. తను నిజంగా ప్రజలకు సేవ చేయాలని అనుకొంటే చేయలేడా - చెయ్యగలడు, కాని చెయ్యడు. ఇలా ప్రతి విషయంలో విఫలం అయ్యే సత్యనారాయణను అసంతృప్తి జ్వాల అంటుతుంటే ఏ వేదాంతం మాత్రం ఊరట కలిగించగలదు.

— నాగేశ్వరరావు,
కొరాపుట్.

## ఈ తరం గీత

*(రూ. 25/-లు పొందిన సమీక్ష)*

నవలలు రెండు రకాలు- ఆహ్లాదపరిచేవీ, ఆలోచింపజేసేవీ. జూలై నెల 'చతుర'లో వచ్చిన 'డబ్బు' నవల రెండో కోవకు చెందినది. ముఖ్యంగా మధ్యతరగతి మానవుని మనస్తత్వానికి దర్పణం పట్టింది ఈ నవల. సామాన్య మానవుని ఆలోచనలూ, ఆవేశాలూ, ఆదర్శాలూ, సమస్యలూ వీటినన్నిటినీ పాఠకుని మనసులో ఆవిష్కరించటంలో కృతకృత్యుడయ్యాడు రచయిత. ఎన్నుకున్న ఇతివృత్తం పాతదే అయినా సరళశైలిలో సూటిగా పాఠకుని మనస్సుకు హత్తుకునేలా ఉంది. ఈ లోకాన్నంతటినీ నడిపే ఇంధనం ధనం అనీ, ఆప్యాయతానురాగాలు కూడా డబ్బుతోనే ముడిపడి ఉంటాయనీ, ఒక వ్యక్తి వ్యక్తిగా గుర్తింపబడటానికి డబ్బు, అధికారాలే ముఖ్యావసరాలని చెప్తూనే- డబ్బుతో ఎన్ని సమకూరినా మనశ్శాంతి దొరకదని చెపుతుందీ నవల. అనేక సందర్భాల్లో పాత్రల మనస్తత్వాల్ని చక్కగా విశ్లేషిస్తూ, తన భావాల్ని జోడిస్తూ అనేక జీవనసత్యాల్ని గుర్తు చేస్తాడు రచయిత. మనకోసం మనం సృష్టించుకున్న డబ్బుకు మనమే బానిసలం కారాదని, ఆ డబ్బుకు దాసోహం అని ఆప్యాయతానురాగాల్ని విస్మరించకూడదని హెచ్చరిస్తూ, ఆ భావాల్ని వెల్లడించే ప్రశ్నల పరంపరతోనే ముగింపు పలుకుతాడు రచయిత. ముఖ్యంగా - నవల మొదలుపెట్టిన సంఘటనతోనే భిన్నరీతిలో, అదే సంఘటనతో ముగింపు పలకటం ప్రయోగాత్మకంగానూ, అద్భుతంగానూ ఉంది.

గాంధీగారిని ఆదర్శంగా భావించిన సత్యనారాయణ, రాజకీయాల్లో చేరాక చుట్టుముట్టిన సమస్యలను ధైర్యంగా ఎదుర్కోలేక చివరికి రాజీనామా చెయ్యటం అతనిలోని పలాయనవాదాన్ని (escapism) సూచిస్తుందేకానీ ఆదర్శాలని కాదు. అలాకాక గుండె ధైర్యంతో ఆత్మస్థయిర్యంతో ఎదురు నిలబడి, తన ఆశయాలకు అనుగుణంగా ధీరోదాత్తుడై వ్యవహరించి తన వ్యక్తిత్వాన్ని నిలుపుకున్నట్లు చిత్రించి ఉంటే ఆ పాత్రకు మరింత హుందాతనమూ, పరిపూర్ణత్వమూ చేకూరడమేకాక, బంగారానికి తావి అబ్బినట్లుగా ఉండి నేటి పాఠకులకు నిజంగా ఈ నవల- ''ఈ తరం గీత'' అనిపించేది.

— కె.వి.కృష్ణారావు,
ఆత్మకూరు.



# చతుర

సంపుటి: 13 సెప్టెంబర్ 1990 సంచిక: 8

రైతులకు తమ పంటలకు గిట్టుబాటుధర రాకపోవడానికీ, సమయానికి సరయిన వైద్యసహాయం అందక ఎందరో ప్రాణాలు కోల్పోవడానికీ, అలాంటి మరెన్నో సమస్యలకీ కారణం ఆ ఊరి రోడ్డే! అది పేరుకే రోడ్డు తప్ప ప్రయాణయోగ్యం కాదని అందరికీ తెలుసు. అయినా ఆ గ్రామీణులు తమ ఊరికి ఆ రోడ్డూ, దానికి ఆ పేర్లూ అనవసరమని అనుకుంటారు. అందుకు సమర్థనగా అనేక కారణాలు చెబుతారు.

అయితే, ఈ దేశం దౌర్భాగ్యమంతా రోడ్లలోనే ఉందని నమ్మే ఓ నవయువకుడు ఆ ఊరిలోదిగి ఆ రోడ్డునే తన పరిశోధనాంశంగా ఎన్నుకున్నాడు. ఆర్థికంగా, సాంఘికంగా అభివృద్ధి చెంది అనేకమంది సంపన్నులకు కూడా స్వంతమైన ఆ ఊరికి రోడ్డు లేకపోవటానికి అసలు కారణం ఏమిటి? వీళ్లకి సంస్కృతి, సౌకర్యం, మరో ప్రపంచం అక్కర్లేదా వంటి అతని ప్రశ్నలకి సమాధానం ఏమిటి? రోడ్డు వేయించుకొమ్మనే అతని ప్రతిపాదనకు, సలహాకు ఆ ఊరి ప్రజలు స్పందించిన వైనం ఎలాంటిది?

ప్రశాంతతకు మారుపేరుగా ప్రసిద్ధిచెందిన పల్లెల్లోని అంతర్గత రాజకీయాలనూ, వాటికి అమాయకులు బలవుతున్న తీరునూ, అక్కడి రోడ్లదుస్థితినీ సమగ్రంగా చర్చిస్తూ, ఆసక్తికరమైన కథాకథనంతో పి. చంద్రశేఖర అజాద్ వేసిన 'ది రోడ్' ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

"ఏమండోయ్ కృష్ణమూర్తిగారూ" పిలిచాను.

ఆయన నన్ను చూడకుండానే పరుగు లాంటి నడకతో వెళ్తున్నాడు. ఏమిటో మనిషెప్పుడూ హడావుడిగానే ఉంటాడు. ఓ వందపనులు నెత్తిమీద పెట్టుకొనిగానీ బయటకురాడు. అందులోనూ 'పాలెం' నుండి గుంటూరు వస్తున్నాడంటే మాటలు కాదు. అందరూ ఏదో ఒక పని చెబుతారు. అలాగని పాలెంలో ఉన్నప్పుడు తీరిగ్గానూ కనిపించడు. ఎప్పుడూ ఏదో ఒక హడావుడిలోనే ఉంటాడు.

నాకయితే కృష్ణమూర్తిని నిలబెట్టి సరదాగా కబుర్లు చెప్పాలనుంటుంది. అయిదు నిముషాలకోసారి "మరినే బయలుదేర్తా" అని అతనంటుంటే "వెళ్దువు గానిలే ఇంకేమున్నాయి విశేషాలు చెప్పు" అంటుంటాను నేను.

మా ఊర్లో విశేషాలేముంటాయ్. నువ్వయితే టౌన్లో ఉంటున్నావ్ కాబట్టి నువ్వేచెప్పాలి."

"మరి నేను చెబుతాను. పద ఆ హోటల్లో కూర్చుందాం" అంటే బలవంతంగా గానీ అంగీకరించడు.

ఈ హోటల్ విషయం కూడా తమాషాగా ఉంటుంది. కృష్ణమూర్తికి ఇష్టమైనవేమిటో నేను కనుక్కోగలిగాను. అవి సాంబారుఇడ్లీ... రోస్ట్ మినపట్టూ, చపాతీ కూర్మా.

ఆ బలహీనతవల్లే అప్పుడప్పుడూ నాతో మాట్లాడుతుంటాడు. అలాఅని కృష్ణమూర్తిని తిండికి ముఖంవాచి ఉన్నాడని పొరపాటు పడకూడదు. ఆయనలా కనిపిస్తాడుగానీ అయిదెకరాల మాగాణిపొలం ఉంది. అందులో రకరకాల పంటలు వేస్తాడు.

కృష్ణమూర్తి గురించి పాలెంవారు చాలా సరదాగా మాట్లాడుకుంటారు. మట్టినిపిండి డబ్బాలకు డబ్బాలు నూనె తయారుచేయగలడట. దేశమంతా వానలు పడకపోయినా కృష్ణమూర్తి కంగారు పడిపోడు. తన పొలం మీదుగా ఓ మబ్బుతునక తేలితే చాలు. దాన్లో బిందెలు బిందెలు ముంచుకొని తన పొలం తడుపుకుంటాడట.

ఇలాంటివే ఇంకా చాలా చాలా విషయాలు చెప్పుకుంటారు.





అలాంటి కృష్ణమూర్తి చాలాకాలం తర్వాత కనిపించేడు. ఈ నడుమ ఎందుకో తను గుంటూరు రావటం లేదు. నామాట వినపడలేదో, వినిపించినా నన్ను తప్పించుకోవటానికి వినపడనట్లుగా వెళ్ళిపోతున్నాడో తెలియదు.

నేనయితే వదిలిపెట్టదలుచుకోలేదు. అందులోనూ 'పాలెం' నుండి ఈ నడుమ కబుర్లు ఏమీ తెలియడంలేదు. వారి విషయాలు తెలుసుకోవటానికి నాకున్న మార్గాల్లో ఈ కృష్ణమూర్తిగారొకడు.

నేను పరుగులాంటి నడకతో వెళ్ళి కృష్ణమూర్తిగార్ని పట్టుకొని నిలేశాను.

"ఏమిటండీ బాబూ... పిలుస్తుంటే వినపడనట్లు పరిగెత్తుతున్నారు"

"వినపడలేదయ్యా. అదిసరే తొందరగా చెప్పు. నాకవతల చాలా పనుంది. వెళ్ళిపోవాలి" అన్నాడు.

"మీకది మామూలేగా. అయినా మీకు పనిలేనిదెప్పుడు చెప్పండి. ఇక్కడ కొత్తగా హోటల్ తెరిచారు. అందులో కూర్చుని మాట్లాడుకుందాం పదండి" అన్నాను.

"ఏంకాదులే. ఇది పాతహోటలేగా. నాకు తెలుసులే. నన్నీరోజుకు విడిచిపెట్టు. అవతల నాకు చాలాపనుంది." అన్నాడు తిరిగి.

"లేదండీ. అది పాతహోటలేగానీ, మానేజ్మెంట్ మారింది. మీకు తెలుసుగా కొత్త మేనేజ్మెంట్వస్తే ఓ నెలరోజులపాటు సాంబారు చిక్కగా ఉంటుంది. చపాతికూర మాంసంకూరలా ఉంటుంది. వెళ్దాంరండి" అన్నాను.

కృష్ణమూర్తి ముఖంలో నేననుకున్న మార్పు కనిపించింది.

అంతలోనే అన్నాడు

"లేదుబాబూ. ఇప్పుడు హోటల్అంటూ కూర్చుంటే ఇంకో గంటలేటయిపోతుంది. నిజంగానే చాలాపనులున్నాయి. ముందసలు 'పాలెం'లో ఎలాఉందో నాకు అర్థంకావటం లేదు" అన్నాడు.

ఏమిటో! కృష్ణమూర్తి బాంబొకటి పేల్చాడు!

"పాలెంలో ఎలా ఉండటమో ఏమిటి?" అన్నాను కుతూహలంగా

"నిజానికి నేనీరోజు రావాలనుకోలా. పను

లుండి తప్పనినరైవచ్చా''

"ఏ విషయంలో... ఏమైనా తగాదాలా?'' తిరిగి అడిగాను

"తగాదాలా అంటే ఓ రకంగా అదే అనుకుంటా''

"కృష్ణమూర్తిగారూ కొంచెం వివరంగా చెప్పొచ్చుకదా'' అన్నాను.

అదేనయ్యా మాఊరి రోడ్డుగురించి ఏదో మల్లగుల్లాలు పడుతున్నారు'' అన్నాడు.

నాకు నవ్వొచ్చింది. పాలెంది రోడ్డుట! సరే ఆ విషయానికి తర్వాత రావచ్చు.

"ఎవరెవరు పడుతున్నారు? ఎందుకు పడుతున్నారు? అర్థమయ్యేట్లు చెప్పండిబాబూ'' అన్నాను.

"అంత వివరంగా చెప్పటానికి నాకు టైంలేదు. ఇంకో నాలుగురోజుల్లో నేను గుంటూరు రావలసిన పనుంది. అప్పుడు మీఇంటికొచ్చి అన్నీచెబుతా. నరేనా'' అనేసి ముందుకు నడిచాడు.

"మాఅక్కావాళ్ళు ఎలా ఉన్నారు?'' వెనక నుంచి అరిచాను.

"బానే ఉన్నారు'' అనేసి వేగంగా ముందుకు వెళ్ళిపోయాడు. నేనలా తనని చూస్తూ ఉన్నాను. ఒక్కసారిమాత్రం వెనక్కితిరిగి చెయ్యిఊపి వెళ్ళిపోయాడు.

కృష్ణమూర్తి మాటల్ని ఎలా తీసుకోవాలో ఒక్కోసారి అర్థంకాదు. ఏ విషయాన్నయినా తన పద్ధతిలోనే వివరిస్తాడు. అతను కంగారుపడి సీరియస్‌గా చెప్పే విషయాలు 'ఓస్ ఇంతేనా' అనిపిస్తాయి. అతనెప్పుడూ అలానే చెబుతాడనుకోవటానికి కూడా లేదు. కృష్ణమూర్తి ఎప్పుడూ ఇంతేలే... గోరంతలు కొండంతలు చేసి చెబుతాడు అనుకుంటే అవి నిజంగానే సీరియస్ విషయాలవుతాయి.

ఇంతకూ విషయం పాలెం రోడ్డుగురించి

అందులోనూ మల్లగుల్లాలు పడుతున్నారుట!

నాకెందుకో 'పాలెం'ది రోడ్డు అనుకోవాలంటేనే నవ్వు వస్తుంది. మా అక్కను 'పాలెం'లోనే ఇచ్చాం. మా బావావాళ్ళు మొదట్నుండీ ఆ ఊరిలోనే ఉండేవారు. అప్పట్లో నేను చిన్నపిల్లవాడిని. అక్కపెళ్ళికి పాలెం వెళ్ళిన గుర్తు కలగా ఉంది.

అయితే మేం ఓ బండిలో వెళ్ళేవాళ్ళం. బండి ఎక్కటానికి కింద ఎత్తుపాటి స్టూల్ నుంచేవారు. బండిలో కూడా కూర్చోవటానికి బాగా గడ్డిపరిచి దానిమీద గోతాలు వేసేవారు. అయినా కూడా మేం చాలా ఇబ్బందులు పడిన గుర్తు. మా బావగారిది పాలెమే అయినా అక్కపెళ్ళి తర్వాత అక్కడెప్పుడూలేరు. వ్యాపారం కోసం వాళ్ళు విజయవాడ వచ్చారు.

మా బావ బాగానే సంపాదించాడు. ఆయన కెందుకో పట్నవాతావరణంతో విసుగొచ్చింది. అందుకే తిరిగి పాలెంలో పొలాలుకొని వ్యవసాయం చేయటానికని వెనక్కి వచ్చేడు. పిల్లల్ని మాత్రం రెసిడెన్షియల్ స్కూల్స్‌లో చేర్పించారు. ప్రస్తుతం అక్కడ ఉండేది- అక్కా బావా మాత్రమే.

ఇలా బంధుత్వం రీత్యాకాకపోయినా, 'పాలెం'లో నాతోపాటు చదువుకున్న స్నేహితులున్నారు. ఇంకా అక్కడ సాహిత్యంమీద పట్టు ఉన్న ఓ గాంధేయవాది కూడా ఉన్నాడు. ఇంకా మరికొందరు కూడా నాకు పరిచయం. అక్కపెళ్ళి తర్వాత ఒకటి రెండుసార్లు వెళ్ళినా ఆ రోడ్డు అలానే ఉంది. ఈ నడుమ కూడా పెద్దగా మార్పేమీ ఉండదనే అనుకుంటున్నాను.

అక్కవాళ్ళు తిరిగి 'పాలెం' వెళ్ళాక రమ్మంటూ ఒకటే గొడవ నాకయితే ఇంతవరకూ వెళ్ళటానికి తీరికదొరకలేదు. అక్కడ చాలా ప్రశాంతంగా ఉంటుంది. ముఖ్యంగా ఆ వాతావరణం చాలా బాగుంటుంది. మా బావ తిరిగి వెనక్కి వెళ్ళటానికి అదోకారణం అయి ఉండాలి.

మొత్తంమీద చూసుకుంటే 'పాలెం'లో పెద్దగా గొడవలు లేనట్లే. గుంటూరు జిల్లాలోనే ఓ మూలగా 'పాలెం' ఉంది. మంచి సంపన్నవంతమైన గ్రామం. పెద్దపెద్ద మోతుబరుల్తో పాటు, మధ్యతరగతిరైతులూ, వ్యవసాయ కూలీలు కూడా ఉన్నారు. ఇంకా రకరకాల వారున్నారు. వారందరూ పూర్తిగా ఐకమత్యంతో ఉన్నారని చెప్పటానికిలేదు. అసలు గొడవలే లేవని చెప్పటం నా ఉద్దేశంకాదు. గొడవల

పేరుతో ఆ గ్రామం ఎప్పుడూ వార్తల్లోకి రాలేదు. అలాంటివి మినహాయిస్తే కొద్దోగొప్పో గొడవలు ఉండి అంటాయి.

జిల్లాలో ఉన్న షావుకార్లలో 'పాలెం' షావుకార్లు కూడా కొందరు. ఇంకా విదేశాల్లో డాక్టర్లుగానూ, ఇంజనీర్లుగానూ స్థిరపడిన వారిలో 'పాలెం' కుటుంబాలూ ఉన్నాయి. రాజకీయంగా చూసినా కాంగ్రెస్ పార్టీలో ఉంటూ ప్రముఖంగా గుర్తింపబడిన వ్యక్తులూ అక్కడ అన్నారు. అలాంటి 'పాలెం'కు రోడ్డులేదు. ఇదేదో స్వాతంత్ర్యం రాకముందున్న 'పాలెం'కాదు... ఇరవయ్యో శతాబ్దం మరికొన్ని సంవత్సరాల్లో నిష్క్రమిస్తున్న నాటిరోజుల్లో ఉన్న 'పాలెం'.

'పాలెం'కు అయిదారు మైళ్ళదూరంలో ఓ చిన్నపట్నం ఉంది. అక్కడ నుండి 'పాలెం'కు బస్సులో వెళ్ళాలంటే నిర్ణీత వేళలున్నాయి. ఆ వేళదాటితే మరో నాలుగు గంటలు బస్‌కోసం నిరీక్షిస్తూ గడపాల్సిందే. ఆ బస్ కూడా చాలా తమాషాగా ఉంటుంది. అది బయలుదేరింది గదాని సంతోషించటానికిలేదు. ఏ క్షణమైనా, ఎక్కడైనా ఆగిపోవచ్చు. వీలయితే ఆ డ్రైవరూ, క్లీనరూ కలిసి బాగుచేస్తారు. లేదా మెకానిక్ వచ్చి బాగుచేయటానికి ఓ రోజే పట్టొచ్చు. ఆ దారంతా ఎర్రటి దుమ్ముతో నిండి ఉంటుంది. పైగా ఆ రోడ్డంతా కూడా గుంటలు. ముంపివాన కురిస్తే బస్‌లు తిరిగే పనే ఉండదు. రోడ్డు పక్కచెట్లన్నీ దుమ్ముతో నిండి ఉంటాయి. ఆ ప్రయాణం కూడా చాలా దుర్భరంగా ఉంటుంది. గొర్రెల్ని దొడ్లోకి తోలినట్లు మనుషుల్ని ఆ బస్‌లో కుక్కుతారు. బస్ బయలుదేరేంతవరకూ చెమటవాసన. బయలుదేరిన దగ్గర్నుంచి ఎర్రటిదుమ్ము. వరసగా రెండు సంవత్సరాలపాటు ఆ రోడ్డుమీద ప్రయాణం చేస్తే ఖచ్చితంగా జీవనకాలంలో కొంతమేరకు తగ్గిపోతుంది. ఇంకా ఆ బస్‌లో చిన్నచిన్న మూటలు, పాలూ, పెరుగూ తట్టలూ, చిన్నచిన్న జంతువులూ, ఒక్కోసారి ఎంతురెయ్యాల వాటినా. అబ్బో అదో మహాప్రపంచం. అలాంటి రోడ్డుమీద, ఆ ప్రత్యేకమైన బస్‌లో ఓ గంటపాటు ఇబ్బందిపడితే ఓ చోట ఆపుతాడు.

అది పాలెం వెళ్ళే అడ్డరోడ్డు. అక్కడి నుంచి రెండు మైళ్ళు నడవాలి. అప్పుడుగాని మనగమ్యం చేరుకున్నట్లుకాదు. ఈ తలనొప్పంతా ఎందుకు రిక్షాలో పోదాం అనుకుంటే మనిషికి పదిరూపాయలు అడుగుతారు. అది కూడా బస్‌లోనే పాలెం వచ్చేవారికోసం ఎదురుచూడాలి. నలుగురయిదుగురు దొరికితే అందర్నీ ఎలానో సర్ది ఓ ఆర్రూపాయలు మాత్రం తీసుకుంటారు. ఈ రిక్షాలూ ఎప్పుడూ ఉండవు. పొలం పనులు జోరుగా సాగుతున్నప్పుడు అందరూ ఆ పనులకే వెళ్తారు. అవిలేనప్పుడు మాత్రమే కొంతమంది రిక్షాలు తొక్కుతుంటారు. వర్షాకాలంలో ఇంక చెప్పుకునే అవసరమే లేదు. చెప్పులు కూడా వేసుకోనవసరంలేదు.

అలాంటి పాలెంలో రోడ్డు విషయమై మల్లగుల్లాలు పడుతున్నారు. అంటే తర్జన భర్జనలేనా? అంతవరకయితే ఫర్వాలేదు.

నాకు ఇదంతా చూస్తుంటే ఇదేమంత సామాన్యమైన విషయంలా కనపడటంలేదు. ఇంతకాలం నాకు 'పాలెం' గుర్తొచ్చినప్పుడల్లా ఆ రోడ్డును కూడా తలుచుకునేవాడిని. అంతటితో ఆ జ్ఞాపకం తెగిపోయేది. కానీ ఇప్పుడనిపిస్తోంది.

ఓసారి నేను 'పాలెం' వెళ్ళిరావాలి.

అక్కకూడా గొడవపెడుతూంది-కృష్ణమూర్తిలాంటి వారితో కబురు చేస్తుంటుంది.

"ఓసారి మా వాళ్ళను వచ్చి వెళ్ళమనండి. జొత్తిగా రావటంలేదు" అంటూ. నాకు వెళ్ళాలనే ఉంటుంది. వెళ్తే చాలా బాగుంటుంది కూడా. ముందు అక్కావారింట్లో మంచి పాలూ, పెరుగూ దొరుకుతాయి. మరీ ముఖ్యంగా పాలను బొగ్గుల కుంపటిమీద, సన్నటి సెగలో వేడిచేసి మట్టికుండల్లో తోడేస్తారు. అప్పుడు తయారైన పెరుగు ఎంతతియ్యగా ఉంటుందో. అంతేకాదు మా అక్కవంట చాలా అద్భుతంగా చేస్తుంది. అందులోనూ 'అరకోళ్ళు' ఆ ప్రాంతంలో బాగా దొరుకుతాయి. ఇంకా ఆ పొలాల్లోనే మంచిబలమైన బొమ్మిడాయిలు దొరుకుతాయి. ఇవన్నీ మాకూదొరుకుతాయి. అయితే వీటిని శుభ్రం చేయటం అమ్మవల్లకావటంలేదు. ఇవన్నీ మొహం మొత్తేదాకా తినొచ్చు.

కాకపోతే ఒకటే సమస్య.కాలంఅంత త్వరగా

గడవదు. కనీసం ఉదయాన్నే పేపర్ కూడారాదు. వచ్చినా ఏ ఒకటో ఆరోవస్తుంది. అది కూడా ఏ మధ్యాహ్నామో వస్తుంది. మిగతా పుస్తకాలు కూడా పెద్దగా దొరకవు. ఏ ఇంట్లోనైనా కొన్ని పాతపుస్తకాలు దొరుకుతాయి. వాటినే చదువుతూ కూర్చోవాలి. అయితే ఊరుమాత్రం చాలా బాగుంటుంది. ముఖ్యంగా ప్రశాంతంగా ఏ పనైనా చేయాలనుకుంటే అందుకునరైన వాతావరణం అదే. నేను చాలాకాలంగా అక్కడికి వెళ్ళాలని అనుకుంటున్నా ఇప్పుడు నేను వెళ్ళాలనుకుంటున్నది మాత్రం ఆ రకంగాకాదు. ఓ రకంగా నేను 'పాలెం' చరిత్రనూ, పాలెం రోడ్డు చరిత్రనూ కూడా అధ్యయనం చేయటానికి వెళ్ళాలి. నాకు తెలిసిన వారందరితోనూ మాట్లాడాలి.

నాకెందుకో ఈ విషయం ఊహించుకుంటున్నకొద్దీ రకరకాల ఆలోచనలు ముసురుతున్నాయి. నేనిప్పుడు విశ్లేషించాల్సింది ఆ రోడ్డునుమాత్రమే కాదు. ఓ పరిణామ కార్యక్రమాన్ని అనుకుంటాను. నాకున్న ఆరాటాల్లో ఏదైనా అంశంమీద పరిశోధన చేయాలనేది ఒకటి. చాలాకాలం పి.హెచ్.డి.లాంటి డిగ్రీలు సాధించాలని నాకుండేది. అందుకోసం ఎలాంటి విషయాన్ని ఎన్నుకొంటే బాగుంటుందా అనిపిస్తుండేది.

అనేక కారణాలవల్ల అది సాధ్యంకాలేదు. అయితే నాలో ఆ జిజ్ఞాస చావలేదు. ఇప్పుడు నా దృక్పథంలోనే కొంత మార్పు వచ్చింది. డిగ్రీలకోసమే ఓ విషయాన్ని పరిశోధించాల్సిన అవసరంలేదు. ఈ సమాజంలోని ఏ అంశమైనా పరిశోధించదగింది అనుకున్నప్పుడు అందుకు ఎవరో ఒకరు పూనుకోవాలి. వారు కనుక్కున్న విషయాన్ని అందరూ ఆమోదిస్తారనో, ఆమోదించాలనో అనుకోవటంకూడా మంచిది కాదు. ప్రభుత్వంవారు డిగ్రీలందించే సిద్ధాంతాలు కూడా చాలా వివాదాస్పదమైనవే. నాకిప్పుడు అనిపిస్తోంది. ఇంతటి అద్భుతమైన విషయం నాకళ్లముందే ఉంటే ఇంతవరకూ నా దృష్టి అటు లేనేలేదు. కృష్ణమూర్తి మాటల తర్వాతనే నాలో ఈ ఆలోచన వచ్చింది.





ఇంకేమాత్రం ఆలస్యం చేయదలుచుకోలేదు. సరాసరి ఇంటికొచ్చేశాను. సూట్‌కేస్‌లో బట్టలు సర్దుకొంటుంటే అమ్మ వచ్చింది.

"ఏమిట్రా? ఎక్కడికన్నా ప్రయాణమా?"

"అవునమ్మా అక్కదగ్గరకు 'పాలెం'వెళ్తున్నా"

"అదేమిట్రా ఇంత హడావిడిగా బయలుదేరితే ఎలా? ముందు చెబితే ఏమన్నా చేసిచ్చేదాన్నిగా" అంది.

"నేను కూడా వెళ్లాలనుకోలేదు. ఇంతకుముందే బజార్లో కృష్ణమూర్తి కనిపించి చెప్పాడు"

"ఏం చెప్పాడు?"

"ఆ ఊరి రోడ్డుగురించి మల్లగుల్లాలు పడుతున్నారు. " అన్నాను

అమ్మ ముఖంలో ఒక్కసారిగా మార్పు వచ్చింది.

"ఆ మల్లగుల్లాలు ఎప్పుడూ ఉండేవేలే. సంవత్సరానికో, నాలుగు సంవత్సరాలకో ఎవరో ఒకరు రోడ్డు వేయించాలనో, రోడ్డు కావాలనో గొడవ చేస్తారు. అప్పుడు మొదలవుతుంది. నేను పుట్టినప్పటినుంచి వింటున్నా. ఆ ఊరికి రోడ్డు కావాలి కావాలనటమే. ఎవరూ ముందుకు రారు. నాకా 'పాలెం' అంటేనే మంట. అసలు మీ నాన్నగారు ఈ పాలెం సంబంధంగురించి చెప్పినప్పుడు మనకీ సంబంధం వద్దు బాబో అని మొత్తుకున్నా ఆయన వింటేనా?" అంది

"ఎందుకనమ్మా రోడ్డు లేదనేనా?" అన్నాను

"రోడ్డు లేదని కాదు. ఆమాటకొస్తే దేశంలో అన్ని ఊర్లకూ రోడ్లున్నాయా? అంతదాకా ఎందుకు మా ఊర్లో నా చిన్నప్పుడు రోడ్డులేదు. మేంకూడా ఎక్కడికన్నా వెళ్లటానికి బాధపడినవాళ్లమే. అప్పటికీ మాకు ఎడ్లబండి ఉండేది. ఆతర్వాత మాకు రోడ్డొచ్చింది. బస్సులొచ్చాయనుకో. అందుకు కాదు నేను చెప్పేది. ఆ ఊర్లో మనుషుల తీరే వేరు."

ఇన్ని సంవత్సరాలలోనూ అమ్మ ఎప్పుడూ ఇలా మాట్లాడి ఎరగదు. పైగా ఆ ఊరిగురించి తన అభిప్రాయాన్ని సూచాయగానైనా వెల్లడి చేయలేదు.

"ఎందుకమ్మా... అసలేమైనా జరిగిందా?"

అన్నాను. "వాళ్లు ఏమైనా చేస్తార్రా. మాకు తెలిసిన వాళ్లఅమ్మాయిని ఆ ఊరే ఇచ్చారు. ఆ అమ్మాయి నాలుగేళ్లు కాపురం చేశాక ఓరోజు బావిలో పడి చచ్చిపోయిందని కబురు చేశారు. అసలు తోసింది వాళ్లే. ఆ అమ్మాయి బావిలోనుండి ఎంతరిచినా ఒక్కరన్నా ముందుకు రాలేదు. ఇంత జరిగితే ఆ ఊర్లో ఇదేమిటన్నవాడు లేడు. అదేంటో ఆ ఊర్లో చిత్రమైన రూల్సుంటాయి. ఇంకా ఆస్తులకోసం స్వంత మనుషుల్ని చంపుకున్నవాళ్లు చాలా మంది ఉన్నారు. నాకా ఊరిపేరు తలుచు కుంటేచాలు... ఆ అమ్మాయి గుర్తుకొస్తుంది. పోనీలే అది ఆ పాలెంలో ఉండటంలేదుకదా అని తృప్తి పడ్డాను. మళ్లీ తీసుకెళ్లి మీ బావ అక్కడే కాపురం పెట్టాడు" అంది.

"అదెప్పుడో జరిగిన సంఘటన. అయినా ఆ అమ్మాయి విషయంలో ఊరంతా ఎలా బాధ్యత వహిస్తుంది? ఆ మాటకొస్తే ఇలాంటి సంఘటనలు చాలా ఊర్లలో జరిగాయి. అంత మాత్రాన ఆ ఊర్లో వారందరినీ అలానే అను కుంటామా?"

అమ్మ నాకేసి విసుగ్గా చూసి అంది

"నీకు తెలియదురా. ఆ ఊరే అంత. అసలు నాకు తెలియక అడుగుతాను. అంత కంటే దరిద్రమైన ఊర్లు చాలా ఉన్నాయి. వాటికి రోడ్లున్నాయి. మరీ ఊరికి రోడ్డెందుకు లేదో నాకు చెప్పు" అంది.

నేను మాట్లాడలేదు. ఏదో విషయం గుర్తొచ్చి ఆలోచనల్లోపడ్డాను. "ఏమిట్రా అలా చూస్తావ్. ఆ ఊర్లోవారికి కావాలంటే రోడ్లు వేయించుకునే స్తోమతు లేదంటావా? వాళ్లు తలుచుకుంటే అలాంటి రోడ్లు వెయ్యిదాకా వేయించగలరు. అసలు వాళ్లకి రోడ్లు అవసరంలేదు. అంటే అంతగా అయితే ఆ వర్షాకాలం నాలుగునెల లూ ఇబ్బందిపడతారు. మళ్లీ మామూలే. నీకింకా తెలియదు. ఆ కాలవమీద రోడ్డు కూడా ఆ నడుమే వేశారు. ఆ ఊరికి అన్నిపక్కలా రోడ్లేశారు. అదేం కర్మో దానికే దిక్కులేదు. నా అనుమానం ఆ కాలవమీద రోడ్డు వేసినందుకే వీళ్లకి కడుపు మండిఉంటుంది. వాళ్లకి అలివి కాక ఊరుకొనుంటారుకానీ లేకపోతే ఆరోడ్డు కూడా ఎందుకని చెప్పి మాన్పించి ఉండేవా ళ్లు" అంది.

అమ్మ ఆవేశం చూస్తుంటే నాకు నవ్వుకూడా వస్తోంది

"అదేంటమ్మా, అలా మాట్లాడుతున్నావ్" అన్నాను

"అంతేరా అక్కడ అందరూ అంత గొప్ప పావుకార్లుకదా.ఏం చెంబులు పట్టుకొని చీకట్లు పడ్డాక ఆ పొలాలమధ్యకు వెళ్లకపోతే వెయ్యి రూపాయలు ఖర్చుపెట్టి దొడ్లు కట్టించుకోలే రూ! ఆమాత్రం డబ్బులేక ఛస్తున్నారా? మళ్లీ ఎక్కడికన్నా వస్తే చాలు రాజసాలు. ఆ 'పాలెం' గొప్పలన్నీ కురిపించబోతారు. అసలు నీకు తెలియదు. కొన్ని ఊర్లకు కొన్ని సంప్రదా యాలుంటాయి. ఆ ఊర్లో నవ్వుతూ గొంతులు పిసకటం ఓ సంప్రదాయం" అంది ఇంక నవ్వు ఆపుకోవటం నా వల్ల కాలేదు.

అమ్మకు తెలిసిన ఆ అమ్మాయి మరణం ఆమెనంతగా కదిలించి ఉండవచ్చు, లేదా ఇంకెవరైనా ఆమెను గాయపరిచారేమో

అసలు ఏరకంగా చూసినా ఆధునికతా, విజ్ఞానం కొత్త ఎత్తులకు చేరుతున్న దశలో ఆ ఊరికి రోడ్డు లేకపోవడం అనేది పెద్ద ప్రశ్నే మరి!

నాకో రచయిత మిత్రుడున్నాడు. తను కథ లూ, కవిత్వంకూడా రాస్తుంటాడు. నాదగ్గరకొ చ్చినప్పుడల్లా అంటుంటాడు

"ఏమైనా మంచి సబ్జెక్టులుంటే చెప్పకూడ దూ" అని

"మంచి సబ్జెక్టలనగానేమి" అంటుంటాను సరదాగా

తనేమో పోటీలకు రాస్తుంటాడు- ఎక్కువగా అందులోనూ గుండెల్ని పిండే కరుణ రస కథల్ని బాగా రాస్తాడు. సెంటిమెంట్ కావాలనే వాడు కొత్తలో. ఆ తర్వాత తన ధోరణి మార్చు కున్నాడు. ఇప్పుడు సస్పెన్స్, థ్రిల్లర్స్ కావా లంటాడు. ఒకప్పుడు బాగా రాయటానికి ప్ర యత్నం చేస్తున్నాడులే అనిపించేది. నాకెందు కో ఇప్పుడు తన్లో మరోరకమైన తాపత్రయం కనిపిస్తోంది. ఏది ఏమైనా తనకు ఈ సబ్జెక్ట్ గురించి చెబితే ఏమనుకొంటాడు! నాకయితే రాయటం చేతకాదుగానీ ఈ 'రోడ్' అద్భుత



మైన విషయం కాదూ! అమ్మ లోపలకు వెళ్ళి అప్పటికే ఏదో ఓ పొట్లాం తయారుచేసింది.

"ఎందుకమ్మా ఇవన్నీ" అన్నాను.

"అదేంట్రా ఆడపిల్ల దగ్గరకెళ్తూ ఏం తీసుకువెళ్ళకుండా ఎలా వెళ్తావ్?"

"అక్కేమన్నా చిన్న పిల్లా? అక్కకే నేను చిన్న పిల్లవాడిని. పైగా అక్క పిల్లలు కూడా అక్కడలేరు. నువ్విచ్చేవి అక్క దగ్గర లేకనా" అన్నాను.

"నీకు తెలియదురా. ఆడపిల్లలకెప్పుడూ పుట్టింటిమీద ఆశ ఉంటుంది. అయినా అక్కకు ఇవన్నీ లేవనా...అదంతే. మళ్ళీ ఎప్పుడొస్తావ్?

"ఏమో చెప్పలేను"

"అదేంటిరా?"

"అవునమ్మా ఇప్పుడు నాకు పాలెం చరిత్ర గురించీ, అక్కడి మనుమల గురించీ, అక్కడ లేని రోడ్డు గురించీ పరిశోధన చేయాలనిపిస్తోంది."

"అంటే ఏంచేస్తావ్?" అంది కంగారుగా

"ఏం లేదు. ఎందుకని వారందరూ అలా జీవిస్తున్నారో తెలుసుకోవాలనుకుంటున్నాను".

"తెలుసుకొని ఏంచేస్తావ్?" అంది.

"ఏదో చెయ్యాలని కాదు. తెలుసుకోవాలి. ముందు నాకా విషయాలన్నీ అర్థం కావాలి. అందుకోసం ప్రయత్నం చేస్తా"

"అది కాదురా. ఇంత చదువు చదివావు. ఏదన్నా ఉద్యోగం చూసుకొని అందులోపడితే బాగుంటుందిగానీ ఇలా రోడ్లమీద పరిశోధనలేమిటి? నీకు ముందే చెప్పాగా ఆ ఊరిజనం అంత మంచి వాళ్ళు కాదని. అయినా ఇలాంటి విషయాలు నీకెందుకూ?" అంది అయిష్టంగా.

నాకింతవరకూ పెళ్ళి కాలేదు. పోస్ట్ గ్రాడ్యుయేషన్ పూర్తిచేశాను. ఏదైనా ఉద్యోగం చూసుకొంటే, ఏ అమ్మాయినో తెచ్చి నాకు ముడిపెట్టాలని అమ్మావాళ్ళ తాపత్రయం. ప్రస్తుతం నాకలాంటి ఆలోచనలేదు. నేను చదువుకుంటున్న రోజుల్లోనే నాకు అనేకమందితో పరిచయం అయింది. నాకు ఇలాంటి విషయాలపట్ల జిజ్ఞాస ఆరంభమయిందప్పుడే.

"ఇప్పుడు నేను ఉద్యోగం చేసి అర్జెంటుగా సంపాదించాల్సిన అవసరం ఏమీ లేదుగా. చూద్దాంలే. నేనెవరితోనూ తగాదాకి పోవటం లేదు. నాకు కొన్ని అనుమానాలున్నాయి: వాటిని తీర్చుకోవటం కోసం వెళ్తున్నా. సరేనా? అన్నాను.

"ఏమో బాబూ. జాగ్రత్త. నీకేం? నువ్వు ఏదో ఒకటి చేసి బయటకు వస్తావు. వాళ్ళకు అలా కుదరదు. అక్కడ ఆస్తులున్నాయి. పొలాలున్నాయి. వారందరితోనూ కలసి బతకాలి. నీమూలంగా వారు బాధపడకూడదు" అంది.

"అలాంటిదేం ఉండదులే" అని చెప్పి బయలుదేరి వచ్చేశాను. గుంటూరు నుండి బస్‌లో ప్రయాణం. దాదాపు మూడు గంటలు. నాకు అమ్మ మాటలే గుర్తొస్తున్నాయి. మానవులందరూ కలిసే జీవించాలి. కలిసి జీవించటం అనే ఒక్క అంశంవల్ల ఇంక ప్రతిదాన్నీ ఆమోదించటమేనా? నా మూలంగా వారు బాధపడకూడదంట.

ఈ ప్రపంచంలో బాధలన్నీ ఎందుకొస్తాయి? 'నాది' అనుకోవటం వలన కాదూ! 'నాదీ' 'నేనూ' అనే భావన వీటన్నింటికీ మూలం అయినప్పుడు బాధనేది లేకుండా ఎలా ఉంటుంది?

నేను వచ్చేముందు చేసిన పనేమిటంటే దాదాపు అన్ని పత్రికలూ తెచ్చుకున్నాను. ఇంక చాలాకాలంగా చదవాలనుకుంటూ బద్ధకిస్తూ వచ్చిన పుస్తకాల్ని కూడా సూట్‌కేసులో సర్దుకున్నాను. ఈ సమయాన్నంతా సద్వినియోగం చేసుకోవాలనేది నా కోర్కె.

ఎలా అయితేనేం నేను సిటీ బస్‌ను పట్టుకొని పాలెం అడ్డరోడ్డును చేరుకోగలిగాను. అక్కడనుండి సూట్‌కేస్ మోసుకెళ్ళటం ఎలా అనే సమస్య. బస్ ముందుకు వెళ్ళిపోయింది. నాకయితే అది కనపడటం మానేసింది. దానివెనక పోగా, దుమ్ము కలసిన మేఘం...వెనకవైపూ అంతే. అంతకుముందు లేచిన దుమ్ము మెల్లగా నేలమీదకు జారుతోంది. ఇంక తప్పేదేముంది. నడవటమే మార్గం ఎటూ జనం లేరు. అంతగా బరువు అనిపిస్తే నెత్తిమీద అడ్డంగా పెట్టుకొని నడుస్తాను. నేను ఆ రోడ్డు




కేసి చూశాను. నలుగురూ నడుస్తారు కాబట్టీ, ఇంకా వర్షాకాలం రాలేదు కాబట్టి అది కూడా ఓ బాటలానే ఉంది. నల్లటి మట్టి. ఏ మాటకా మాటే చెప్పుకోవాలి. భలే సారవంతమైన భూమి. ఏ పంట వేసినా అద్భుతమైన ఫలితం ఉంటుంది. ఆ బాట పొడుగునా ఎడ్లబండ్లు తిరుగుతున్న గుర్తులు. రోడ్డుకు రెండు పక్కలా తాడిచెట్లు...నడుమ అక్కడక్కడో ఈతచెట్టు...రెండువక్కలా చేలు...ఇంకా తుమ్మచెట్లు కూడా కనిపిస్తున్నాయి. ఊరికి దూరంగా ఓ అద్భుత దృశ్యం...

అది కొబ్బరి తోట. దాని నడుమ ఏమైనా చెరువులాంటిదుందేమో! చల్లటి గాలి శరీరాన్ని తాకుతోంది. ఇంత చక్కటి ఊరుకు రోడ్డులేకపోవటం ఏమిటి? ఈ ప్రపంచంలో రకరకాల వింతలుంటాయి...

నడుస్తున్న నేను ఆగిపోయాను. సూట్‌కేసును కిందపెట్టి కాలికేసి చూస్తుండిపోయాను. ఎదురుదెబ్బ తగిలింది. నాకెందుకో శ్రీశ్రీగారి "ఏదేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం" పద్ధతిలో ఎవరో రాసిన గేయం గుర్తొచ్చింది. "ఏరోడ్డు చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం? రోడ్ల జాతి చరిత్ర సమస్తం గతుకుల పరాయణత్వం" అని.

ఈ దేశంలో దౌర్భాగ్యమంతా ఎక్కడుందంటే మన రోడ్లలో ఉంది. జీవితంలో ఎందుకూ పనికిరానివారు కూడా కొద్దిపాటి డబ్బుంటే వెంటనే చిన్నసైజో, లేక పెద్ద సైజో కంట్రాక్టరయిపోతాడు. అంతటితో రోడ్లను నిర్మించే కార్యక్రమం ఆరంభిస్తాడు. రోడ్ల పక్కన సంవత్సరాల తరబడి కంకర తోలిస్తాడు. ఆ తర్వాత మొదలు.... ఆ రోడ్లమీద తారు ఉంటుందో, ఉండదో... ఎంత మందం వేస్తాడో...అసలు వేస్తాడో వెయ్యడో లక్షలాది, కోట్లాది రూపాయలు రోడ్లపేరుతో ఖర్చవుతుంటాయి. చాలాచాలా సంవత్సరాలు చదువుకున్న ఇంజనీర్లు కంట్రాక్టర్ చేస్తున్న పనిని పర్యవేక్షిస్తారు. ఇవి రోడ్లేనని నమ్మకంగా కాయితాలమీద సంతకం చేస్తారు.

దేశంలో ప్రతిఏటా అలా వేల కిలోమీటర్ల పొడవునా రోడ్లు తయారవుతున్నాయ్. అదేంటో మరి సంవత్సరం తిరిగితే చాలు. తిరిగి శ్రీశ్రీగారి పద్యం గుర్తుకొస్తోంది. అప్పుడనిపిస్తుంది. "ఈ రోడ్డు వేయకపోయినా బాగుండేదని" అంతకు ముందయితే ఇన్ని గుంటలూ, రాళ్లూ ఉండేవి కాదు గదాని.

అసలు 'రోడ్' అనే పదాన్ని మనం ఎలా అలవాటు చేసుకున్నామోగానీ, ఎంత గొప్ప మాట. 'రోడ్' అనేది సంస్కృతికి ప్రతి రూపం. మనుమలు అన్నల్ని అంతస్థుల్నీ తోటివారినీ ప్రేమించవచ్చు. కానీ ఈ రోడ్లను కూడా అమితంగా ప్రేమించవచ్చని చాలామంది మహానుభావులు రుజువు చేశారు. చాలా దేశాల్లో ఈ రోడ్ల నిర్మాణమే ఓ గొప్ప అనుభూతిగా, చరిత్రగా నిలిచింది. అలాంటిది ఓ ఊరిలో - అందులోనూ ఆర్థికంగా, సాంఘికంగా, ఇంకా అన్నిరకాలుగా అభివృద్ధి చెందిన ఊరిలో రోడ్డు లేకపోవటానికి కారణం ఏమిటి?

వీళ్లకు సంస్కృతి అవసరంలేదా? వీళ్లకు అధునాతన సౌకర్యం అవసరంలేదా? వీళ్లకు మరో ప్రపంచమే అవసరంలేదా?

నాకెందుకు? మళ్లీ ఏ రాయన్నా తగులుతుందేమో అనిపించింది. మొత్తంమీద నేను అదృష్టవంతుణ్నే. ఆ రాయి తగిలి నాగోరు లేచిపోయి ఉంటే ఇక్కడున్న నాలుగు రోజులూ దాంతోనే సరిపోయేది. అక్క ఇంటికి చేరుకునేలోగా ఎన్నిసార్లు సూట్‌కేస్ చేతులు మార్చుకున్నానో, ఎన్నిసార్లు రోడ్డుమీద పెట్టి విశ్రాంతి తీసుకున్నానో చెప్పలేను.

నన్ను చూడగానే ముందసలు అక్క నమ్మలేదు.

తను నేను రాగలనని ఊహించి ఉండదు.

"ఏమిట్రా సుధీర్ ... నువ్వేనా మా ఊరు వచ్చింది" అంది.

"అవునమ్మా నేనే. ఈ సూట్‌కేస్ మోసుకు రాలేకచచ్చాను. రారా అంటావ్. మీఊరు రావాలంటే ఈ హింసంతా ఎవరు భరిస్తారంటావ్?"

"అదేమిట్రా దారిలో ఎవరూ కనపడలేదా?"

"ఎవరూ కనపడలేదు. అదిసరే. మీ ఊర్లో జనమంతా ఏమైపోయారు? ఎవరిమీదకన్నా యుద్ధానికెళ్లారా? ఒక్కరు కూడా కనపడలేదు" అన్నా.

"ఏడ్చావులేగానీ, ముందు వెళ్లి ముఖమూ, కాళ్లూ చేతులూ కడుక్కునిరా" అంది.

నేను సూట్‌కేస్ లోపలికి తీసుకెళ్లబోయాను.

"దాన్నక్కడవదుల్లే" అంది.

"అందులో మన తల్లిగారు ప్రేమతో పంపించిన పొట్లమేదో ఉంది. ఇన్ని కష్టాలు న్నాయి కదా నేనెక్కడ చావనంటే వినిపించు కుంటే కదా"

అక్క నవ్వింది.

నేను వెళ్లి ముఖం కడుక్కొచ్చాను. రాగానే కాఫీ అందించింది. కడుపులో ఓ గుక్క పడ గానే ఎక్కడలేని ఉత్సాహం వచ్చింది.

"చాలా బాగుందే" అన్నాను.

"ఇంకా కొంచెం తెమ్మంటావా" అంది అక్క

"ఏమిటే బాబూ ... ఇది కాఫీనా లేకపోతే ఇంకేమన్నానా?"

"భలేవాడివే. మా చిన్న మావగారి సంగతి నీకు తెలియదనుకుంటా. ఇలా కప్పుల్లో ఇస్తే వాళ్లకి కోపం వస్తుందిరా. ఆయనకు చెంబుడు కాఫీ తాగితేగానీ తృప్తిఉండదు" అంది.

"ఏమిటే తల్లీ మీ గేదెలు కుడితి తాగిన ట్లేనా?" అన్నాను.

"మెల్లగారాబాబూ. ఎవరన్నా వింటే బాగుండదు" అంది.

నేను చుట్టూ చూశాను. ఎవరైనా ఉన్నారే మోనని. ఎవరూ కనిపించలేదు. సూట్‌కేస్‌ని అక్క లోపల పెట్టించింది.

"అమ్మ ఎలా ఉందిరా?" అంది తనూ కాఫీ తెచ్చుకొని.

"ఇప్పుడు గుర్తొచ్చిందన్నమాట" అన్నాను.

"ఏడ్చావులే. వచ్చిన దగ్గర్నుండి హడావి డేగా. ఈ సంవత్సరమైనా ఆవిడకు పనిభారం తగ్గిస్తావా?"

"ఎందుకు తగ్గించను. ఎటూ ఉద్యోగం లేదుకదా. ఇంట్లోపనులు చేసుకుంటూ ఉంటా" అన్నాను.

"ఏడ్చావ్ ... అది సరేరా ఇక్కడ ఓ పిల్ల ఉంది. మాట్లాడమంటావా?" అంది.

"నాతో అంటె అన్నావ్. మీ అమ్మతో మాత్రం ఈ ముక్క అనకు. ఆ తర్వాత నీ ఇష్టం" అన్నాను.

అక్క నవ్వింది హాయిగా.

"బావలేడా?" అన్నాను.

"లేరు. ఎవరోవస్తే టౌన్‌కెళ్లారు" అంది.

బావంటే నాకు చిన్నతనంనుండీ భయమే. అసలు అక్కకూ నాకూ చాలాతేడా ఉంది. అక్క పుట్టిన పది సంవత్సరాల తర్వాత నేను పుట్టా ను. అక్కకు పదహారు సంవత్సరాలకే పెళ్లిచేశా రు. అప్పట్లో నేను చిన్నపిల్లవాడిని. ఆ తర్వాత మానాన్న చనిపోయారు. అప్పటినుండి ఓ రకంగా బావే మాకు పెద్ద. నేనాయన్తో మాట్లా డిన సందర్భాలే చాలాతక్కువ. ఇప్పుడు వచ్చినా అంతే. ఒకటి రెండుసార్లు మాట్లాడతా ను. ఆతర్వాత ఎవరి కార్యక్రమం వారిదే.

"అమ్మగారూ" అంటూ పిలిచారెవరో

"వస్తున్నా" అంటూ అక్క వెళ్లింది.

బయటినుండి ఎవరో ఆడమనిషి గొంతు వినపడుతోంది

"ఎవరో వచ్చారల్లే ఉందే అమ్మగారూ"

"అవునే మా తమ్ముడొచ్చాడు. అది సరేగాని పొయ్యిమీద నీళ్లుపడెయ్యి" అంది.

నాకు వేడినీళ్లు పోసుకోవటం చాలా ఇష్టం. అయితే ఇంటిదగ్గర అదేం కుదరదు. గ్యాస్ దండుగ అంటుంది అమ్మ. చన్నీళ్లు పోసుకో వటం ఆరోగ్యానికి మంచిదిరా అని కూడా అంటుంది. నేను లేచి బయటికొచ్చాను. ఓ మూలగా సరివికంప పేర్చి ఉంది. దానిలో కొంతభాగం తెచ్చి పొయ్యిరాజేసింది.

వేడి వేడి నీళ్లు పోసుకుంటుంటే చాలా హాయిగా ఉంది. తల కూడా రుద్దుకున్నాను. మొత్తం బస్‌లో పేరుకున్న దుమ్మంతా కొట్టుకు పోయింది. ఇప్పుడు చాలా హాయిగా అని పించింది. తల తుడుచుకుంటూవచ్చి చెప్పా ను.

"అక్కా నేనున్నన్ని రోజులూ నాకు పేపర్ కావాలి. ఏదో ఒకటి కాదు. కనీసం మూడుపేప ర్లయినా కావాలి. ఉదయాన్నే ఎవరైనా తెచ్చిపెట్టగలరా?" అన్నాను.

"ఇక్కడ అదేం కుదరదు. కనీసం పది దాటుతుంది. నేను ఎవరికైనా కబురుచేస్తాలే"





అంది.

నేనలా అన్నానుగానీ ఉదయానికల్లా పేపర్ రావటం ఎంతకష్టం.

అయినా పల్లెటూర్లకీ, పట్నాలకీ ఈ విషయంలో చాలా తేడా ఉంటుంది. అక్కడ ఉదయం లేవగానే ఏంచేసినా చేయకపోయినా ముందు పేపర్ చూడాలి. అందులో ఎవరికి ఇష్టమైన అంశాన్ని వారు చూస్తారు. మరి వీళ్ళకు పేపర్ అవసరమేలేదా? నాకిప్పుడనిపిస్తోంది... నేను ఇలాంటి ప్రశ్నలు వేసుకోవటం అనవసరం. నేను పరిశోధనలోకి దిగాను కాబట్టి కొత్త విషయాలూ లేదా పాత విషయాలు తెలుసుకోవటం జరుగుతుంది.

నేను భోంచేస్తున్నప్పుడు అక్కతో చెప్పాను.

"నాకీరోజు గుంటూరులో మన కృష్ణమూర్తిగారు కనిపించాడు. తనేమో కనీసం నిలబడి మాట్లాడే పరిస్థితి కూడా లేదు. మీ ఊరి రోడ్డు గురించి మల్లగుల్లాలు పడుతున్నారు. ఆ ముక్క మాత్రం అనేసి పరిగెత్తుకు వచ్చాడు. నేనయితే వెంటనే బయలుదేరి వచ్చేశా. ఏంటక్కా ఏమిటి విషయం?"

"ఏమోరా? నాకయితే మీ బావగారు చెప్పలేదు. అయినా కూడా మా చిన్న మావయ్యగారింటికి వెళ్ళొస్తే అక్కడ విషయాలు తెలుస్తాయి. నాకేమో ఇలాంటి విషయాలంటే ఇష్టం ఉండదు. అసలు నాపనే నాకు సరిపోతూంది. ఈ ఊర్లో ప్రతి విషయానికీ మల్లగుల్లాలు పడటం మామూలే" అంది. నాకయితే ఆమాట వింటున్న కొద్దీ నవ్వు వస్తోంది.

"అక్కా మల్లగుల్లాలంటే ఏమిటి? అది కూడా మీ ఊరికి చెందిన ప్రత్యేకమైన భాషా?"

"ఏదో లేరా. నీకన్నీ ఎగతాళిగా ఉంటాయి. అసలు నీకు తెలియదుగానీ ఈ ఊర్లో చాలా తమాషాలున్నాయి. ఈసారెప్పుడన్నా చెబుతాలే" అంది.

"మరయితే నేను ఆ కృష్ణమూర్తిగారింటికి వెళ్ళొస్తా"

"ఇప్పుడెందుకురా చీకట్లో"

"అప్పుడే ఏం పడుకుంటాం. కొంచెంసేపు మాట్లాడివస్తా"

"ఉండయితే రాముడ్ని పిలుస్తా" అంది.

రాముడు తోడురాగా నేను కృష్ణమూర్తిగారింటికి బయలుదేరాను.

"త్వరగా రా" అంది వెనగ్గా అక్క.



కృష్ణమూర్తిగారింటికి నేను వెళ్ళేటప్పటికి ఆయన పెద్దగా మాట్లాడుతూ స్నానం చేస్తున్నాడు. వాళ్ళకి బాత్‌రూంలాంటిదేం లేదు. పెద్ద తొట్టి పక్కన నాలుగు నాపరాళ్ళు పరిచారు. వాటిమీద బకెట్‌లో పొగలు కక్కుతున్న నీళ్ళు పోసుకుంటున్నాడు. ఆడవాళ్ళు స్నానం చెయ్యటానికి ఓ దడిలాంటిది కట్టారు.

"ఏంటయ్యో... ఎప్పుడొచ్చా?" నన్ను చూడగానే పెద్ద పెడబొబ్బపెట్టాడు.

"మీతోపాటే నేనూ బయలుదేరి వచ్చేశా" అన్నాను.

"వాకిట్లో కుర్చీ ఉంది కూర్చో. ఇప్పుడే అయిపోతుందిలే" అన్నాడు.

"తొందరేంలేదు. మెల్లగానే స్నానం చెయ్యండి" అన్నాను.

ఆయన త్వరగానే స్నానం ముగించుకొని వచ్చాడు.

"ఏంటి స్వామీ ఇంత హడావిడిగా వచ్చావ్? విషయం ఏమిటి?" అన్నాడు కుతూహలంగా.

"నాదేంలేదు... పొద్దున మీరు చెప్పారుకదా. మీ రోడ్డు విషయంలో మీ ఊరంతా రెండు గ్రూపులయి కొట్టుకొంటున్నారేమోనని పరిగెత్తుకొంటూ వచ్చా"

"వార్నీ భలేవాడివయ్యా. ఏంది నాలుగు రోజులుంటావా?"

"ఉండాలనే వచ్చాను"



''అన్నం తిన్నావా?''

''ఇప్పుడే తిని బయలుదేరా''

''ఇంకోసారి నాతో తినకూడదూ'' అన్నాడు.

''నావల్లకాదులే''

''ఏంకుర్రాళ్ళయ్యా. ఈ వయసులో రాళ్ళు తిని అరిగించుకోవాలి. నీకు తెలియదేమో మా ఊర్లో రేపోమాపో పోయేవాళ్ళుకూడా మూడు పూట్లా తింటారు''

''అప్పుడుగాని త్వరగా పోరు''

''భలేవాడివే. తిండి తినాలి. పనిచేయాలి. అంతేగానీ నేను తినను. నేను చేయనంటే కుదరదు'' అన్నాడు.

తను భోంచేస్తూ కూడా ఏదో ఒకటి చెబుతూనే ఉన్నాడు.

''ఏమైనా మీ బావయ్య తెలివిగలోడయ్యా. పట్నంలో ఉండి చక్కగా సంపాయించుకున్నాడు. తిరిగి ఇక్కడకు వచ్చినా అంతే. ఆ బుర్రే బుర్రయ్యా'' అని మా బావను పొగిడేడు.

''ఇదిగో ఆయనకి చాలా పెద్ద ప్లానుందయ్యా... ఇక్కడ చేలని రొయ్యల చెరువులు చేస్తాడంట. ఇంకానేమో కొబ్బరితోటలు పెంచుతాడంట. అయిదారు సంవత్సరాలు పోతే అంతా బంగారం కాదూ'' అన్నాడు... ఇంకానేమో...

''అయినా ఆయనకు ఇద్దరూ మొగపిల్లలు పుట్టారుగానీ, ఓ ఆడపిల్ల పుడితే మీ అక్కయ్య నీకిచ్చి ఇంట్లో పెట్టుకునేదికాదూ'' అన్నాడు పళ్ళెం ఎత్తుకొని మజ్జిగతాగుతూ.

కృష్ణమూర్తిగారిని అలానే వదిలేస్తే ఇలానే ఏవేవో చెబుతూనే ఉంటాడు. అందుకే ఆరుబయట నులకమంచం వేశాక నేనే అడిగాను.

''మీ ఊరి షావుకారున్నాడుగదా. ఆయనకే మాత్రం ఉంటుందేమిటి?''

"అయన్నీ మనకు చెబుతారంటయ్యా బాబూ. అయినా నాకు తెలిసినంతవరకూ ఓ వందెకరాలుంటాయి. ఇంకా మెట్టకూడా చాలా ఉంటుంది"

"అంత పొలమా... సీలింగ్‌లో పోలేదా?"

"ఎక్కడికి పోద్దయ్యా బాబు. ఆయనకి అదే చాలక ఛస్తాఉంటేనూ. ఆయనొక్కడే అను కుంటున్నావా ఏమిటి? నలుగురు పిల్లలున్నారు. ఆయనకు చుట్టాలున్నారు. ఇంకా మిగిలితే పాలేర్లున్నారు. అంతటితో అయిపోయిందేటీ... టౌన్లో నాలుగు మేడలున్నాయి. ఇంకా రైసుమిల్లుల్లో వాటాలున్నాయి. రెండు సినిమాహాళ్ళున్నాయి. ఇంకా పెట్రోలు బంకూ... బెజవాడలో ఓ బార్‌లో భాగమూ...మద్రాసులో ఇంటి స్థలాలూ..."

"ఈ ఊరంతటికీ ఆయనే షావుకారా?" అన్నాను మధ్యలోనే.

"ఏంటా తొందర... నేనింకా ఆ ఇంట్లో బంగారం ముద్దలుగురించి చెప్పలా. అళ్ళ చావిట్లో ఉండే గొడ్డుగోదా గురించి చెప్పలా... ఆయన ఈ ఊరికేమిటయ్యా బాబూ ఈ చుట్టుపక్కల చిన్న జమిందారులాంటివాడనుకో"

"ఇంకా మీ ఊర్లో షావుకార్లులేరా?"

"ఎందుకు లేరు? ఆయనంత కాకపోయినా బాగానే ఉన్నవారు ఓ అయిదారుమంది తేల్తారు"

"అందరూ బంధువులేనా?"

"అఁ ఏదో బీరకాయ పీచు. బంధుత్వంకూడా ఉండొచ్చు" అన్నాడు బీడీ తీసి వెలిగిస్తూ.

"అదేంటండీ ఆ బీడీ వాసనకాదూ...సిగరెట్టు తాగొచ్చుకదా"

"మన ముఖానికి ఇయి దొరికితే చాల్లే" అన్నాడు

"మరేమిటి? మీ ఊరి గురించి గొడవగా ఉందన్నారుగా. అదేమైంది?"

"అదా. నాతో ఎవరో అన్నారు రోడ్డు వేయాలంటున్నారని!"

"ఇందులో గొడవేముంది? మంచిపనేగా?" అన్నాను.

"ఏం మంచిపనయ్యా బాబూ. నువ్వు భలేగా ఉన్నావే" అన్నాడు.

ఈసారి నాకు నిజంగానే మతిపోయింది.

"ఏమిటి... రోడ్డు వేయటం మీకు ఇష్టంలేదా?" అన్నాను

"ఎందుకంట రోడ్డు? ఇన్నాళ్ళూ రోడ్డులేకపోతే మేం బతకలేదా? మా పనులేమైనా ఆగిపోయాయా? ఇక్కడి పిల్లలు చదువుకోవటం మానేశారా? నీకు తెలియదేమో ఈ ఊర్లో పిల్లలు డాక్టర్లయ్యారు. వాళ్లందరూ రోడ్డుంటేనే అయ్యారా?"

"అదేంటి. రోడ్డులేకపోవటంవలన మీ ఊరికి రావటం ఎంతకష్టంగా ఉంది. మీకుమాత్రం కష్టంకాదా? రెండు మైళ్లు నడవాలి. ప్రాణంపోదూ"

"ఎవరయ్యా నడవాలి. అందరికీ ఎడ్లబళ్లున్నాయి. ఆడంగులంతా వాటిల్లో వెళ్తారు. అయినా చీటికీ మాటికీ తిరగటానికి ఆల్లకేంపని. అసలు బాధపడకుండా చేసే పనేంటో చెప్పు. ఇదివరకటి రోజుల్లో ఈ బస్సులున్నయ్యా... రైళ్లున్నయ్యా... కాశీకి వెళ్లినా నడిచివెళ్లేవారు"

"దానికీ, దీనికీ సంబంధం ఏమిటండి. అప్పట్లో లేనివి. ఇప్పుడు చాలా వచ్చాయి. కరెంట్ గురించి మన తాతలకు తెలుసా? అందుకని ఇప్పుడు కరెంట్ ఎందుకని మానేస్తామా?"

కృష్ణమూర్తి పెళ్ళుననవ్వేడు.

"ఏందయ్యో... వెనకటికి నీలాంటి పంతులొచ్చాడు ఈ ఊరికి. ఆయన కూడా ఇట్టాగే కబుర్లు చెబుతుండేవాడు. నీకొక్కమాట చెప్పనా. ఈ ఊర్లో షావుకారి నుండి కూలోల్లదాకా ఎవర్నయినా కదిపిచూడు. ఒక్కరన్నా రోడ్డు కావాలంటారేమో చూపించు. మరింక మాకు బాధేందయ్యా... వానాకాలం వొస్తదంటావా... అదెల్లకాలం ఉండదుగా... ఆ నాలుగునెలలూ తిప్పలు పడతాం" అన్నాడు

"మరి చుట్టాలు రావాలంటే కష్టంకదా?"

"అసలు చుట్టాలెందుకంట? ఎవడికొంపలో వాడు పడుండక. దేశమంతా తిరుగుతుండ





ల్నా. చాల్లేవయ్యా సామీ బాగా చెప్పావ్"

నేను కొంచెం సీరియస్‌గా మాట్లాడదలుచుకున్నాను.

"ఎవరిదాకానో ఎందుకు. ఈ ఊరికి రోడ్డుంటం మీకు బాగుంటుందో, లేదో చెప్పండి" అన్నాను

కృష్ణమూర్తిగారు ఈసారి వెంటనే జవాబివ్వలా. కొంచెంసేపు ఆలోచించాడు. ఆ తర్వాత చెప్పాడు.

"ఏ ఊరికైనా రోడ్డుంటే బానే ఉంటుంది. నువ్వెంతమాత్రమే ఆలోచిస్తావు. అసలు నీకెన్నేళ్ళుంటాయి. పాతిక దాటుతయ్యేమో. ఈ ఊర్లో ఆచార్లుగారికి డెబ్బై సంవత్సరాలు. ఆయనకంటే పెద్దాళ్ళు కూడా ఉన్నారు. ఇన్నేళ్ళుగా వాళ్లంతా రోడ్డు లేకుండానే బతికారు. మనకంటే వాళ్లందరూ తెలివితక్కు వాళ్ళేంకాదు కదా. మరి ఆళ్లకి కూడా ఇలాంటి ఆలోచన వచ్చి ఉండాలి గదా. వాళ్లకి రోడ్డు అవసరమనుకుంటే వేయించుకొని ఉండేవారు. అంటే రోడ్డు ఉండటంవలన చాలా నష్టాలున్నాయని వాళ్ళు అనుకున్నారన్నమాట. ఇదంతా ఎందుకు. నేనో ముక్క చెబుతా. నేను పుట్టిందగ్గర్నుండి ఈ ఊర్లో ఒక్క దొంగతనం కూడా జరగలేదు కారణం ఏమిటంటావ్?" అన్నాడు.

"ఏమోమీరే చెప్పండి' అన్నాను.

"మాకు రోడ్డు లేదు కాబట్టి" అన్నారు. తాపీగా

"ఇదేం వాదం."

"అవును మరి చక్కగా రోడ్డుందనుకో. నరానరి దొంగలు ఊర్లోకి వస్తారు. వాళ్లకేం కావాలంటే అది పుచ్చేసుకొని వెళ్తారు. ఇప్పుడెవడొస్తాడు. ఓ వేళ ఎవరన్నా దొంగా దొంగా అనరిచినా అయిదుమైళ్లు పరిగెత్తాలి. ఆ చీకట్లో పరిగెత్తితే ఏ గుంటల్లో పడతాడో తెలియదు. అదే మీపట్నంలో అయితే చూడు. రోజూ ఏదో మూల ఏం కావాలంటే అది తీసుకుపోవటంలా" అన్నాడు కృష్ణమూర్తి లాజిక్ బాగానే ఉంది.

"చూడండి కృష్ణమూర్తిగారూ, పట్నాల్లో దొంగతనాలు జరుగుతున్నాయనేది నిజమే. అవి కూడా ఇటీవల కాలంలో పెరుగుతున్నాయి. అయినా కూడా అందరూ ఆ దొంగలవల్ల బాధపడటంలేదు. ఓ వేళ దొంగతనం జరిగినా పోలీసులున్నారు. వాళ్ళేం చూస్తూ ఊరుకోరు"

"పోలీసుల గురించి నాకు చెప్పొద్దులే బాబూ– ఆల్లకి తెలియని దొంగలు ఈ ప్రపంచంలో ఎక్కడా ఉండరు" అని నవ్వాడు.

"కాబట్టి దొంగతనం జరగకుండా ఉండాలంటే రోడ్డు ఉండకూడదన్నమాట. బాగుంది. మరి నేను బయలుదేర్తా" అన్నాను

"పద. నేనూ అక్కడదాకా వస్తా" అంటూ లేచాడు.

★ ★ ★

నేను ఇంటికొచ్చి పడుకున్నాను. నిద్రరావటంలేదు. మెల్లగా వెళ్ళి కిటికీతలుపు తీశాను. చల్లటిగాలి గదంతా వరుచుకుంటుంది. చాలా హాయిగా అనిపించింది. నేనలా నిలబడి చూస్తున్నాను. ఆ గాలి నాకు కనిపించటంలేదుగానీ, వింత శబ్దంతో నన్ను స్పృశిస్తూ వెళ్తోంది. ఆలోచనల్లో ఉన్న వాడినల్లా ఉలిక్కిపడ్డాను. ఎప్పుడొచ్చిందో ఓ దోమ నన్ను కుట్టింది. అకస్మాత్తుగా తలుపు మూశాను.

కొద్దిసేపట్లోనే గదంతా వెచ్చగా అయిపోయింది. ఫ్యాన్ ఆన్‌చేసుకోవచ్చు. కానీ సహజమైన ఆ గాలికీ దానికీ పోలిక ఏమిటి? నేను వెళ్లి కిటికీ తలుపులు పూర్తిగా తెరిచాను. చల్లటిగాలీ, కొద్దిపాటి వెలుతురూ తిరిగి ఆ గదిలోపలికి చొరబడ్డాయి. దాంతోపాటు ఎప్పుడైనా ఒకటి రెండుదోమలు కూడా వస్తున్నాయి.

నాకిప్పుడు దోమలు వస్తున్నాయని తలుపులు మూయాలనిపించలేదు. దోమలకంటే నాకు గాలి ముఖ్యం. ఆగాలి ఇచ్చే ఆనందం అనుభవించాలనుకున్నప్పుడు ఆ మాత్రం దోమలబాధను భరించాలి.

నేను తిరిగివచ్చి మంచంమీద పడుకున్నాను. నాకు కృష్ణమూర్తివాదమే గుర్తుకొస్తోంది. అతనుచేసిన సవాల్‌కూడా! ఈ ఊర్లో ఏ ఒక్కరూ రోడ్డు కావాలని ఆమోదించినా చాలట. ఇంతమందిలో కనీసం ఒక్కరు కూడా భిన్నంగా ఆలోచించరా? ఓ వేళ ఆలోచించినా మనకెందుకులే అనుకుంటున్నారా? ఓ వేళ



అలాంటి ఆలోచనల్ని ఈ ఊరిపెద్దలు సహించరా? అయినా ఇదేం పెద్ద విప్లవం ఏమీకాదు. రోడ్డు... అందరికీ ఉపయోగపడేరోడ్డు. అలాంటి విషయంలో కూడా ఇంత లొంగుబాటా? అయితే ఇక్కడ కనిపించని రహస్యహస్తమేదో ఉంది. అది ఇక్కడి జనాల నోళ్లనూ, మెదడునూ కూడా నొక్కి ఉంచుతోంది.

అదలా ఉంచితే నాకెందుకో మానవుడి ఆరాటం గుర్తొచ్చింది. ఈ ప్రపంచాన్ని అంతకంతకూ సన్నిహితం చేసిందేమిటి? వాస్కోడిగామాలో ఆ తాపత్రయం ఎందుకు? మనిషి చంద్రమండలానికి రోడ్డు ఎందుకు నిర్మించాడు. అమెరికాను కనుక్కోవటం ఎందుకు? వీటన్నింటి వెనకాల ఏ కారణలైనా ఉండొచ్చు. వీటివల్ల తర్వాతి కాలంలో కొన్ని అనర్థాలు జరిగి ఉండవచ్చు. కానీ ఇదంతా ఓ పరిణామం. దీన్ని ఎవరూ అపలేరు కూడా. ఆపాలని చాలాకాలం ప్రయత్నం చేయవచ్చు.

మరిక్కడ ఏ శక్తులు పనిచేస్తున్నాయి? ఇంకా ఎంతకాలం ఈ పరిణామాన్ని అడ్డుకొంటాయి? నాకు నిద్రపడుతున్నప్పుడు అకస్మాత్తుగా కృష్ణమూర్తి చెప్పిన 'మాస్టారు' గుర్తొచ్చారు. ఆయనెవరో ఇలానే మాట్లాడేవాడంట. మరి ఆయనేం అయ్యాడు? ఆయన్ని ఈ ఊరంతా తన్ని తగలేసిందా? లేదా ఆయనకే విసుగొచ్చి ఈ ఊరు వదిలివెళ్ళిపోయాడా?

ఈ విషయాలన్నీ మెల్లగా కృష్ణమూర్తి నుండే రాబట్టాలి. నేను మెల్లగా నిద్రలోకి జారిపోయాను. నాకు చిత్రమైన కల వచ్చింది.

ఎటుచూసినా మనుషులు... ఇంకా తారు డబ్బాలు... రోడ్లపక్కన తోలిన కంకర... చిప్స్... ఓ పక్కన పెద్ద బుల్డోజర్... ఇంకా పెద్దగా మంటలు.. అందరూ కలిసి నిర్విరామంగా రోడ్డు వేస్తున్నారు. సరిగ్గా పాలెం అడ్డరోడ్డు నుండి ఆరంభమైంది. ఊరంతా ప్రశాంతంగా ఉంది. అందరూ నిద్రపోతున్నారనుకుంటా. ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు. ఇంకా పెద్ద పెద్ద ఫ్లడ్‌లైట్ల వెలుగు. ఓ నాయకుడు లాంటి వ్యక్తి సూచనలు అందచేస్తున్నాడు. చకచకా రోడ్డు నిర్మాణం జరిగిపోతూంది....

నాకెందుకో ఆ కలలోనూ కృష్ణమూర్తయినా మేల్కొని లేదేమిటబ్బా అనిపించింది. ఇంత "ఘోరం" జరిగిపోతుంటే అందరూ అలా శాపగ్రస్తుల్లా నిద్రించటం ఏమిటా అనిపించింది. రోడ్డు వేయటం పూర్తయింది. ఒక్కసారిగా ఆ నాయకుడు పెద్దగా కేకపెట్టాడు. అంతే ఎక్కడి వాళ్ళక్కడ సైనికుల్లా నిలబడిపోయారు.

నాకెందుకో అనుమానం వచ్చి కళ్ళు చిట్లించుకు చూశాను. వారందరూ నల్లగా ఉన్నారు. అంటే వీళ్ళందరూ దొంగలన్నమాట. అతనేదో చెబుతున్నాడు.

"చూడండి.... వరసగా మన లారీలన్నీ పాలెంలోకి తీసుకురండి ఈ ఊరిని దోచుకుంటే చాలు. మనకి ఇప్పట్లో ఇలాంటిపని చేయవలసిన అవసరం ఉండదు. గొడ్లూ, గోదాని దేన్నీ వదిలిపెట్టకూడదు. అర్థమైందా. మార్చ్" అరిచాడు....

అంతే... నడిచేవాళ్ళూ, పరిగెత్తేవాళ్ళూ, లారీలూ, ఒకటే శబ్దాలు... ఆకాశంలో ఏదో శబ్దం అయినట్లు ఉంటే తలెత్తాను. ఓ హెలికాప్టర్ పైనుండి మెల్లగా 'పాలెం' మీద అడుగు పెట్టబోతూంది...

క్షణాల్లో అంతా విధ్వంసం....

ట్రాక్టర్లూ... లారీలూ బరువుగా ముందుకు కదుల్తున్నాయి.

బంగారపు పెట్టెల్తో నాయకుడు హెలికాప్టర్‌లో ఎక్కి చేతులూపాడు. జనమంతా పాడుకుంటూ నడిచివెళ్తున్నారు. వారి ముందు గేదెలూ, ఎడ్లూ, దున్నపోతులూ కూడా తలలూపుతూ వెళ్తున్నాయి.

అమ్మో... 'రాబరీ ఇన్ పాలెం...' ఇదేదో ఇంగ్లీష్ సిన్మాలో ఉందే అనుకున్నా. ఊరి జనమంతా పరిగెత్తుకొచ్చారు. వారంతా వెళ్తున్న వారికేసి కోపంగా నిస్సహాయంగా చూస్తున్నారు.

ఆకాశంలో చంద్రుడు ప్రకాశిస్తున్నాడు.

ఆ వెలుగుల్లో రోడ్డు తళాతళా మెరుస్తోంది. అప్పుడు కనిపించాడు నాకు కృష్ణమూర్తి. కొంచెంసేపు రోడ్డునూ, వెళ్ళేవాళ్ళనూ చూసి వెనక్కి తిరిగి పెరిగెత్తాడు.

ఎక్కడ దొరికిందో పెద్ద సుత్తితో వచ్చాడు. రోడ్డుకేసి కసిగా చూసి దాని మీద సుత్తితో





మోదాడు.

చూస్తున్న జనమంతా హర్షధ్వానాలు చేశారు.

సరిగ్గా ఆ సమయంలో నన్ను అక్క తట్టిలేపుతూంది...

అప్పుడే తెల్లవారి పోయిందన్న మాట.

★ ★ ★

నేను లేచి బయటకు వచ్చేసరికి రాముడి చేతిలో వేపపుల్లలున్నాయి.

"ఈటితో తోముకుంటారేటి బాబూ" అన్నాడు.

నేను గతంలో కూడా ప్రయత్నం చేశాను గానీ నాకు అలవాటు కాలేదు. నాకెందుకో వేపపుల్ల నవులుతుంటే ఆ చేదుకు వాంతి వచ్చినంత పనవుతుంది. అంతేకాదు పుల్లల్తో ముఖం కడగటం నాకు రాదు.

"వద్దులే రాముడూ... చేదుగా ఉంటుంది" అన్నాను.

"అయితే సరివి పుల్ల తెస్తా" నంటూ వెళ్ళాడు. రాముడికి నాలాంటివాళ్ళను చూస్తే మంచి ఉత్సాహం వస్తుంది. ఇంక నాకు తప్పలేదు. మొత్తం మీద నేను ఆపుల్లతో ముఖం కడుక్కొని వచ్చేటప్పటికి పెద్ద కుర్చీలో ఒకాయన కూర్చుని ఉన్నాడు. ఏభై ఏళ్ళు పైనే ఉంటాయనుకున్నాను.

మనిషి మాత్రం గుండ్రంగా ఉన్నాడు. గుండ్రటి పొట్ట... గుండ్రటి ముఖం... తలమీద అక్కడక్కడా వెంట్రుకలు... గుండ్రంగా, గంభీరంగా ఉన్నాడు. ఆయన నోరు కూడా గుండ్రంగానే ఉందా అనిపించింది నాకయితే. పంచెతో పాటు, చొక్కా ధరించాడు. పైన కండువా ఉంది.

చిరునవ్వులు చిలికిస్తూ కూర్చున్నాడు. మనిషి ముద్దుముద్దుగా ఉన్నాడు. ఆయన కుర్చీ పక్కన మాత్రం మాంచి పందెం కర్ర ఉంది. నన్ను చూడగానే గుండ్రగా నవ్వుతూ...

"ఎప్పుడొచ్చా అబ్బాయ్" అన్నాడు.

ఆయన్ని ఇంతకుముందు నేనెప్పుడూ చూడలేదు. అదీగాక నిన్నటి నుండి ఇంతవరకూ మా బావను పలకరించనేలేదు. ఆయన ఏక్షణం కనపడతాడా అనే కంగారులో నేనున్నాను. ఆయన నేను ఊహించని విధంగా మాట్లాడేసరికి తత్తరపడుతూ "నిన్న సాయంకాలం" అన్నాను.

అప్పుడే అక్క వచ్చి అంది.

"మా చిన్న మావగారు"

"అంటే చెంబుడు కాఫీ..." అనబోయి బలవంతాన నిగ్రహించుకొని "నమస్కారమండీ" అన్నాను.

ఆయన గలగలనవ్వుతూ "అమ్మ బాగుందా అల్లుడూ" అన్నాడు.

"బాగానే ఉంది" అన్నాను గానీ నాకెందుకో "అల్లూడూ" అనే పదం గుచ్చుకుంటోంది. మా బావతో ఓసారి మాట్లాడేస్తేగాని నేను కొంచెం ఫ్రీగా ఉండలేను.

మా అక్క చినమావగారు అక్కకేసి గుండ్రంగా తిరిగి

"తమ్ముడొచ్చాడుగా ఏం వండుతున్నావమ్మాయ్" అన్నాడు.

"గారెలు వండుదామని మినప్పప్పు నానపోశాను మావయ్యా"

"ఇంకా పిండిరుబ్బలేదా... ఆ సుబ్బి ముండ ఎక్కడ చచ్చింది" అన్నాడు అటూ ఇటూ చూస్తూ.

"ఇంకా పచ్చడి చెయ్యాలి మావయ్యా... ఈలోగా కొంచెం కాఫీ తాగుదురుగానీ"అంది.

"ఇంటి దగ్గర తాగే బయలుదేరానమ్మాయ్... ఆ సుబ్బిముండొచ్చి అబ్బాయి బామ్మర్ది వచ్చాడని చెబితే చూద్దారనొచ్చా" అన్నాడు.

"మరి ఎప్పుడొచ్చావని నన్నెందుకలా అడగటం" అందామనుకున్నాను.

"కాఫీయేగా" అంటూ అక్కలోనికి వెళ్ళి నాకు కప్పుతోనూ, ఆయనకు పెద్ద స్టీలుగ్లాసులోనూ తెచ్చింది. నాకు చెంబుతో ఎందుకు తేలేదో అర్థమైంది.

"బావ ఏరీ కనపడలేదే" అన్నాను.

"బయటకు వెళ్ళార్రా" అంది అక్క

"మా అబ్బాయంటే ఏంటనుకున్నారు. ఈ ఊర్లో అందరికీ తెల్లారిలేస్తే ఆడితోనే పని"



అన్నాడు కాఫీ గుటకలు మింగుతూ.

మా అక్కకు ఎంతమంది మావయ్యలున్నారో నాకు తెలియదు. ఈయన్నిమాత్రం నేనెప్పుడూ చూడనుకూడా లేదు. అసలు మావయ్యగారేమో మరణించేరు. ఆయన ఎందుకు మరణించాడో నాకయితే తెలియదుగానీ మా బంధువుల్లో ఒకాయన ఉండేవాడు. ఆయన చాలా సన్నగా ఉండేవాడు- ఆయనకున్న అంశమేమిటంటే... మాఅక్క మావగారు తిని తిని మరణించేడట. ఆయన ఆ వయసులో, ఆ లెవెల్లో తిని ఉండకపోతే ఇంకా కొంతకాలం జీవించి ఉండేవాడంట.

ఆ విధంగా చెప్పిన సన్నటి బంధువు కూడా మరణించేడు. అందుకు మా అక్కావాళ్ళ బంధువులు చెప్పేదేమిటంటే... 'ఆడిబొంద. ఆడిది జానెడు కడుపు. అందులో ఎప్పుడూ కాఫీలు, టీలుపోస్తుంటే ఇంకా ఆకలేం అవుతుంది. అందుకే ఎండిపోయి చచ్చేడు' అని.

ఇప్పుడు నా ఎదురుగా ఉన్నయన్నీ చూస్తుంటే మా అమ్మ ఇలా చెబుతుందేమో అనిపించింది.

"ఆఁ అదంతా విడ్డూరంలేరా. నేనుముందే చెప్పాగా. ఆ ఊరే అలాంటిదని. అయినా అరకప్పులు తాగుతుండేవాడాయన. మరాయనకు ఆకలి కాకపోతే చెంబులకు చెంబులు తాగుతున్నోళ్లంతా ఎండిపోకుండా ఊరతేగల్లా ఎందుకయ్యారు? ఆయనకేదో జబ్బుండి పోయాడంతే"

"ఏంటబ్బాయ్ సంగతులూ" అన్నాడు కాఫీగ్లాను పక్కనపెట్టి.

అంటే ఇప్పుడే వెళ్ళడన్నమాట. ఎందుకు వెళ్తాడు? అందులోనూ గారెలపిండి రుబ్బావని తెలిశాక...

"ఏమున్నాయండీ... మీరే చెప్పాలి" అన్నా

"ఏం చెప్పమంటావల్లుడూ... ఇదిగో ఇలా కృష్ణా రామా అనుకుంటూ కాలక్షేపం చెయ్యటమే. మనదేం లేదు పెత్తనం. మనం రిటైరయిపోయాం. ఏదో వాళ్ళింత పడేస్తే తిని పడుకోవటమే" అన్నాడు.

నాయనో... ఇంత ముద్దట. సర్లేకానీ... ఆయన తిప్పలేవో ఆయన పడతాడు అనుకుంటూ ఈయన్ని ఎలా వదిలించుకోవాలా అని ఆలోచిస్తున్నా. నాకేంచేయాలో అంతుపట్టడం లేదు. మొత్తంమీద ఆయన ఏదో ఫ్లాష్‌బ్యాక్‌లోకి వెళ్ళిపోయాడు...

"ఇప్పుడే వస్తా" అంటూ అక్కదగ్గరకి వెళానను. పొయ్యిమీద బాండీపెట్టి, అందులో నూనె పోసింది. దానికేసి చూడగానే నిజంగానే నాకు మతిపోయింది. మా గుంటూరు రోడ్లమీద బజ్జీలకొట్టువాళ్ళు పెట్టుకునేంత సైజులో ఉంది.

"ఇదేమిటే గారెలు వ్యాపారం చేస్తున్నావా?" అన్నాను.

"చాల్లేరా సంబడం. ఎంతమందిమి ఉన్నామనుకున్నా" అని.

"ఎంతమందిమే. మన ముగ్గురమే కదా. మహాఅయితే ఆయన్తో కలిపి మరోముగ్గురు" అన్నా

"ఏడ్చావులే. ఇంకా పనివాళ్ళున్నారు. మావయ్య వాళ్ళింటికి పంపించాలా... మరి మీ బావగారు వచ్చేటప్పుడు ఎవరో ఒకరిని వెంట పెట్టుకొస్తారు. మరి అందరికీ తలో నాలుగైనా రావాలికదా" అంది

నాకీ వ్యవహారం చూస్తుంటే నిజంగానే మతిపోయేటట్లుంది.

"ఈయనకి కాకుండా ఇంకా వాళ్ళింటికి కూడానా?" అన్నాను మెల్లగానే.

"సర్లే" ఇక్కడ ఏంవండుకుంటున్నామో అక్కడికి తెలిసిపోతుంది. అయితే ఏమాటకామాటే చెప్పుకోవాలి. అత్తయ్య కూడా ఏం చేసినా పంపిస్తుంటుంది."

"ఇక్కడ ఏం వండుకుంటున్నదీ చెబుతారన్నమాట. ఎవరూ సుబ్బిముండేనా?" అన్నా. అక్క నవ్వుతూ గరిట చూపించి...

"నీకు వాతలుపెట్టాల్రా" అంది... అంతలోనే బయట ఆయన కూర్చుంటే ఇక్కడికొచ్చి కబుర్లు చెబుతావేంటి? ఆయనేమన్నా అనుకోడూ" అంది.

"ఆయన్ని తప్పించుకోటానికేగా ఇక్కడ కొచ్చింది" అన్నాను.

"కాదులే. వెళ్ళికూర్చోరా. నువ్వేదన్నా అడిగితే చక్కగా చెబుతాడు. కూర్చో. నేను వస్తున్నాగా." అంది.





నేనుచేసేదేముంది. తిరిగి బయటకొచ్చాను. ఆయన నవ్వుతూ చూశాడు.

"గారె లేస్తోంది" అన్నాను ఏమనాలో తెలీక.

"మా అబ్బాయి సొమ్ము. మేంతింటాం. మాకు హక్కుంది" అన్నాడు వెంటనే...

ఇదేమిట్రా భగవాన్ ఈయన ఇలావస్తున్నాడని కంగారు పడ్డాను. ఆయన మళ్ళా నవ్వు ముఖంమీదకి తెచ్చుకొని

"మరి నువ్వు పప్పన్నం ఎప్పుడు పెడుతున్నావ్?" అన్నాడు.

అమ్మో... మహానుభావుడూ మంచినటుడూ, లాయర్ కూడానన్నమాట.

"భోజనందేముంది లెండి. ఎప్పుడైనా తినచ్చు" అన్నాను. నాకెందుకో ఆయన మాటలు విన్నాక అక్కతెచ్చే గారెలమీద నాకు హక్కుందా అనే అనుమానం మెల్లగా ప్రవేశించింది. నేనిలా మెత్తగా కూర్చుంటే గారెల్ని కాదు నన్ను భోంచేసేటట్లున్నాడు.

"మావగారూ వడ్లధర ఎలాఉంది?" అన్నాను.

"ఆఁ ఏంధరలే కొనబోతే కొరివి. అమ్మబోతే అడివి. బస్తా నూటపాతిక్కి కొనేవాడు కనపట్టంలా. మరి మీరేమో కిలోబియ్యం నాలుక్కీ అయిదుకీ కొనుక్కోవాల్సి వస్తుందయ్యో" అన్నాడు.

"మీకేం మావగారూ... పురులు కడతారు. లేకపోతే కొట్లలోపోసి మంచిధర వచ్చినప్పుడు అమ్ముకుంటారు కదా".

"ఏం అమ్ముకోటాలో ఏమిటో మొన్న నూటనలభైదాకా పలికింది. అప్పుడే తోలిపారెయ్యరా అంటే మా పెద్దాడు వింటేగా. పైగా రెడీ క్యాష్. ఇప్పుడేమో ఆ వీరయ్యను బతిమాలాలి. ఆడిదయయితే తోలిస్తాడు. ఆ తర్వాత మనదృష్టం బాగుంటే డబ్బులొస్తాయి."

"వీరయ్యా? ఆయనెవరు?"

"ఆడా... ఈ ఊర్లో బియ్యం వ్యాపారం చేస్తాడు

ఇంకెవరున్నారు. ఏదో ఇంతకాలం ఆ వీరయ్యతోనే గడిచిపోతూంది. అయితే మనిషి నమ్మకం. నాలుగు రోజులు ఆలస్యం చేస్తాడు. పైగానేమో బస్తాకి ఒకటో రెండో తక్కువే ఇస్తాడు. అయినా కూడా అందరూ వీరయ్యకిస్తారు" అన్నాడు.

"మీలాంటి పెద్దరైతులకు అది నష్టం కాదూ? మీరే క్యాష్ తీసుకొని అమ్ముకోవచ్చుగదూ?" అన్నా

"చేసుకుంటే బానే ఉంటుంది. పంట చేతికొచ్చిన రోజుల్లోనేమో ధర ఉండదు. తర్వాత పెరుగుతుందేమో అనుకుంటూ నిల్వ చేస్తాం. ఎప్పుడో ఓసారి పెరుగుతుంది. ఎవరికో లాభాలు కనపడతాయి. అసలు ఆ తరుగులూ, వడ్డీలు లెక్క చూసుకుంటే వీరయ్య ఇచ్చే ధర నష్టవే. మరేం చేస్తాం. ఈ ఊరికి లారివాళ్లు రారు. అందరూ ఒకేసారి అమ్మకోరు. ఎవడ్నన్నా నమ్మి ఇచ్చామనుకో. వాడు ఎగ్గొడితే మొదటికే మోసం వస్తుంది. అందుకే వీరయ్యా ఈ ఊరికి దిక్కు"

"వీరయ్యకూడా ఎగ్గొడితే"

"ఇంక చేసేదేముందబ్బాయ్... అప్పటికీ పైనుండి డబ్బులు రాలేదనీ...మోసం చేశారనే కోతలు పెడుతూనే ఉంటాడు. మరివ్వన్నీ భరించాలి"

"అసలు ఈ తలకాయనొప్పంతా ఎందుకు...ఎండనకా, వాననకా మీరు పంటలు పండించటం ఏమిటి? తీసుకెళ్లి ఆ వీరయ్యా చేతిలో పొయ్యటం ఏమిటి? లారీలు రావంటున్నారు. ఎందుకు రావటం లేదు. మంచిరోడ్డు లేకపోవటం వల్లనే గదా. ముందు మంచిరోడ్డు వేయించుకోండి. నరానరి మీ ఇంటి దగ్గర కొచ్చి మరీ తీసుకువెళ్లారు. మీరు ఏ వీరయ్యల కోసమో చూడాల్సిన పనిలేదు. మీదగ్గరికే ఎవరు సరుకు కావాలంటే వారొస్తారు. అసలు మీరు ఆలోచించటం లేదుగానీ, బస్తాకో పది రూపాయల చొప్పున వేసుకున్నా మీ ఊరు మొత్తం సంవత్సరానికెంత నష్టపోతుందో ఆలోచించండి. లక్షల్లో ఉంటుంది. అందరూ కలసి తలాకొంచెం డబ్బులు వేసుకొని ఆ రోడ్డు వేయించుకుంటే ముందు మీకా శ్రమా తగ్గుతుంది. మీరు పండించే వాటికి గిరాకీ ఉంటుంది. ఏమంటారు?" అన్నాను.

ఆయన కొంచెం ఇబ్బందిపడ్డాడు...

''బాగానే ఉంటుందిగానీ కొన్ని ఇబ్బంది లున్నాయబ్బాయ్'' అన్నాడు

''ఏమి ఇబ్బందులంట'' అన్నాను

''ఉంటాయి. అయి మనకు తెలిసేవి కాదు''

''అంటే రోడ్డుంటే దొంగలు వస్తారనా?'' అన్నాను కృష్ణమూర్తి గుర్తొచ్చి

''దొంగలా, పాడా గానీ''...అంటూ పక్కకు చూశాడు

అక్క పెద్దపెద్ద పళ్లాల్లో గారెలు తీసుకు వస్తోంది.

మా సంభాషణ అంతటితో తెగిపోయింది.

గారెల విషయంలో అక్కను మా అమ్మ కూడా చాలా మెచ్చుకుంటుంది. మా అమ్మేకాదు వాళ్లు అత్తగారు కూడా చాలా చాలా మెచ్చుకుంటారు. ప్రస్తుతం ఆవిడ ఇక్కడలేదు. ఇంకో కొడుకు దగ్గరఉంటోంది. ఆవిడ జీవితంలో అక్కను ఏవిషయంలోనైనా అంగీకరిస్తే బహుశ ఈ ఒక్క విషయంలోనే అయి ఉంటుంది.

ప్లేటుకేసి చూశాను. అరడజను గారెలు న్నాయి. వాటి పక్కగా చిన్నసైజు పర్వతంగా చెట్నీ ఉంది. ఒక్కో గారె సైజూ అరచేతి వెడల్పు ఉంది. నా అరచెయ్యికాదు. మా చినమామయ్య అరచెయ్యంత.

''తింటూ ఉండండి. ఇంకోవాయి తెస్తా''అంటూ వెళ్లింది.

నేను నోట మాటరాక అక్క వెళ్ళినవైపే చూస్తుండిపోయాను.

''తినల్లుడూ'' అంటూ ముక్కతీసి చెట్నీలో ముంచాడు.

''ఇన్నెక్కడ తింటామండీ బాబూ'' అన్నాను

''ఎన్నయ్యా కుర్రాడా...నాలుగేగా మొదలుపెట్టు. నాకీ గారెలు చూస్తే మా అన్నయ్యా గుర్తొస్తాడు. అడికి గారెలంటే ప్రాణం అల్లుడూ. అసలు ఈ రోజు కొబ్బరి పచ్చడి చేసిందికానీ, శుభ్రంగా కోడికోసి కుర్మాపెడితే బాగుండేది. మా అన్నయ్యా ముందు కోడికూర సట్టిపెడితే వెనకాల ఎవరికీ ఉండేదికాదు. మంచితిండి పుష్టి కలవాడులే'' అంటూ ''అమ్మాయ్'' అంటూ కేకేశాడు.

''వస్తున్నా మామయ్యా'' అంది లోపల్నుండి అక్క

''ఆ పచ్చడి పంపమ్మా'' అన్నాడు

నాకింకా ఓ గారెసాంతం తినటం కాలేదు. మూడువంతులు తినేశాడు. అక్క చెట్నీతోవచ్చి వేశాక నాకేసి తిరిగి అంది

''ఏంటిరా? అన్నీ అలా ఉన్నాయే? బాగుండలేదా?''

''ఎందుకు బాగుండలా. అయినా ఇంతింత పెద్దగారెలా'' అన్నాను

''ఇదేం హొటల్ కాదుగా అబ్బాయి చిట్టి గారెలు తింటానికి...అయినా నీ తమ్ముడు పట్టుమని నాలుగు గారెలు తినకపోతే ఇంకా ఏం చేస్తాడమ్మాయ్'' అన్నాడు

ఏం చేయాలంట...తినేవాడు తినక వెధవ కామెంట్లు...

''నేను వయసులో ఉండగా మినుముల బస్తాన్ని అలాగ్గా మోసేవాడిని. ఇప్పటి కుర్రాళ్లని ఆ పని చెయ్యమను చూస్తా. అన్నీ నాజూకు తిళ్లూ, నాజూకు వ్యవహారాలే. మేమయితే పొలెంలో బయలుదేరి పది పదిహేను మైళ్ళు నడిచే వాళ్లం. మీ కుర్రాళ్లు నడుస్తారా. మోటార్లు కావాలి. లేకపోతే భూమ్మీద కాలుపెట్టరు. మా మనవడు మెడలోకి గొలుసుకావాలంటూ గొడవ చేస్తున్నాడమ్మాయ్. ఇంకా చేతులకి కూడా బంగారపు కడియం కావాలంట. చూస్తుంటే ఆడాళ్లే నయమనిపిస్తున్నారు. అసలు ఈళ్లంతా చదివి ఉద్ధరించేదేంటోగానీ వందకాయితం మారిస్తే చిల్లర ఉండటం లేదు'' అన్నాడు

అప్పటికి గారెలు పూర్తయ్యాయి. మరో అరడజనూ, మరో చిన్నకొండంత పచ్చడీ, చెంబుతో నీళ్లూ అందించింది.

''మరాచదువులు చదివితేనేకదా లక్షల రూపాయలు కట్నాలొచ్చేది'' అంది

''ఏమికట్నాలోలే. నాబొంద. మాకాలంలో ఇయన్నీ లేవు. శుభ్రంగా తినటం, పని చేనుకోవటం'' అన్నాడు.

నాకాయన మీద అకస్మాత్తుగా ప్రేమ పుట్టుకొ

చ్చింది. ఎందుకో గురజాడగారు ఇలాంటి వారిని చూసే "తిండి కలిగితే కండగలదోయ్. కండగలవాడేను మనిషోయ్" అని రాశాడా అనిపించింది. ఈ వయసుకే ఆ రకంగా భోంచేసి అరిగించుకుంటున్నాడంటే సామాన్య విషయం కాదు. అందుకుతగ్గ ఫౌండేషన్ ఉండాలికదా.

నేను బలవంతంమీద మూడుగారెలు తిన్నాను. ఆయన ఇంకా ఏమనేవాడోగాని మా బావ వచ్చాడు. నేను లేచి నవ్వుతూ చూశాను.

"ఏరా" అన్నాడు. కుర్చీలోకూర్చుంటూ

ఆయన్తోపాటు కృష్ణమూర్తి కూడా వచ్చాడు. అక్క ఇద్దరికీ టిఫిన్ అందించింది. వాళ్లంద రూ కలిసి పొలం విషయాలేవో మాట్లాడు కుంటున్నారు. నేనూ లేచి నా గదిలోకి వెళ్లు చదువుకుందామనుకున్నాగానీ బాగుండదని కూర్చున్నా.

"ఏంటమ్మాయ్...ఈ రోజు తమ్ముడికి కోడ్ని కోయించటం లేదా?" అన్నాడు కృష్ణమూర్తి.

"ఎందుకు కోయించమయ్యా...ఇదిగో అమ్మాయ్...ఆ సుబ్బిముండను పిలిచి అరకో ళ్లున్నాయేమో చూడమను" అన్నాడు మున లాయన

"అదేంటే ఇంతవయసొచ్చి అరకోడిని తప్పితే తిననంటావ్" అన్నాడు కృష్ణమూర్తి

"వారి కృష్ణమూర్తే. నీకేం తెలుసురా. అరకో డి ఎంత రుచిగా ఉంటదో. ఏదో తిన్నాం అంటే తిన్నాం అనిగాదురా" అన్నాడు

మా బావేం మాట్లాడకుండా వింటున్నాడు. ఆ సంభాషణ అలా దీర్ఘంగా సాగుతూనే ఉంది. నాకర్థమైన విషయం ఏమిటంటే ఇక్కడ జనానికి ముఖ్యమైన విషయాల్లో భోజనం ఒకటి. అది మానవులందరికీ అవసర మేకదా అనుకోవచ్చు. అవసరమేగానీ...పాలెం జనానికి అవసరమైనంత కాదనుకుంటా.

"నీళ్లు పెట్టించు" అన్నాడు బావ

ఆయన లేచి వెళ్లి స్నానం చేశాక ఇస్త్రీ బట్టలు వేసుకున్నాడు. ఆ తర్వాత నన్ను లోపలికి పిలిచాడు.

"ఏరా నాలుగు రోజులుంటావా"? అన్నాడు

తలూపాను.

"నేను ఊరెళ్తున్నాను. నేను వచ్చేదాకా ఉండు. గుంటూరులో నువ్వు చేసేదేం లేదుగా"

"ఉంటాను" అన్నాను.

అంతటితో మా సంభాషణ అయిపో యింది. మరికొద్దిసేపట్లో కృష్ణమూర్తితో కలసి ఆయన వెళ్లిపోయాడు. ఆయన్తోపాటు చినమా మగారు కూడా.

"ఇదేమిటి తల్లీ...మీ మావగారు ఇంత హింస పెట్టేశారు" అన్నాను అక్కతో "ఏరా ఒక్కరోజు కే ఇంత ఇదయి పోతున్నావ్. మరి మేం జీవితమంతా ఇక్కడే బతకాల్సిన వాళ్లం. మా సంగతేమిటంట. అయినా ఆయన మాత్రం ఏంచేస్తాడు. ఆయన చెప్పింది కూడా నిజమే. అంత తిని అరాయించుకునే శక్తి ఉంది. అంత పనికూడా చేస్తారు" అంది.

అక్క ఏడో తరగతి చదివింది. అంతకు ముందు విజయవాడలో ఉన్నప్పుడు పుస్తకాలు చదివేది. ఎందుకో అక్కలో నాకు కొంచెం మార్పు కనిపిస్తోంది. తనకు కూడా వండిపె ట్టడం మించి మరో ప్రపంచం లేదా అనుకోవా ల్సి వస్తోంది. మనిషిలో మార్పుకు భౌతిక పరిస్థితులు ఇంతగా కారణమౌతాయా? ఏమో మొత్తం మీద అక్కలో మార్పు రావటం మాత్రం వాస్తవం.

కానీ చిత్రమైన విషయం ఏమిటంటే నాలానే అక్కకూడా బావకు భయపడుతుంది. ఆయన దగ్గర తన భావాలు చెప్పేంత స్వేచ్ఛ ఆమెకుంటుందా అనేది నాకు సందేహమే. చిన్నతనంలో తను ఇలా లేదు. నాకయితే అప్పట్లో అక్క ధైర్యం చూసి ఆశ్చర్యం కలిగేది.

ఓ రకంగా చిన్నతనం నుండీ నాకు చీక టంటే భయం. అలాగే మెరుపులన్నా, ఉరు ములన్నా కూడా భయంగా ఉండేది. వాన వచ్చిందంటే ముందు లోపలికి పరిగెత్తి తలు పులన్నీ మూసుకొని చెవుల్లో దూది కుక్కుకునే వాడిని. అలాంటి రోజుల్లో నన్ను చూసి అక్క నవ్వుతుండేది. అలాంటి అక్క కంఠంలో కూడా మార్పు.

ఇదంతా పెళ్లి తెచ్చిన మార్పా? పెళ్ళి

అందరిలోనూ ఇలాంటి మార్పును తేవటం నేను గమనించలేదు. నాకు అక్కలో వచ్చిన మార్పు తలుచుకుంటే దిగులు కలుగుతుంది. తనను బాగా ప్రోత్సహించే వారుంటే ఎంతో ఎత్తుకు ఎదగగలిగేది.

ఈ దేశంలో అక్కలాంటి వారు ఎందరెందరో. అద్భుతమైన శక్తులున్న వారందరూ ఎంతో సహజమైన విషయంలా ఇలా తయారయిపోతున్నారు. చాలా విషాదకరమైన పరిణామం ఇదంతా.

''ఏంటిరా అలా చూస్తున్నావు'' అంది అక్క

నాకూ, తనకూ వయసులో చాలాతేడా ఉంది. అయినా కూడా నా జీవితంలో నేను ఎక్కువగా చెప్పుకునేది తననే. ఆమె నాతో ఆడిన ఆటలన్నీ నాకు గుర్తే. చల్లటి చిరుజల్లుల నడుమ హాయిగా తడుస్తున్న అక్కను అమ్మ వెనకనుండి తిట్టడం కూడా గుర్తొస్తుంటుంది.

''అక్కా ఇప్పుడు వానొస్తే బాగుంటుంది కదూ'' అన్నాను

''ఎందుకూ'' అంది

''నువ్వు వానలో తడుస్తుంటే ఎంత బాగుంటుందో''

నవ్వబోయిన అక్క కళ్లు అకస్మాత్తుగా క్షణం సేపే అయినా చిన్నవిగా మారిపోయాయి. బహుశా తన బాల్యం గుర్తొచ్చి ఉంటుంది.

''ఇప్పుడయితే బావలేడు...ఇదేంటమ్మా అనటానికి నీ పిల్లలు లేరు'' అన్నా

''మీ బావ ఉంటే నన్నేమైనా అంటారా'' అంది చిరుకోపంగా

అంతలోనే...

''ఎందుకు బాబూ వానలు కోరుకుంటున్నావు. పాలెం ఎండాకాలానికే ఊరు తప్పించి వానాకాలానికి కాదు. నాలుగు చినుకులు పడితే చాలు. ఇక మా తిప్పలు మొదలవుతాయి'' అంది

ఒక్కసారిగా నా భావుకత్వం మాయమైంది. ఏ విషయం తీసుకున్నా అంతిమంగా ఈ రోడ్ దగ్గరే ముగుస్తోంది.

నాకెందుకో కృష్ణమూర్తి మాటలు గుర్తొచ్చాయి. ఈ ఊర్లో ఒక్కరైనా రోడ్డు కావాలంటారేమో చూడన్నాడు కదా. మరి అక్క కూడా పాలెంకు చెందిందే అవుతుంది. ఈ ఊరిలోనే తను బతకాలి కాబట్టి, ఈ ఊరివారు ఎదుర్కొనే సమస్యలన్నీ తనూ ఎదుర్కోవాలి. అందుకే అడిగాను

''అక్కా ఈ ఊరికి రోడ్డు అవసరం లేదా?''

''అబ్బే మాకెందుకురా రోడ్డు'' అంది.

''నేను సీరియస్‌గా అడుగుతున్నానక్కా. కృష్ణమూర్తిగారు ఈ ఊర్లో ఎవరికీ రోడ్డు రావటం ఇష్టం లేదని చెప్పాడు''

''ఆయనట్లాగే చెబుతాడు. ఊరంతా ఆయనేనని అనుకుంటాడు. ఆయనే కాదులే. ఈ ఊరిలో చాలామందికి అలాంటి అలవాటే ఉంది. తామేమనుకొంటే అదే ఊరంతా అనుకుంటారనుకుంటారు. అయినా రోడ్డు లేకుండా బతకడానికి ఇక్కడ వాళ్లు మనుషులు కాదా? పోనీ ఇదే అడవయితే పోనీలే అని సరిపెట్టుకుంటాం. అసలు ఇక్కడ చాలా తమాషాగా ఉంటుందిరా. వానొస్తే బయటకు కదలటానికుండదు. అప్పుడందరూ ఆ రోడ్డు వేయించుకుంటే బాగుంటుందికదా అనుకుంటారు. ఎవరేయించాలి రోడ్డుని. ఎప్పుడైనా ఎవరితోనైనా మాకిది కావాలని చెప్పారా...తోటి ఊరివాళ్లంతా ఏదోరకంగా పనులు చేయించుకుంటారు. మరి కరెంట్ మాత్రం ఎలా వచ్చిందోగానీ అది రాకపోయినా బాధపడరేమో'' అంది

నాకు చాలా సంతోషం కలిగింది. అయితే ఈ మాటలు కృష్ణమూర్తి వింటే ''అయ్యో మీ అక్క పట్నంలో ఉండొచ్చింది. ఆవిడకు రోడ్డు అవసరం లేకుండా ఎలా ఉంటుంది?'' అంటాడేమో.

''అక్కా ఈ ఊర్లో ఆడవాళ్లు ఎలా ఉంటారు?'' అన్నాను

''రకరకాల వారున్నారు బాబూ. వాళ్లకి మాత్రం వేరే ఆనందమేముంటుంది చెప్పు. సంవత్సరానికోసారి సినిమాకు వెళ్తే గొప్ప. అది కూడా బండ్లు కట్టుకొని తిరనాళ్లకు వెళ్లినట్లు వెళ్లాలి. మొగాళ్లు పొలాల్లో కష్టపడతారు. వీళ్లేమో ఇంటిదగ్గర గేదెల్ని పెట్టుకొని పాలూ, పెరుగూ, మజ్జిగా అమ్ముతూ వెనకేస్తారు. చాలా

మంది బాగాడబ్బున్నా పిసినారిగా ఉంటారు. అఖరికి కోడిగుడ్లని కూడా అమ్ముకుంటారు. అదిగో ఆ మినుములు వస్తాయిగా. అయి మాత్రం రబ్బుకొని ఇడ్లీలో, ఇంకా గారెల్లాంటివే తింటుంటారు. ఎంతసేపూ బంగారం కొనాలనే యావ ఎక్కువ. పోనీ అవన్నీ మెడల్లో వేసుకు తిరుగుతారా అంటే అదీలేదు. కొనటం, దాయటం. కడుపుకట్టుకోవడం. సరే ఎవరితి ప్పలు వారు పడుతున్నార్లే అనుకుందామంటే ప్రపంచంలో వీళ్లకు అనవసరమైన విషయా లుండవు. ఏ కొంపలో ఏం జరిగినా క్షణాల్లో ఊరంతా తెలుస్తుంది. బయటికెవరూ మాట్లా డుకోరు. గుసగుసలకి మాత్రం అంతులేదు. ఎవరో ఒకరి మీద ఏదో ఒకటి చెప్పుకుంటూ ఉంటారు''

"మరి ఆడపెత్తనం అంటుంటారు. అదే మైనా ఉంటుందా?''

నేనిలా అడుగటంలో నా ఉద్దేశం మొగపె త్తనం మాత్రమే ఉండాలని కాదు. ఆ నడుమ నేనో పుస్తకం చదివాను. నాకది బాగానే ఉందని పించింది కూడా. ముఖ్యంగా ఆ పుస్తకంలో పురుషాహంకారం గురించి బాగా చర్చించారు. కొంచెం భిన్నంగా ఆలోచిస్తాడనుకొన్న ఓ పెద్దా యన మాత్రం అన్నాడు. ఈ రోజు గ్రామాల్లో ఆడపెత్తనం తక్కువగా ఉంటుందనుకు న్నావా? చాలా కుటుంబాల్ని కూల్చటంలో అది ప్రముఖపాత్ర వహిస్తోంది అని చెప్పేడు. నాక యితే ఆ క్షణం ఆయన మరే పురుషుల టోన్‌లో చెబుతున్నాడు అనిపించింది. కొంచెం జాగ్రత్తగా ఆలోచిస్తే నాకో విషయం మాత్రం అర్థమైంది.

ఏ ఇంట్లోనైనాగానీ ఎవరో ఒకరి 'పెత్తనం' మాత్రమే కొనసాగితే తప్పకుండా అక్కడవచ్చే ఫలితాలు మంచిగా ఉండవని. అలాంటి దృ ష్టితోనే అడిగాను.

"ఉన్నారు బాబూ... రెండురకాల వారూ ఉన్నారు. పెళ్ళాలంటే హీనంగా భావించేవా రున్నారు. అలాగే బయట ఎన్నికబుర్లుచె ప్పినా ఇంటిదగ్గర కుక్కిన పేనులా పడుండే వారూ ఉన్నారు. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే డబ్బుతెచ్చిన అమ్మ ధీమాగా ఉంటుంది. అది తేనివాళ్ళు అణిగిపడుంటారు''

"అంటే కట్నం చావులులాంటివి ఈ ఊరి లోనూ ఉంటాయా?''

"అయ్యా ఒక్క రోడ్డు లేనంతమాత్రాన పాలెంగురించి తక్కువ అంచనావెయ్యకు ఇదేం అడవికాదు. కరుడుగట్టిన ఊరు. ఇక్కడ చాలా విచిత్రాలు జరుగుతుంటాయి. అసలు కిరసనాయిలు పోసి తగలేస్తే ఓసారే పోతారు. నిత్యమూ పెట్టే హింస భరించటం ఎవరికి సాధ్యమౌతుందంటావ్. పొలంలో పంట పండ కపోతే, పిల్లలు పరీక్షలు తప్పితే, అడ్డరోడ్డు దగ్గర బస్సు త్వరగా వెళ్ళిపోతే వాటన్నింటికీ భార్యలే కారణమనుకునే పురుషులు చాలా మందున్నారు ఇక్కడ. అయితే ఇంకా పత్రిక లకు ఎక్కటంలేదు. అంతే''- అంది అక్క.

కాబట్టి ఈ దేశంలో గ్రామాలుగానీ, పట్నా లుగానీ, నగరాలుగానీ కొన్ని విషయాల్లో పోలిక లుకలిగి ఉన్నాయన్నమాట.

"ఏంటిరా ఈ ప్రశ్నలు. నువ్వేదో పత్రిక తరపున ఇంటర్వ్యూ చేయటానికి వచ్చినట్లు'' అంది.

"మరేం చెయ్యమంటావ్?''

"ఏమైనా విశేషాలుంటే చెప్పు''

"ఏం విశేషాలైతే నీకు బాగుంటాయి. అయినా విశేషాలు తెలియచేసేది పత్రికలు. అవిక్కడకిరావు. వచ్చినా చూసే తీరిక మీ కుండదు. మరింక నన్నేం చెప్పమంటావో చె ప్పు. కనీసం నీనుంచైనా మీ ఊరి గురించి తెలుసుకుంటున్నాను'' అన్నాను

"మంచిదేరా. మధ్యాహ్నం తీరిగ్గా కూర్చుందాం— ఈపూట ఏం కూర చెయ్య మంటావో చెప్పు'' అంది.

"ఏదో ఒకటిలే'' అన్నాను.

"కోడిని కోయించమంటావా?'' అంది

"కోడినంటావేమిటి... అరకోడిని అను'' అన్నాను

"అందులోకూడా గుడ్లుకొచ్చిన వాటిని మాత్రమే తింటార్రా'' అంది అక్క

"వెనకటికాలంలో రాక్షసులుకూడా...'' అంటూ ఏదో చెప్పబోయాను...




"ఏడ్పావులేరా" అంటూ అక్క లోనకు వెళ్ళి పోయింది.



**నే**ను గదిలోకూర్చుని పుస్తకాలు తెస్తుంటే రాముడొచ్చి అన్నాడు.

"బాబూ మీకోసం ఆబాబుగారొచ్చాడు"

మళ్ళీ ఎవరా అనుకుంటూ బయటి కొచ్చాను.

"బాగున్నావా". అన్నాడు

"నువ్వు రవివి కదూ... ఐమీన్ రవిచంద్రా" అన్నాను

"అవును" అన్నాడు నవ్వుతూ

"ఎన్ని సంవత్సరాలైంది" అన్నాను జ్ఞాపకం చేసుకుంటూ

నాకు బాగా జ్ఞాపకం. మేమిద్దరం పదోతరగతి పరీక్షలు రాసేటప్పుడు కలుసుకున్నాం. 'పాలెం'కు చెందిన మాస్టారు మా స్కూల్లో పనిచేసేవారు. ఆ పరీక్షలకి రవి వాళ్ళంతా ఆయన ఇంటిదగ్గర ఉండే రాశారు. అప్పుడే నాకు పరిచయం. మేం లెక్కలు పరీక్షరాసేక మ్యాట్నీకికూడా వెళ్లాం.

అందులోనూ విఠలాచార్య జానపద చిత్రం. ఆ కత్తియుద్ధాలు చూసి చాలా ఆనందించాంకూడా. రవితోపాటు ఇంకో మిత్రుడుకూడా ఉన్నాడుగానీ తను చదువుకోవాలి. రానన్నాడు. పబ్లిక్ పరీక్షలు పెట్టుకొని సినిమాకు వెళ్లిన మమ్మల్ని చిత్రంగా చూశాడు కూడా. ఆతర్వాత ఎప్పుడో ఓసారి మాత్రం కనిపించాడు.

తను ఈ రాష్ట్రంలో చదవలేదు. కానీ నాకెందుకో తరచుగా గుర్తొస్తుండేవాడు. స్వల్ప కాలంలోనే నన్నంతగా ఆకర్షించాడు.

"రా... రవీ లోపల కూర్చుందాం" అన్నాను

"అదేంలేదు. ముందు మా ఇంటికి వెళ్దాం" అన్నాడు

నరేనని అక్కతో చెప్పి బయలుదేరుతుంటే మెల్లగా చెప్పింది.

"భోజనానికి అక్కడ కూర్చోకు వచ్చేయి"

"అలాగే"నంటూ వచ్చేశాను.

రవిచంద్ర వాళ్ళది డాబా. పాతకాలంనాటిదే అయినా చూట్టానికి బాగుంది. బయట విశాలమైన స్థలం... దూరంగా వావిడి... ఎత్తుగా గడ్డివాము. మేం తన గదికి వెళ్లాం. ఆ ఇంటికి ఎదురుగానే షావుకారుగారి ఇల్లుంది. ఆ ఇంటిమీద ఎత్తుగా ఏంటీనా కనిపిస్తోంది. అంటే 'పాలెం'కు కూడా టీవీలు వచ్చేసినయ్!

"ఏం చేస్తున్నావ్" అన్నాను మంచంమీద కూర్చుంటూ

"బిజినెస్... హైదరాబాద్‌లో"

"ఏం చేస్తున్నావ్... అదే ఏ వ్యాపారం"

"మా అంకుల్‌వాళ్ళకి చాలా వ్యాపారాలున్నాయి. ఆటోమొబైల్స్ మాత్రం నేను చూసుకుంటున్నాను" అన్నాడు

"పెళ్ళి చేసుకున్నావా?"

"అయింది పోయిన సంవత్సరమే"

"నువ్వు ఇంజనీరింగ్ చేశావుకదూ"

"అవును. జాబ్‌లో చేరితే ఎంతిస్తారు... మహాఅయితే అయిదువేలు. పైగా ఒకడిక్రింద పనిచేయాలి. బిజినెస్ అయితే మనకింద నలుగురు పనిచేస్తారు కదా" అన్నాడు చిర్నవ్వుతో.

అదేదో ముందే నిర్ణయించుకుంటే ఈ పాటికి చాలా సంపాదించి ఉండేవాడేమో. ఏమైనా విఠలాచార్య సినిమాను ఆబగా చూసిన రవికీ, ఈ రవికీ పోలికేలేదు. భాషలో కూడా.

"నువ్వు వచ్చావని ఎవరో అన్నారు. నువ్వంటే నువ్వని కాదు. మీ బావగారి పేరు చెప్పి అనుకుంటే నువ్వే అయిఉంటావనుకొని వచ్చాను. చాలా థ్రిల్లింగ్‌గా ఉంది"

"నీకు గుర్తుందా... మనం విఠలాచార్య




సినిమాకు వెళ్ళాం''

"ఓ అదా... ఫస్సేకదూ'' అన్నాడు.

"నాకిక్కడ బోర్‌గా ఉంటుంది సుధీర్... నేను ఇక్కడకు వచ్చినప్పుడల్లా కొన్ని కేసెట్స్ పడేసి వెళ్తుంటాను. అంకుల్ వారింట్లో వి.సి.ఆర్ ఉంటుంది. మరీ బోర్‌కొడితే అది తెచ్చుకొని సిన్మాలు చూస్తుంటాను. ఆయన వీడియో లైబ్రరీ తయారుచేస్తున్నాడు. ఆయ నంటే షావుకారు అంకుల్ కాదు. నీకు తెలు సుగా హరి... నరహరి... వాళ్ళబ్బాయి''

"లేదు వాళ్ళబ్బాయి ఉన్నాడని విన్నాను''

"ఒకబ్బాయి కాదు. ఇద్దరు చిన్నపిల్లలే. హరిగాడు మంచి ఇంగ్లీష్ క్యాసెట్స్ కొనుక్కొ స్తుంటాడు'' అంటూ గొంతు తగ్గించి అన్నాడు.

"వాడి టేస్టే టేస్ట్... లేటెస్ట్ బ్లూఫిల్మ్సు పికప్‌చేస్తాడు''

ఒక్షణం నాకేం మాట్లాడాలో అర్థంకాలేదు.

"వాళ్ళనాన్న ఏమీ అనడా?'' అన్నాను.

"ఎందుకనడూ... ఆయనకి ఆ బి.ఎఫ్‌లు బాగుండవు. ఆయన్దంతా కన్సర్వేటివ్ పద్ధతి. మేజువాణీలంటారే అవి. ఇంకా చెప్పాలంటే భోగం డాన్సులంటే మన జనం సిన్మాల్లో డాన్సు లు చూసినంత ఆబగా చూస్తాడు. హరి కూడా సామాన్యుడుకాదులే. దేశవాళీ బి.ఎఫ్.లు... అంటే రాజమండ్రిలో తయారయ్యే వాటిని ఆయనకోసం తెస్తాడు'' అన్నాడు సింపుల్‌గా.

ఏంటి రాజమండ్రిలో బ్లూఫిల్మ్సు తీస్తు న్నారా?'' అన్నాను అయోమయంగా

"వాట్‌మేన్. ఏంటలా ఆశ్చర్యపోతావు. నర హరిగాడు తలుచుకుంటే ఈ పాలెంలో ఆ కొబ్బరితోటలో తీసెయ్యగలడు. ఏంకావాలి. కెమెరామెన్... ఒక స్త్రీ ఇంకో పురుషుడు అంతేగా...''

ఎంతో అమాయకంగా ఉండే... 'పి.టి. రవి' ఇప్పుడు వాటికి ఎడిక్ట్ అయ్యాడు. వాడికవి చూడందే నిద్రరాదు

"ఆవొక్కటేనా... ఇంకేమైనా ఉన్నాయా?'' అన్నాను

"ఇంకేమైనా అంటే... యూమీన్ బీరా? నో... వాడు బీర్ తాగడు. టుబి ఫ్రాంక్ అది ఆడవా ళ్ళు తాగేది. వాడు జానీవాకర్ తాగుతాడు. ఘాడు ఎక్సులు తాగుతాడు. వాళ్ళింట్లో ఫ్రిజ్‌లో... అన్నట్టు ఇంకోవిషయం చెప్పాలి. హరిగాడింట్లో రెండు ఫ్రిజ్‌లున్నాయి. ఒకటి వీడికోసం రెండోది కర్రీస్ గట్రా పెట్టుకోవ టంకోసం. వీడి ఫ్రిజ్ చిన్న షాపులా ఉంటుంద నుకో. నీకేరకం కావాలంటే అది వాడిదగ్గరే దొరుకుతుంది. నేను వస్తే ఇక్కడ వాడేరా కాలక్షేపం. ప్రాబ్లమ్ ఏమిటంటే వాడెప్పుడు 'పాలెం'లో ఉంటాడో తెలియదు''

"ఎక్కడికి వెళ్తాడు?''

"వాడిష్టం. మద్రాను వెళ్తాడు. బాంబేవెళ్తా డు. గోవా వెళ్తాడు''

"మరి పొలాలన్నీ ఎవరు చూసుకుంటా రు?''

"అంకుల్ ఉన్నారు కదా. ఆయన చూసు కుంటాడు. డబ్బుపారేసి మనుషుల్ని పెట్టు కుంటాడు. వాడు గోల్డెన్ స్పూన్‌తో పుట్టాడు. జీవితాన్ని ఎంజాయ్ చేయటానికి పుట్టాడు. కాకపోతే అంకుల్ చెక్‌పవర్ ఇవ్వలా.''

"ఎందుకని?''

"ఎందుకనేముంది... అదిచ్చేస్తే ఆ తర్వాత వెనకాల వాళ్ళకి ఏమీ మిగల్చడు. అయినాకూడా అంకుల్‌కి వాడి దెబ్బ గట్టిగానే తగుల్తోంది'' అన్నాడు. మొత్తంమీద రవి చాలా వివరాలు చెబుతున్నాడు...

"ఉండు...'' అనేసిలోపలకి వెళ్ళి రెండు థమ్సప్ సీసాలు తెచ్చాడు.

"కంగారుపడకు. ఇందులో బీర్‌లాంటిదేం లేదు. హాట్‌డ్రింక్స్ కూడా కాదు. మొన్న వస్తూ నాలుగు సీసాలు తెచ్చి ఫ్రిజ్‌లో పెట్టాను. ఇప్పుడు చెప్పు. ఏమిటి విశేషాలు? ఏం చేస్తు న్నావు? మ్యారేజి జరిగిందా?''

టకటకమంటూ అడిగాడు.

"ఇంకా ఏమీ చెయ్యటంలేదు. పెళ్ళికూడా చేసుకోలేదు. ఏంచేయాలా అని ఆలోచిస్తు న్నా''

"మీ బావనుమాత్రం అడక్కు. విజయవాడ నగరం వదిలేసి ఇదిగో ఈ పాలెంలో సెటిల య్యాడు. నిన్నుకూడా ఇక్కడే పదెకరాలు కొను క్కోమనగలడు'' అని బిగ్గరగా నవ్వాడు.

తనలా నవ్వుతుంటే నాకు నవ్వొస్తోంది. వీడు చాలా తమాషాగా మాట్లాడుతున్నాడు.

"నరహరివాళ్ళ నాన్ననడిగి ఈ ఊరికి రోడ్డు వేయించవచ్చుగా. అప్పుడు తనకీ అటూ, ఇటూ తిరగటానికి ఇబ్బందులుండవు" అన్నాను.

"రోడ్డా... వాడు ఇబ్బంది పడుతున్నాడా? వాడెందుకుపడతాడు. వాడిదగ్గర బులెట్ ఉంది. దానిమీద కూర్చున్నాడంటే హిమాలయన్ కారు ర్యాలీ నడిపినట్లే. ఈ గుంటలూ, గత్రా వాడినేంచెయ్యలేవు. వాడికి కావలసింది. ఆనందం అందుకే ఇలాంటి విషయాల్లో జోక్యంచేసుకోడు. నీకు తెలుసా. ఈ రాష్ట్రంలో వాడిలా బండి మెయిన్‌టెన్ చేసేవాడే లేడు. ఎప్పుడుచూసినా తళతళలాడాల్సిందే. టైర్లు అరిగిపోతే క్షణాల్లో మార్పించేస్తాడు. అయినా వర్షాకాలంలో ఈ పొలెంలో కూర్చుంటాడనుకున్నావేమిటి... అదంతా అంకుల్ పద్ధతి. వాడా సమయంలో అందాల్ని అన్వేషిస్తూ పోతాడు"

"అంటే వ్యభిచారమా?"

"అదిగో అలాంటి పదాలు వాడకూడదు. షావుకారు అంకుల్‌అయితే ఏ సానికొంపల్లోకో పోవటమో లేదా టౌన్లోకి తెప్పించుకోవటమో చేస్తాడు. ఆయన చిన్నతనంగురించి ఇక్కడ ముసలాళ్ళు చెబుతుంటారు. రాత్రుళ్లు మంచాలు ఎత్తుకొని పొలాల్లోకి తీసుకెళ్తుండే వాడంట"

"ఎవరివి?"

"ఎవరివేమిటి? ఆయన కావాలనుకున్న ఆడపిల్లలవి. అవి కూడా ఎక్కువగా మాలపల్లిలోవి. సాధారణంగా అలాంటి పరిస్థితి రానిచ్చేవాడుకాదు. మనసయిన ఆడదాన్ని అంతతేలిగ్గా వదిలేవాడుకాదు. దీంతో ఇలాకాదు అనుకున్నప్పుడు మాత్రం మంచాలు ఎత్తుకుపోవటమే"

"మరేం గొడవలు జరిగేవికాదా?"

"ఇలాంటి విషయాలు ఎవడు బయటకి చెప్పుకుంటాడు. అందులోనూ ఆడపిల్లలు. పెళ్ళి కావలసినవాళ్ళు. నోరుమూసుకొని పడుంటారు. ఈ ఊరు ఆయన్ది. ఎవరికి ఎం అవసరమొచ్చినా ఆయన దగ్గరకు వెళ్లాలి. అందుకే మాట్లాడేవాళ్లు కాదు. మన నరహరిగాడు ఆ పద్ధతులన్నింటికీ వ్యతిరేకం. ఏ స్టార్ హెూటల్లోనో కూర్చుంటాడు. ఫోన్‌చేస్తే కారులో కాల్‌గర్ల్ వస్తుంది. ఆ రాత్రి ఎంజాయ్ చేశాక వెళ్లిపోతుంది" అన్నాడు.

"ఈ విషయాలన్నీ ఈ ఊరిజనానికి తెలుసా?"

"ఏదో నరహరి జల్సా చేస్తాడనీ, డబ్బు బాగా ఖర్చుచేస్తాడనీ మాత్రం అనుకుంటారు"

"మరి నువ్వు హైదరాబాద్‌లోనే సెటిలవ్వాలని అనుకుంటున్నావా?" అన్నాను

"కాక ఇక్కడకు రమ్మంటావా? అసలు నేను ఈ పొలాలూ. గత్రా అమ్మేసి హైదరాబాద్ వచ్చేయమని అమ్మావాళ్ళని మొత్తుకుంటున్నా. కానీ వాళ్లురారు.

వాళ్లకి ఇక్కడే ఆనందంగా ఉంటుంది. ఇక్కడ పనిచేయటానికి మనుషులు దొరుకుతారు. వాళ్ళను 'ఏమే' అన్నా 'ముండా' అన్నా నవ్వుకుంటారు. అక్కడయితే అలా కుదరదు గదా. నాక్కూడా పోనిలే ఇక్కడ ఇల్లు ఉంటే ఎప్పుడైనా సరదాగా వచ్చిపోతుండవచ్చుననుకున్నాను" అన్నాడు.

"నాలుగు రోజులుంటున్నావా?" అన్నాను

"లేదు. భోంచేశాక వెళ్ళిపోతున్నా. నువ్వు హైదరాబాద్‌వస్తే నన్ను కలవకుండా మాత్రం రావద్దు" అంటూ ఇంట్లోకివెళ్ళి ఓ విజిటింగ్ కార్డ్ తీసి ఇచ్చాడు. స్క్రీన్‌ప్రింటింగ్‌తో తయారైన ఆ కార్డ్ మెరిసిపోతూంది.

"మరింకేమిటి విశేషాలు?" అన్నాడు నవ్వుతూ

"ఏమున్నాయి. మామూలే. సర్లే. ఈసారి హైదరాబాద్‌వస్తే నేను నీకు ఫోన్‌చేస్తాను. మరి నేను బయలుదేరుతా" అన్నాను

"అప్పుడే. ఉండు భోంచేసి వెళ్దువుగాని"

"లేదు రవీ వచ్చేముందు అక్క మరీ మరీ చెప్పింది"

"దట్సాల్‌రైట్. ఈరోజు నాకు చాలా సంతోషంగా వుంది. చాలాకాలానికి నిన్ను చూశాను" అన్నాడు.

నేను చిరునవ్వుతో లేచాను. "నన్ను కూడా రమ్మంటావా?" అన్నాడు.




"ఎందుకు. నేను వెళ్తానుగా" అని వచ్చేశాను.

నన్ను చూసి వాడు సంతోషించాడో లేదోగాని వాడినిచూసి నేను మాత్రం సంతోషించటంలేదు. ఎంత కాదనుకున్నా వాడీ ఊర్లో పుట్టాడు. పెరిగాడు. అలాంటప్పుడు కనీసమైన అనుబంధం ఏర్పడాలి. హైదరాబాద్ నగరం గొప్పదే. అయినాకూడా పాలెంను దాంతో పోల్చటానికి లేదు. అందుకేకాదు నరహరి విషయంలో వాడు అనుసరించిన ధోరణి కూడా నాకు నచ్చలేదు.

అంత ఆనందంగానూ, గొప్పగానూ చెప్పుకోవాల్సిన ఘనకార్యాలేం కాదవి. ఒక్కముక్కలో అహస్యాన్ని కలిగించే ఈ విషయాల్ని ఎవరితోనైనా పంచుకోవటానికే సిగ్గుపడాలి. ఓ విమర్శగానో, మరోరకంగానో చెబితే అర్థం చేసుకోవచ్చు. కానీ అలాంటిదేం లేదు రవి మాటల్లో. నరహరి తనకో ఆదర్శపురుషుడులా కనిపిస్తున్నాడు.

మొత్తంమీద పాలెం అడుగడుగునా విశేషాలున్నాయి. ఆధునిక ప్రపంచానికి చెంది ఎవరికవసరమైన వాటిని వారు తీసుకుంటున్నారు. ఈ మారుమూలన కూడా నగ్నచిత్రాలు ప్రదర్శిస్తున్నందుకు, ఆరకమైన అభివృద్ధి సాధించినందుకు గర్వపడాలి. దేశం ముందుకు పోవటంలేదని అనుకోవటం నిజంగా నాలాంటివారి బుద్ధితక్కువే.

కాగా పాలెంలోని పాతతరంవారు కడుపు కట్టుకొనో, మరోరకంగానో తమ ఆస్తులు పెంచుకుంటూ వచ్చారు. అయితే అవన్నీ బంగారం రూపంలోనూ, పొలాల రూపంలోనూ వుండిపోయాయి. ఇప్పుడొస్తున్నతరం వాటిని అంటిపెట్టుకుని వుండటానికి ఇష్టపడటంలేదు. అందుకే మెల్లగా వ్యాపారరంగంలోకి ప్రవేశిస్తున్నారు.

అయితే ఇక్కడ కొంత ఘర్షణ జరిగి తీరుతుంది. ఈ మార్పును పాతతరంవారు అర్థం చేసుకోలేరు. ముఖ్యంగా వారు ఎలాంటివారైనా భూమిని నమ్ముకున్నారు. ఇప్పుడొచ్చేవారు భూమిని అమ్ముకుంటున్నారు. వారు స్వయంగా వ్యవసాయం చేయలేరు. చేయించనూలేరు. అంతకంటే వానలూ, వరదలూ వల్ల పంట చేతికంది వచ్చేదాకా నమ్మకమూ లేదు. వర్షీపరంగా చూసుకుంటే కూడా వ్యవసాయం ఏమాత్రం గిట్టుబాటు లేకుండా వుంది. ఓ ఎకరం మీద వచ్చే ఆదాయం ఎలాంటి శ్రమా లేకుండా, దాన్నమ్మి బాంకులో డిపాజిట్ చేసుకుంటే వస్తుంది. ఇంకా ఎక్కువ వస్తుంది. ఆ కాలాన్ని మరో రంగంమీద కేటాయించవచ్చునుకుంటున్నారు.

పాతతరం ఈ వాదనల్ని ఆమోదించలేదు. వారింకా ఈ బ్యాంకుల్ని నమ్మే స్థితిలో లేరు. రెండవది వ్యాపారం చేసేవారంతా విజయం సాధించలేరు. అందులో అపరిమితమైన పోటీ వుంది. ఓ రూపాయి లాభం వస్తుందనుకుంటే దాన్నే నలుగురూ పంచుకోవాలి. అదే పది మంది అయితే ఆ లాభం చిక్కుతుంది. వందమందయితే లాభంకాదు మిగిలేది. ఉన్న ఆస్తులు అమ్ముకోవాల్సిందే. వ్యవసాయంలో అలాంటిదేం లేదు. కనీస గ్యారంటీ వుంది. అంతేకాదు పాతతరం భయపడుతున్నది ఈ వ్యాపారాన్ని గురించే కాదు. నరహరి లాంటి వారి గురించి కూడా.

నగరాల్లో నరహరిలాంటివారు వ్యాపారాలు చేస్తారో లేదోగానీ మిగతా పనులు చేస్తున్నారు. పెట్టుబడిదారీ ప్రపంచపు వింతలకు అంతకంతకూ ఆకర్షింపబడుతున్నారు. దానివల్ల జరుగుతున్న పరిణామమేమిటంటే తాము దాచిన, దోచిన డబ్బంతా కరుగుతూ వస్తోంది. కొంతకాలంపోతే ఈ కొండలు సాంతం కరిగిపోతాయి. అప్పుడెలా? అనే సమస్య పాతతరం వారిని పీడిస్తోంది. అందుకే ఘర్షణలు తప్పటంలేదు.

ఈ సమస్య అందరిదీకాదు. కొద్దో గొప్పో డబ్బున్నవారిది. అయితే ఇలాంటి సమస్యను మధ్యతరగతి కుటుంబాలు మరోరకంగా ఎదుర్కొంటున్నాయి. ఎవరూ అంత సీరియస్‌గా ఈ పరిణామాలగురించి పట్టించుకోవటంలేదు గానీ... మనకు అర్థం కాకుండా అనేకరకాల ఆర్థిక సంబంధాలు చక్రంలా తిరుగుతున్నాయి. తుపాన్‌కు ముందు ప్రశాంతతలా వుంది. కానీ ఎప్పుడు ఎలా బద్దలవుతుందో గానీ... ఈ సమాజాన్ని మొత్తంగా ఊపేసే మార్పులు అంతర్గతంగా జరుగుతున్నాయి.



నేనిప్పుడు పొలెంకు చెందిన పాతతరంవారు. రోడ్డు విషయంలో అనుసరిస్తున్న వైఖరిని కొంతవరకూ అర్థం చేసుకోగలుగుతున్నాను. రెండురకాల వ్యవస్థల నడుమ ఘర్షణ ఇది. పాతతరంవారు ఆధునిక సమాజంలో వస్తున్న మార్పులపట్ల హడలిపోతున్నారు. తాము ఇప్పటివరకూ కాపాడుకుంటూ వచ్చిన సంబంధాలనన్నింటినీ అవి నిర్దాక్షిణ్యంగా ధ్వంసం చేస్తాయని వారు గాఢంగా నమ్ముతున్నారు. అయితే ఆ మార్పుల్ని ఆహ్వానించకుండా వుండలేకపోతున్నారు.

అందులో ఎంత జాగ్రత్తపడదామనుకున్నా తమకు ఇష్టంలేని భావాలు చొప్పుకు వస్తున్నాయి. అవునుమరి ఇవన్నీ సహజపరిణామాలు.

నేను నడుచుకుంటూ వస్తుంటే దారిలో ఒకరిద్దరు పలకరించారు. నాకయితే ఈ ఊర్లోనే వున్న గాంధేయవాదిని కలుసుకొని చర్చించాలనుంది. అందుకాయన సుముఖంగా వుంటాడా అనేది కూడా వుంది.

ఇంటికొచ్చాక అక్కా నేనూ కలిసి భోంచేశాం. నేను కొంచెంసేపు పడుకుంటానని తనతో చెప్పాను.

అక్క సరేనంది. తనుమాత్రం నిద్రపోదు. ఏదో ఒక పని కల్పించుకుంటుంది.

నేనింక నిద్రలో వుంతగానే ఎవరో మాట్లాడుకుంటున్నట్లు వినిపించింది. ఆ తర్వాత ఇంక నాకు నిద్రపట్టలేదు. నాకు అర్థమైనదేమిటంటే వాళ్లు అక్కావాళ్ళు చినమావయ్యగారికి చెందినవారు.

దాదాపు ఓ గంటకుపైగా అలా మాట్లాడుకుంటుంటే నేను వింటుండిపోయాను. అక్క చెప్పినట్లు అందులో దేశం వారి గురించిన వివరాలు చోటుచేసుకుంటూనే వున్నాయి. కాకపోతే ఆ చెప్పేవిధానం మాత్రం భలే తమాషాగావుంది. బిగ్గరగానే మాట్లాడుతున్నారు. అయితే అంతలోనే గొంతు తగ్గించి ఏదో రహస్యం చెప్పినట్లు చెప్పేసి తిరిగి పెద్దగా మాట్లాడుతున్నారు. నాకయితే ఇదంతా ఏ గూఢచారి సంస్థలకో శిక్షణ ఇచ్చేటట్లుగా అనిపించింది.

పిల్లల చదువుల విషయం కూడా వారి మాటల్లో వచ్చింది. ఇక్కడ చాలామందికి పిల్లలు నిజంగానే చదవాలనే ఆలోచన లేదు. అయితే ఎక్కువ మార్కులు రావాలని మాత్రం వారు కోరుకుంటారు. తమ పిల్లవాడు గ్రాడ్యుయేట్ అయ్యాడా లేదా అనేది వారికి ప్రధానం. ఈ గ్రాడ్యుయేట్ అవటం అనేది కూడా చాలా మార్పులకు గురిచేస్తుంది.

ఎంత పొలం వున్నా చదువు లేకపోతే మంచి కట్నంతో పిల్ల రావటంలేదు. ఇదివరకటిరోజుల్లో ఎంత పొలం వుంది అని చూసేవాళ్ళు. ఇప్పటిరోజుల్లో అలాకాదు. ఉద్యోగం చూస్తున్నారు. గుమాస్తా ఉద్యోగమయినా గౌరవప్రదంగానే వుంటుంది. ముఖ్యంగా నెలనెలా జీతాలొస్తున్నాయి వారికి. ఇంకా పైడబ్బులు బాగా వస్తుంటాయి. అందుకని ఉద్యోగం చేసుకునేవాడయితే తమ బిడ్డని గ్యారంటీగా సుఖపెడతాడు. ఇదే వారి నమ్మకం. ఇంకోరకం వారికేమో మా అల్లుడు ఇంజనీరో అనో, డాక్టరనో చెప్పుకోవటంలో గర్వం వుంది. చినమావగారి భార్యే, ఇంకెవరోగాని ఈ పెళ్ళిళ్ళూ, కట్నాల ధరవరలు గురించి చెప్పింది. ఆవిడకు అమ్మాయిలేగాక అబ్బాయిలు కూడా వున్నట్లున్నారు. అందువల్ల అమ్మాయిని పంపించటానికి తాము పడుతున్న కష్టాన్నీ అటు చెల్లింపుల్ని ఎంతో బాధ్యతగా చేయవలసిన వాటిగానే వివరిస్తోంది.

మొత్తంమీద నేను గమనించిందేమిటంటే ఎక్కువభాగం అక్క శ్రోతగానే మిగిలిపోయింది. మరీ అవసరమైనప్పుడు మాత్రం క్లుప్తంగా మాట్లాడుతోంది. మరికొద్దిసేపట్లో "ఏమిటోవీడు అలానేపడి నిద్రపోతున్నాడు" అంటూ లేచివచ్చింది. "సుధీర్... లే... చీకటి పడుతోంది" అంది లేపుతూ.

తనకు మొదటినుండే అలా చెప్పటం అలవాటు. నేను లేచి కూర్చున్నాను. "మరి నేను వస్తానొదినా" అంది బయటనుంచి ఆవిడ. అక్క బయటకు వెళ్ళి "ఉండు టీ తాగి వెళ్లువుగానీ" అంది.

"ఇప్పుడు నాకొద్దు" అంటూ ఆవిడ వెళ్ళిపోయింది. కొంతవరకు రిలీఫ్‌గా ఫీలయ్యాను. ఆవిడతో పరిచయ కార్యక్రమం ఏర్పాటుచేస్తే




అది ఎలాంటి మలుపు తీసుకుంటుందో చెప్పలేం.

నాకెందుకో కృష్ణమూర్తి గుంటూరులో ప్రవర్తించిన తీరు మాత్రం అనుమానంగానే ఉంది. తనకు ఎంతవనున్నా హెూటల్‌కు వచ్చేవాడు. తను అలా చెప్పాడంటే మొత్తంమీద ఊర్లో ఓ రవ్వ పడుంటుంది. అంతవరకు మాత్రం వాస్తవం. ఆ రవ్వ రగులుకుంటుందా... లేకపోతే అంతటితోనే ఆగిపోతుందా అనేది వేరే విషయం.

నా దురదృష్టం ఏమిటంటే నాకు కావలసిన వ్యక్తి దొరకటం లేదు. ముందు ఈ గ్రామం గురించీ, అందులోని మనుషుల గురించీ, ఇక్కడి చరిత్ర గురించి తెలిసిన వ్యక్తుంటే ఈ పరిణామాల్ని ఓ క్రమంలో అర్థంచేసుకుంటానికి అవకాశం ఉంది. ఎవరూ లేకపోయినంత మాత్రాన అర్థం చేసుకోలేమని కాదు. కాకపోతే కొంచెం కష్టం. ఇంకొంచెం ఎక్కువ సమయం కేటాయించాలి. ఇంకా బాగా శ్రమపడాలి కూడా.

నాకెందుకో ఈ ఊరిని సంస్కరించాలనుకున్న మాస్టారు గుర్తొచ్చాడు. ఆయన ఏమై ఉంటాడు? ఆయన్ని ఏమైనా చేశారా? అసలేం జరిగి ఉంటుంది. అక్కనడిగినా క్లుప్తంగానే చెబుతుంది. తనకు తెలిసేదంతేమరి. ఇంకా ఖచ్చితంగా చెప్పుకోవాలంటే ఇలాంటి గ్రామాల్లో బతికే ఆడవాళ్ళు తమ పక్కన ఏం జరుగుతుందో కూడా తెలుసుకోలేరు. వారికంటే బయటున్నవారికే ఎక్కువ విషయాలు తెలుస్తుంటాయి. ఇది కూడా ఓ కోణం.

నాకు బాగా గుర్తు. ఈ 'పాలెం' నుండే ఓ మిత్రుడు వస్తుండేవాడు. తను ఓసారి ఏదో కవిత రాసుకొని మా మ్యాగజైన్‌కు ఇచ్చాడనుకుంటాను, ఇచ్చేముందు నాకు చూపించాడు. అందులోని రెండు పాదాలు నాకింకా గుర్తున్నాయి.

"రాజనాలు పండించే రైతుకు, భోజనానికే లేదన్నా" మరి అలాంటి మిత్రుడు ఉంటే ఈ ఊరి సంబంధాలకు బాగా విశ్లేషించగలడనుకొంటాను. అతనిపేరు... గుర్తుకొస్తూంది... ఏమిటబ్బా... అవును... హనుమంతరావు. తను బాగా నల్లగా ఉండేవాడు. అతని సంచి కూడా కాకీసంచి. మరి తనకి కూడా ఉద్యోగం వచ్చిందేమో, లేదా తను కూడా వ్యాపారం చెయ్యటానికి మిత్రుడికి అంత ఆర్థికస్తోమత లేదు. చేస్తే అతను ఏ ఉద్యోగమైనా చేస్తుండాలి.

నాకెందుకో మా బడికి టిఫిన్ తీసుకెళ్ళి భోజనం చేయాలని అనిపిస్తుండేది. మా ఇంటికి స్కూలు దగ్గరే. అందుకే ఇంటికి వెళ్ళిపోయేవాడిని, వీళ్ళంతా టిఫిన్లు తెచ్చుకుని అక్కడే భోంచేసేవారు. హనుమంతరావు తెచ్చుకునే టిఫిన్ కూడా పేదగానే కనిపించేది. నేను హనుమంతరావు కులం గురించి ఎప్పుడూ అడగలేదు. అలా తెలుసుకోవాలని నాకు మొదటినుంచీ ఉండేదికాదు. ఏది ఏమైనా అగ్రకులాలుగా పిలవబడే వాటికి చెంది ఉండకపోవచ్చు.

నిజానికి హనుమంతరావుతో నా పరిచయం కూడా చిత్రంగానే మొదలైంది. చాలాకాలం మేమందరమూ ఒకే తరగతిలో కూర్చుంటున్నా ఒకరిగురించి ఒకరు పట్టించుకునే వాళ్ళంకాదు. తను ఎప్పుడూ వెనక బెంచిల్లోకూర్చునే వాడు. అందుకే అల్లరిచేసేవాడు. నేను మాత్రం ముందువరుసల్లో ఉండేవాడిని. క్లాసులో ఫస్ట్‌మార్కులు నాకు వచ్చేవి కాదు గానీ మరీ తక్కువ కూడా వచ్చేవి కాదు.

చదువుకునే రోజుల్లో నేను కొంచెం ప్రత్యేకంగానే ఉండేవాడిని. ముందు మా బడిలో ఎలాంటి పోటీలు జరిగినా వాటిలో నేను తప్పకుండా పాల్గొంటుండేవాడిని. మిగతా విషయాలు ఎలా ఉన్నా వక్తృత్వం పోటీలకు చాలా తక్కువమంది హాజరవుతుండేవారు. పోటీలు కాకపోయినా విడిగా కూడా ఏదైన విషయం మీద మాట్లాడమని పిలిస్తే ముందునేను వెళ్ళి అనర్గళంగా మాట్లాడేవాడిని.

"నువ్వు బాగా ధైర్యంగా మాట్లాడతావు" అన్నాడు ఓసారి హనుమంతరావు. ఇదంతా తన కవిత చూడకముందే. అసలు తను కవిత్వం రాశాడంటేనే నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. అందులోనూ 'రాజనాలూ... భోజనాలూ' అనే ప్రాస నన్నుమరీ ఊపేసింది. ఇంకా ఆ కవిత్వంలో ఓ రకంగా పాలెంను వర్ణించాడనుకుంటాను. నాకప్పట్లో అనిపించిందేమి

టంటే హనుమంతరావు పెద్దయితే తప్పకుండా మంచికవో, రచయితో అయి తీరుతాడని.

ఓ రకంగా నేను పుస్తకాలు తిరిగేస్తుంటే నా పాత మిత్రులెవరైనా కనపడతారేమోనని కూడా చూస్తుంటాను. హనుమంతరావు కవితలుగానీ, కథలుగానీ ఆ తర్వాతికాలంలో నేనెప్పుడూ చదవలేదు. తను రాయడం మానుకొనయినా ఉండాలి. లేదా ఏదైనా కలంపేరుతో రాస్తుండాలి.

ఇప్పుడు తలుచుకుంటే ఆ రోజుల్లో నా దగ్గర పెద్ద విషయం లేకపోయినా కూడానేను మాట్లాడే తీరును గుర్తుచేసుకుంటే కొద్దిపాటి సిగ్గు కలుగుతుండేది. నాకంటే హనుమంతరావు మంచి భావాలు కలిగి ఉండేవాడు. ఎక్కువ విషయాలు కూడా తనకి తెలుసు. అయితే తను నలుగురి ముందుకువచ్చి మాట్లాడలేదు. అదతని లోపం. తను తర్వాతికాలంలో చదువుమానేశాడు. ఏం చేస్తున్నాడో కూడా తెలియదు. చాలాకాలం తర్వాత హనుమంతరావు నా ఆలోచనల్లో చోటు చేసుకున్నాడు.

"ఏమిట్రా ఆలోచిస్తున్నావు?" అంటూ వచ్చింది టీ కప్పుతో.

"నా మిత్రుడొకతను గుర్తొచ్చాడులే" అన్నాను.

"ఎవరతను?"

"హనుమంతరావనీ... మీ ఊరేలే"

"ఇప్పుడేం చేస్తున్నాడు?"

"ఏమో తెలియదు" అన్నాను.

అక్క కూడా అంతకుమించి మాట్లాడలేదు. బహుశా ఆవిడకు హనుమంతరావు గురించి తెలిసిఉండదు.

"పకోడీలు వెయ్యమంటావా" అంది అక్క

"పొద్దున్న తిన్నది అరగాలికదా" అన్నాను.

"ఏంటిరా మా మావగారు అన్నారని కాదుగానీ భోజనం దగ్గర కూడా రెండుముద్దలు తిన్నావు. ఇదేంతిండిరా... నువ్వుకూడా బాగా కాఫీ, టీలకు అలవాటు పడిపోయావా?" అంది.

"అదేం లేదుగానీ నువ్వు మాత్రమే ఈ ఊరి, ముఖ్యంగా మీ చుట్టాల తిండి చూశాకే ఆ సైజుకే అలవాటుపడినట్లున్నావ్" అన్నాను.

"అది సరేగానీ రేపొద్దున మా చిన్నమామయ్యగారితో కలసి ఓపెళ్ళికి హాజరవ్వాలి" అంది.

"నేనా... భలేదానివే. నేను హాజరుకావటం ఏమిటి?"

"అవున్రా బావ ఎటూలేరుగా... నువ్వు వెళ్ళిరా"

"అదేమిటే... వాళ్ళెవరూ నాకు తెలియదు కదా!" అన్నాను.

"నీకు తెలియదేమోగానే వాళ్ళకి అమ్మ తెలుసు. ఇప్పుడు నువ్వు వచ్చావని తెలిస్తే ఆ అత్తయ్య బాగా గొడవ చేస్తుంది. అయినా నాకు తెలియక అడుగుతాను. పెళ్ళికెళ్ళి భోంచేసి రావటానికేమిటి. చూడు. మా ఊర్లో పెళ్ళిళ్ళు ఎలా ఉంటాయో" అంది.

మరింక నేను చేయగలిగింది కూడా లేదు. ముందు నేను ఆ అత్తయ్యగారింటికి పెళ్ళికి వెళ్ళానంటే మా అమ్మ సంతోషిస్తుంది. కానీ చిన మావగారితో వెళ్ళాలంటేనే నాకు ఇబ్బందిగా ఉంది. ఆయనతో సమానంగా నాకు కూడా వడ్డించారంటే తంటావస్తుంది. నేను టీ తాగాక కొంచెంసేపు ఉండి మెల్లగా ఊరు చూడాలని బయలుదేరాను. ఈ ఊర్లో ఓ చిన్న పచార్ షాపు ఉందనుకుంటాను. నేను సిగరెట్లు తాగను. వక్కపొడి మాత్రం తింటాను. రాముణ్ని 'క్రేన్' వక్కపొడి తెమ్మని పంపించాను. అది మాత్రం దొరకలేదు. ఆ చుట్టుపక్కలంతా 'శ్రీ' వక్కపొడే దొరుకుతుందట. అవే రెండు ప్యాకెట్లు తెచ్చిపెట్టాడు. బహుశా ఆ కొట్లో కూతల కుటుంబాలవారే వస్తువులు కొనుక్కుంటుండవచ్చు. కృష్ణమూర్తి లాంటివారు మాత్రం ఛస్తే కొనరు.

నేను ఊరంతా తిరిగి అక్క దగ్గరికొచ్చాను. నేను గమనించిన అంశాలు చాలా ఉన్నాయి. నాలాంటి కుర్రాళ్ళు చాలామంది కనిపించారు. వారంతా లుంగీలు కట్టుకొని కబుర్లు చెప్పుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు.




ఆ కబుర్లన్నీ సినిమాల గురించే ఉన్నాయి. ఏ సినిమాకు ఎంత వసూలయింది... ఏది ఎన్ని కేంద్రాల్లో వందరోజులాడిందీ ఈ విషయాలు గోలగోలగా చెప్పుకుంటున్నారు. ఇంకా నేమో 'బానపొట్ట' 'బట్టతల' 'గూనోడు' 'గుడ్డోడు'లాంటి బిరుదుల్తో మన మహానటులమీద దుమ్మెత్తిపోస్తున్నారు. కొంతమంది మాత్రం ఇదంతా వినోదం చూస్తున్నారు. ఇంకా కొంత మందికి తమ ఊరవతల ఆగే బస్సుల గురించీ, రైళ్ళ గురించీ చర్చలు సాగుతున్నాయి.

ఓ రకంగా వారందరూ సమయాన్ని చంపేస్తున్నారు. నేను చూసిందంతా అక్కకు వివరించాను. "ఏమిటీ... అలా లుంగీలు కట్టుకొని ఆ కబుర్లేమిటి?" అన్నాను.

"మరింకేం చెయ్యమంటావ్ వాళ్ళని" అంది అక్క.

"ఏదో ఒకటి చేయాలి. అంతేగానీ ఆ పోసుకోలు కబుర్లెందుకు?" అన్నాను. నాకయితే అలా ఖాళీగా ఉండేవారందరినీ నిర్బంధంగా పిలుచుకుపోయి పనులు చేయిస్తే బాగుండును అనిపించింది.

"వాళ్ళందరికీ బాగా పొలాలున్నాయిరా. ఉద్యోగాలకోసం ప్రయత్నం చేస్తున్నారు. అవేమో రావటంలేదు. వారానికో, పదిహేను రోజులకో, అదిగో ఆ గుంటూరు రావటం నాలుగు సిన్మాలు చూట్టంతో కాలక్షేపం అయిపోతుంది. వాళ్ళందరూ ఓ తరహా జీవితానికి అలవాటు పడ్డారు. పొలం పనులు చెయ్యరు. వాటిని కౌలుకిస్తారు. ఎంతో కొంత ఆదాయం వస్తుంది. వాటితోనే తింటుంటారు. ఇక్కడా, అక్కడా కూర్చొని కబుర్లు... ఇంకా నువ్వు చూడలేదేమో ఇరవైనాలుగ్గంటలూ గీతాపారాయణమే. ఆ పేకలో ఏం ఆనందం ఉంటుందో... దాన్లో కూర్చుంటేచాలు ఇంక భోజనం, నిద్ర ఏమీ అవసరంలేదు"

"డబ్బులు పెట్టే ఆడుకుంటారా?"

"ఎందుకాడరు. అయితే డబ్బుల్లేవు... సరదాగా ఆడుకుంటుంటాం అంటారు. ఏమి సరదా. దరిద్రపు సరదా. అంతగా ఆడాలనుకుంటే చదరంగంలాంటివి ఉన్నాయికదా-అవి ఆడుకోవచ్చుగదా" అంది అక్క.

"మరి వీళ్ళంతా ఇలా అయిపోతున్నారుగదా. వాళ్ళ పెద్దవారికి ఏ బాధా ఉండదా?"

"వాళ్ళకెందుకురా బాధ... వాళ్ళబ్బాయి ఊరు విడిచి బయటకు వెళ్ళటంలా. ఏంచేసినా ఊరిలోనే చేస్తున్నారు. అంతకంటే వారికింకేం కావాలి" అంది.

"ఏంచేసినా అంటే" అన్నాను.

"పేకాటగానీ... తాగుడుగానీ" అంది.

"తాగుడా... ఇక్కడేం దొరుకుతుంది" అన్నాను.

"భలేవాడివిరా. ఏందొరకదంట. ఎన్ని తాటిచెట్లు లేవు. వెళ్ళి హాయిగా కల్లు తాగొస్తారు. లేదా చాటుగా వచ్చేటప్పుడు సీసాలు తెచ్చుకుంటారు. ఇంకా కొంతమందయితే గవర్నమెంటు సారాయి తెచ్చుకుంటారు"

"గవర్నమెంటు సారాయి ఇక్కడ దొరుకుతుందా?" అన్నాను.

"ఎందుకు దొరకదురా ఈ దేశంలో మంచినీళ్ళు దొరకవేమోగానీ ఎక్కడకు వెళ్ళినా సారాయి మాత్రం దొరుకుతుంది" అంది.

నాకు పాలెం యువకుల్ని తలుచుకుంటే చాలా బాధ కలిగింది. పాలెం ఓ మారుమూల ఉన్నా అది ఈ దేశంలో భాగం. అందులోని యువకులుగానీ యువతులుగానీ ఈ దేశ నిర్మాణంలో భాగం పంచుకోవాల్సిఉంటుంది. ఈ గ్రామ పెద్దలు ఎలా అయినా సంతోషపడవచ్చునేమోగానీ తమ సంతానాన్ని ఎందుకూ పనికిరాకుండా చేస్తున్నారు. అక్క చెప్పిన మరికొన్ని విషయాలు విన్నాక నాకు మరింత ఆశ్చర్యం కలిగింది.

ఇలాంటి విషయాలన్నీ ఈ గ్రామంలో జరుగుతుంటే ఆ గాంధేయవాది ఎందుకు చూస్తూ కూర్చున్నట్లు? ఆయనకేం బాధ కలగటంలేదా? ఆయన ఇందుకు వ్యతిరేకంగా ఏ కార్యక్రమమూ తీసుకోవటంలేదా?

ఓ రకంగా టీ.వీ.లు వచ్చాక ఈ నడుమ వివిధ ఆటల గురించి అందరికీ తెలుస్తున్నాయి. కొంతమంది పిల్లలకి ఆటలమీద ఆసక్తి కూడా పెరిగింది. అంతకుముందు కూడా నా చిన్నతనంలో కూడా చదువుకు ఎంత ప్రాముఖ్యం ఉండేదో ఆటలకూ అంతే ప్రాముఖ్యం ఉండేది. మేమయితే ఎప్పుడూ ఆడు

కుంటూనే ఉండేవాళ్ళం. మా క్లాసు మొత్తంమీద ఒకరిద్దరు మాత్రం ఎప్పుడూ చదువుకుంటుండేవారు. వాళ్ళని మాత్రం 'పుస్తకాల పురుగులు' అంటుండేవాళ్ళం. మా ఊర్లో తరచుగా కబాడీ పోటీలూ, వాలీబాల్, బాల్‌బాడ్మింటన్ పోటీలూ జరుగుతుండేవి. అందుకోసం ఒక్కోసారి మాకు శెలవు కూడా ఇస్తుండేవారు.

ఆ ఆటల్నీ ఆ ఆటగాళ్ళనీ చూస్తున్నకొద్దీ మాలో ఉత్సాహం వచ్చేది. మేం కూడా వాళ్ళని అనుకరిస్తూ ఆడుతుండేవాళ్ళం. అంతేకాదు గ్రామాల్లో కూడా యువకులు చెడుగుడులాంటి ఆటలు ఆడుతుండేవారు. ఎవరో రాక్షసుడు వచ్చి తన రాక్షస హస్తంతో అందమైన వాటన్నింటినీ చెల్లాచెదురు చేసినట్లుగా ఇవన్నీ మాయం అయిపోయాయి.

అందుకు కారణం ఏమిటి? సినిమా సంస్కృతిని వ్యాపింపచేయటమా? లేదా విద్యావిధానంలోకి కాన్వెంటులో ప్రవేశించటమా? రాజకీయాలు మరీ కలుషితం అయిపోవటమా? ఇంకా అనేక కారణాలా?

ఏమైనా కావచ్చు. ముఖ్యంగా విద్య ఎప్పుడయితే డబ్బులు సంపాదించడానికి ఓ మార్గం అయిందో అప్పుడే అది అన్ని విలువల్నీ ధ్వంసం చేసింది. మరీ ముఖ్యంగా తెలుగు భాషను దాదాపు రానున్నతరాలు తమ జీవన భాగంగా పరిగణించని పరిస్థితులకు బీజాలు పడ్డాయి.

నాకు ఒక్కోసారి చాలా ఆశ్చర్యం కలుగుతుంటుంది. ఈ దేశంలో విప్లవం రావాలని చాలామంది అంటుంటారు. అది వాస్తవమే. విప్లవం రావాలి. ఒకటి కాదు చాలా విప్లవాలు రావాలి. అందులోనూ జాతి జీవనంలోకి నిశ్శబ్దంగా చొచ్చుకుపోతూ మూల్గుతూ పీల్చేసే రకరకాల వ్యాధులమీద దాడి జరగాలి. చిత్రమైన అంశమేమిటంటే ఇలాంటి వ్యాధుల్ని మనం గుర్తించలేకపోతున్నాం. గుర్తించినా వాటిని ప్రమాదకరమైన వాటిగా లెక్కలోకి తీసుకోవటంలేదు. వాటికి వ్యతిరేకంగా చేయాల్సినంత పోరాటం చెయ్యటంలేదు. వాటిని వ్యంగ్యంగా మాట్లాడి తీసిపారవెయ్యటంతోనో, ఖండించటంతోనో ఆగిపోతున్నాం.

వాస్తవానికి మనం నిర్లక్ష్యంచేసే రుగ్మత ఏదైనా ముదిరి మనకు ప్రాణాంతకంగా ఎదుగుతుంది. అప్పుడు హడావుడి పడటంకాదు. దేనికి ఏమేరకు చికిత్స అవసరమో అది చేసుకుంటూపోవాలి.

మనదేశం ఆటల్లో వెనకపడిపోతుందని ఒలంపిక్స్ తర్వాత , ఆక్రోశించటమో లేదా పత్రికల్లో వ్యాసాలు రాయటమో, కార్టూన్లు గీయటమో కాదు. పాలెంలాంటి గ్రామాల్లోనూ, నగరాల్లోనూ కూడా యువతరం సిన్మాల వాతావరణంలోకి ఎందుకీడ్వబడుతుందో అర్థంచేసుకోవాలి.

ఈ దేశంలో ప్రజలందరూ తమ తమ పిల్లల్ని అర్జెంటుగా డాక్టర్లనో, ఇంజనీర్లనో చేసేద్దామనుకున్నా ఓవేళ అది జరిగిందనుకున్నా వాళ్ళే మనకు మిగులుతారు. ఇప్పటికే ఉద్యోగాలు రాని ఇంజనీర్లూ, డాక్టర్లూ చాలామంది ఉన్నారు. మరింక చదువు ఎందుకు? కట్నాల కోసమేనా? ఈ విషాన్ని పెద్దకులాలనుండి అన్ని కులాలదాకా సాకించటమేనా? ఏదోరకంగా పెళ్ళిళ్ళు చేస్తారు. ఆ తర్వాతేమిటి? తమ గ్రామాలనుండి పిల్లల్ని బయటకు పంపిస్తే... అక్కడి భావాల్ని తమతో వెంటబెట్టుకురారా? ఎంతకాలం మార్పుల్ని శాసించగలరు. ఆలోచించుకోవాలి. ప్రతిఒక్కరూ తమ జీవన పోరాటంలో ఓ క్షణం ఆగి తాము ఏ దిశకు పయనిస్తున్నామో ఆలోచించుకోవాలి. అలాంటి రోజొకటి వచ్చి తీరుతుంది.

చూస్తుండగానే చీకటిపడింది. చంద్రుడు ఆకాశంలోకి నిండుగా వచ్చాడు. ఎటుచూసినా వెన్నెల వెలుగులు. నేను బయట మంచం వేసుకున్నాను. అక్క కూడా పళ్ళాలు తీసుకొని అక్కడికే వచ్చింది. మేం కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేశాం. ఎంత చెప్పినా అక్క వినదు. ఈరోజు కోడిగుడ్ల కూర. నాటుగుడ్డు తిని చాలారోజులవుతుంది. అంతేకాదు ఇంతకుముందే చెప్పినట్లు ఆ పెరుగు వెన్నెలంత మాధుర్యంగా ఉంది. రాత్రికి వెన్నెల్లోనే పడుకుంటానని అక్కకు చెప్పాను.

"ఎందుకురా... మంచుపడుతోంది" అంది.

గది లోపల పడుకుంటే వెన్నెల ఉండదు.




మంచు కూడా ఉండదు. నాకెందుకో క్రిక్కిరిసిన డాబాలమీద వెన్నెల కురుస్తుంటే బాగుండదని అనను గానీ... ఇదిగో ఇలా పాలెంలాంటి గ్రామాల మీద, ఇక్కడ చెట్ల మీద... ఇక్కడ గేదెలమీద, పొలాలమీద, ఇళ్ళ మీద పడుతున్న వెన్నెల్నిచూస్తే ఆనందం కలుగుతుంది. ఆకాశాన్ని కూడా నేను నాకిష్టమైన రీతిలో చూడగలుగుతున్నాను. గుంటూరులాంటిచోట్ల రాత్రులంతా దీపాల వెలుతురు ఉంటుంది. ఆ వెలుతురు నుండి వెన్నెల్ని చూడటం ఓ అనుభవం అయితే... వెన్నెల వెలుగుల్ని మాత్రమే చూడగలగటం మరో అనుభూతి.

నేను గుంటూరు నుండి వచ్చేటప్పుడు పుస్తకాలు తెచ్చుకున్నానుగానీ ఇంతవరకూ వాటిని తీసిచూసే అవకాశం రాలేదు. అవకాశం రాలేదనేకంటే నేనే ఆ ప్రయత్నం చేయలేదు. నేనెక్కువగా ఆలోచనలోనే కాలం గడుపుతున్నాననుకుంటున్నాను. ఏదిఏమైనా ఇదంతా ఓ నోట్స్‌లా ఓ ప్రాసెస్‌లో రాసుకొని పెట్టుకుంటే ఉపయోగకరంగా ఉంటుందనుకుంటాను.

పాలెంలో రోడ్డు రాకపోవటానికి కారణం ఎవరు? షావుకారా? రోడ్డు రావటంవల్ల అయనకు కలిగే ఇబ్బంది ఏమిటి? ఈ రోడ్డును ఆపటంలో ఆయన పాత్ర ఎంత ఉంది? రోడ్డు విషయంలో తర్వాత ధనిక రైతులకు ఎలాంటి ఇబ్బంది ఉంది? అలాగే మధ్యతరగతి రైతులకు ఉన్న ఇబ్బంది ఏమిటి? ఆ తర్వాత వ్యవసాయ కూలీలకు ఉన్న ఇబ్బందులేమిటి? ఈ ఊర్లోని రాజకీయాలు ఎలా ఉంటాయి? కులాల ప్రాతిపదికనుంటాయా? పార్టీల ప్రాతిపదికనుంటాయా? ఈ గ్రామానికున్న ప్రత్యేక ఆచారాలేమిటి? రోడ్డు విషయంలో స్త్రీలు ఎలా ఆలోచిస్తున్నారు? వారికి కూడా రోడ్డు రావటం ఇబ్బందికరమైన విషయమేనా? వీరందరూ తమకు అవసరమైనమేరకు ఆధునిక మార్పులే అంగీకరిస్తున్నారా?

రోడ్డు రాకపోవటంవలన ఈ గ్రామానికీ, ఇందులోని వివిధ వర్గాలవారికీ జరుగుతున్న నష్టాలేమిటి? గతంలో రోడ్డుకోసం ఎవరైనా ప్రయత్నం చేశారా? ఈ గ్రామంలో జనాల నడుమ సంబంధం ఎలా ఉంటుంది?

ఇలా ఓ క్రమంలో కొన్ని ప్రశ్నలు రూపొందించుకొని వాటితో నేను ముందుకు వెళ్తే బాగుంటుందేమో. నా అనుమానాలు తీర్చుకునే క్రమంలో మరికొన్ని కొత్త ప్రశ్నలు రావచ్చు. వాటికి కూడా ఆ క్రమంలోనే జవాబులు దొరుకుతాయి. అలాకాకుండా ఏదో ఒక మూల నుండి బయలుదేరితే ఈ కార్యక్రమం ఎప్పటికీ ముందుకుపోదు. ఏవో కొన్ని కొన్ని విషయాలు తెలుస్తుంటాయి. తిరిగి మనం ఇంకో దారిగుండా ప్రయాణం ఆరంభించవచ్చు. అలా ఎటుపోతున్నామో తెలియని స్థితి ఏర్పడుతుంది. అందుకే ఉదయమే లేచాక నేను వివరంగా నోట్స్ రాసుకుంటాను. అక్క ఏదో చెబుతూనే ఉంది.

నాకెప్పుడు నిద్రపట్టిందో నాకే తెలియదు.



ఉదయం నేను లేచేటప్పటికే చినమావయ్యగారు వచ్చారు. చక్కగా స్నానంచేసి, ఇస్త్రీ బట్టలు వేసుకున్నారాయన.

"తొందరగా తయారవవయ్యాస్వామి" అన్నాడు చనువుగా.

"ఇప్పట్నుంచేమిటండీ" అన్నాను.

"భలేవాడివే... ముందు టిఫిన్ చెయ్యాలి కదా" అన్నాడు.

ఆ ఊరిలో ముందు అందరినీ టిఫిన్‌తో గౌరవించటం ప్రారంభిస్తారట. నేను ముఖం కడుక్కొని ఆయన్తో బయలుదేరాను. మొత్తంమీద ఒకటి రెండు షామియానాలు కనిపించాయి. ఆ ఇంటిముందు పెద్ద పందిరి

వేశారు. మేం వెళ్ళేటప్పటికి అద్దెకు తెచ్చిన కుర్చీల్లో కొంతమంది కూర్చుని ఉన్నారు. అందరూ పాలెం గ్రామానికి చెందినవారే అయి ఉంటారనిపించింది.

"ఎవరో ఈ అబ్బాయి" అంటూ ఒకరిద్దరు ముసలివారు అడిగారు.

"మా పెద్దాడి బామ్మర్దికాదూ" అన్నాడా యన.

తనకు పిల్లలున్నా వాళ్ళ కుటుంబానికి మా బావ పెద్దవాడు కావటంవల్ల ఆయన్నే పెద్దవాడుగా పిలుచుకుంటారు.

"అడెక్కడికెళ్ళాడు? కనిపించటంలేదే" అన్నాడాయన.

"ఏదో పనిమీద వెళ్ళాడు. రెండురోజుల యింది. అది సరే నీ ఆరోగ్యం ఎట్లా ఉంది?"

"ఏమి ఆరోగ్యమోలే- కళ్ళు సరిగ్గా కనపడ టంలా"

"డాక్టరుకు చూపించి జోడు వేయించుకోవ చ్చుగా" అంటున్నాడాయన.

నేను చుట్టూ చూశాను. పేపరేమైనా కని పిస్తుందేమోనని. కొంతమంది కుర్రాళ్ళు ఓ పేపర్ చూస్తున్నారుగానీ అది ఈ రోజుది కాదు. ఎక్కడికక్కడ గుంపులు గుంపులుగా చేరి కబు ర్లు చెప్పుకుంటున్నారు. చినమావయ్యలాంటి వారు కొంచెం తయారైవచ్చారుగానీ, మిగతా వారంతా ఆ టిఫిన్ పెడితే తిని పనులకు వెళ్ళిపోదాం అనుకుంటున్నవారిలా ఉన్నారు.

ఆ కార్యక్రమం మరో పదినిముషాలు గడిచా కగాని ఆరంభం కాలేదు. "లేవండీ" అంటూ అరిచారెవరో. ముందు వరసగా చాపలు పరిచా రు. అవికాక పట్టాలు కూడా పరిచారు. ఎందు కనో వీటికి మాత్రం డైనింగ్ టేబుల్స్ తేలేదు. అందరూ వచ్చి కూర్చున్నాక అరటి ఆకుల్ని పరిచారు. ఓ మనిషి నిమ్మకాయ బద్దలు పెట్టుకుంటూ వెళ్ళాడు. ఒకరిద్దరు అడిగి మరో రెండు పెట్టించుకున్నారు.

అక్కడినుండి ఆరంభమైంది ప్రహసనం...

ఉప్మా... అందులోనూ బొంబాయిరవ్వ ఉప్మాతో వచ్చారు. చిన్నగరిట చేతిలో ఉన్నాఅ ఒక్కో ఆకులో వేస్తుంటే కొండలా పడుతోంది. అంత ఉప్మా తింటే ఇంకా రాత్రిదాకా ఏమీ తిననవసరం లేదనిపించింది.

"ఒరేయ్... మా బావగార్కి అంత తక్కువ వడ్డిస్తున్నావేంటి... వెయ్ ఇంకొంచెం" అరిచా డొకాయన.

"తినండయ్యా... మళ్ళీ మా సామ్ము ఎప్పు డు తింటారో కానీండి" అని ఆ పక్కనాయన అన్నాడు. ఒక్కసారిగా అక్కడ నవ్వులు విరి సాయి. నా దగ్గరకివచ్చేటప్పటికి 'కొంచెం కొంచెం' అంటున్నా ఓ చిన్న కొండ పడనే పడింది. ఏం చేయాల్రా బాబూ అనుకుంటూ చూస్తున్నా.

అక్కడ కూర్చున్నవారంతా మహదా నందంగా భోంచేస్తున్నారు. వారి కళ్ళలో సంతో షమూ, తృప్తీ కనిపిస్తున్నాయి. వారు మెత్తటి ఆ ఉప్మాను ఉండలు ఉండలుగా చేసి గొంతు లోకి జారవిడుస్తున్నారు. అది మెత్తగా జారిపో తుందనుకుంటా. నాకు ఇష్టంలేని టిఫిన్లలో ఇది మొదటిది.

అందుకు చాలా కారణాలున్నాయి. నేను మా చుట్టాలింటికి వెళితే ఎవరైనా ఉప్మాతోనే ఆరంభిస్తారు. కానీ చాలామంది ఈ ఉప్మాను ఎంత దరిద్రంగా చేస్తారంటే నేను మా బంధు వులందరికీ చెబుతుంటాను.

"నేను మీ ఇంటికొచ్చి రోజులతరబడి ఉంటున్నాననుకోండి. మీకు ఇబ్బందికరంగా ఉండి, వెళ్ళమని చెప్పటానికి మొహమా టంగా ఉంటే మీరేం చేయొద్దు ఆ బొంబాయి రవ్వ ఉప్మా పెట్టేయండి. వెంటనే సూట్‌కేసు సర్దుకొని వెళ్ళిపోతాను" అని వాళ్ళంతా ఒకటే నవ్వు.

"నీరహస్యం చెప్పేశావురా" అంటూ పడిప డి నవ్వేవారు. ఓసారి ఓ అత్తయ్యగారింటికి వెళ్ళాను. ఆమె ఉప్మా ప్లేటు పెట్టి మంచినీళ్ళ కని లోపలకు వెళ్ళింది. ఆమె వచ్చేలోగా నేను లేచి నిలబడి సూట్‌కేసుతో తయారయ్యాను.

"అదేంట్రా" అందామె కంగారుగా.

"నేను రావటం నీకింత ఇబ్బంది కలిగి స్తుందని నేననుకోలేదు- నేను వెళ్ళొస్తాను" అన్నాను.

"అదేంట్రా అలా మాట్లాడతావ్" నేనేమ న్నాను అంది మరింతగా కంగారుపడిపోయి.





"మరి నీకు ఎంత బాధగా ఉండకపోతే రాగానే ఉప్మా చేసిపెడతావ్" అన్నాను.

అప్పటికిగాని ఆమెకు అర్థం కాలేదు. "అ దేంట్రా... నీకు ఏంకావాలో చెబితే అదే చేసిపె డతాను. భలేవాడివేరా- కంగారు పెట్టేశావు" అంది. ఆ విషయాన్ని ఆ తర్వాత మా చుట్టాలందరికీ పాకించేసింది. అందుకే మా జనాభా అంతా 'నువ్వు మా ఇంటికి రారా ఉప్మాచేసి పెడతాం' అంటుంటారు.

మామూలుగా వెనకటికాలంలో చద్దన్నం ఉంటే అది తినేసి వెళ్ళేవారంట. నా చిన్నత నంలో కూడా కాఫీ హొటళ్ళు ఇంతగా లేవు. అప్పట్లో ఎవరైన కాఫీ హొటల్లో తింటే విచి త్రంగా చూసేవాళ్ళు. తర్వాత మారుతున్నకా లంతోపాటు ఈరోజొచ్చిన మార్పు ఏమిటంటే... ఏదైనా మంచి సందర్భాల్ని హొటల్ భోజ నంతో పంచుకోవటం. హొటల్స్ వచ్చాక అప్ప టిదాకా అమలులో ఉన్న చద్దన్నానికి కాల దోషం పట్టింది. ఈరోజున దాని స్థానాన్ని టిఫిన్ ఆక్రమించింది. ఈ అల్పాహారంలో ప్రాధాన్యత కలది తిరిగి ఈ ఉప్మా... చాలాకాలం దీనిదే రాజ్యం... చకచకా తయారుచేయవచ్చు కాబ ట్టి. ఈ నడుమ ఉప్మాను అధిగమించిన ఆధు నిక టిఫిన్లు అనేకం వచ్చాయనుకోండి. ఈ ఉప్మా కూడా చద్దన్నం స్థానంలో గ్రామగ్రామాని కి పాకింది. ఓ సంప్రదాయంగా వచ్చినవారికి టిఫిన్ పెట్టేవారికి, అలాగే మంద ఎక్కువైన ప్పుడు ఈ ఉప్మా వారిని కష్టాలనుండి బయ టకు ఈడుస్తుంది.

ఈవిధంగా చుట్టాల బారినుండి కాపాడుకో వటానికి ఓ ఆయుధంగా మారిన ఉప్మాను సర్వరకాలుగా భ్రష్టు పట్టించేసి హడలెత్తిపో యేవిధంగా మార్చారు. ఇది నా అనుభవం.

నా అనుభవంతో కొంతమంది ఆధునిక మిత్రులు ఏకీభవించేవారు. చిత్రమైన విషయ మేమిటంటే ఒకప్పుడు నేనూ, నాతో ఏకీభ వించే మిత్రులూ కూడా ఈ ఉప్మాను ఆరా ధించిన రోజులున్నాయి. అందులో పంచదార నూ, చెట్నీనీ, కారంపొడిని మేళవించుకొని ఆరగిస్తున్నప్పుడు బహుపసందుగా ఉండేది. మరిప్పుడేమైంది దానికి? ఉప్మా చేస్తున్నకొద్దీ అనుభవం పెరిగి మరింత రుచి రావలసిన తరుణంలో ఈ దారుణం ఏమిటి? ఇందుకు నాకు కొంతమంది గౌరవనీయులైన మహిళ లు... ముఖ్యంగామాకు అమ్మలాంటివారు ఈ వివరణ ఇచ్చారు.

"నువ్వు చెప్పేదంతా నిజంకాదురా. ఉప్మా రుచిని అలా తీసెయ్యకు. కావలసింది ఓపిక. ఈకాలం ఆడపిల్లలకు ఏమాత్రం ఓపికలేదు. వాళ్ళకి క్షణాల్లో వంట అయిపోవాలి. పొయ్యి దగ్గర నిలబడి కూర ఉడికిందా లేదా అనేది చూడరు. మరి ఇంక రుచిగా ఉండాలంటే ఎలా ఉంటాయి? అందుకుకాదూ మీ మొగాళ్ళ ంతా ఆ హొటళ్ళమీద పడి తినటం. ఆ చేసుకునేదేదో శుభ్రంగా చేసుకుంటే అందరూ ఇంట్లోనే తినొచ్చు. ఖర్చులూ తగ్గుతాయి. అయినా ఈ విషంలో మంచి మొగాడెవడన్నా ఉంటే తను మాత్రం తిని రావటం కాకుండా ఇంట్లో దానికీ తెస్తాడు. సరిగ్గా వంట చెయ్య కుండా కడుపులు కాల్చుకునేది ఆడవాళ్ళే. సర్లే- కడుపులు కాల్చుకోవటం కూడా ఫ్యాషనై పోయిందికదా. మా కాలంలో అయితే ఇలాకా దు. ఇప్పటికీ నేను ఉప్మాచేసి పెడతాను. చూడు. రోజూ అదే కావాలంటావ్. నిలువుగా తరిగిన ఉల్లిపాయలు... కొద్దిగా జీడిపప్పు... ఎంత వెయ్యాలో అంతే నూనె... కరివేపాకు... ఉప్పూ, కారం సమంగా వేస్తే అదెంత రుచిగా ఉంటుంది. అయినా ఉల్లిపాయలు ఎక్కువేసి 'ఆనియన్ బాత్' అనీ, 'టమోటాలు వేసి 'టమోటా బాత్' అనీ పేరుపెట్టి నాలుగు రూపాయలు బిల్లువేస్తే మీకు రుచిగా ఉంటుంది.

ఎవరో ఉప్మా బాగా చేయలేదని ఉప్మాను తిట్టి, నేను తినను మొర్రో అంటే రేపు అన్న మూ బాగా వండకపోతే అప్పుడేం చేస్తార్రా. బాగుండని వాటిని చీదరించుకొని వదిలెయ్య టంకాదు. ఎలా బాగా చేయాలో నేర్చుకోవాలి. అసలు వెనకటికాలంలో రవ్వ ఇలా ఉండేదా... ఎంత బాగుండేది. ఇప్పుడేమో దాన్నిండా ఏదో ఒక పిండి కలుపుతుంటిరయ్యే... మరి రుచి కావాలంటే ఎలా వస్తుంది... నూనెలో కల్తీ... ఉప్పులో కూడా కల్తీ అయితే రుచెలా ఉంటుందిరా అబ్బాయి" అని.

నేనా మాటలు విని మొదటగా నిర్ఘాంతపో

యాను. ఈ ఉప్మామీద ఆవిడ చెప్పిన విషయాలు దానికేం వర్తించవు. అయినా కూడా ఆ తర్వాతికాలంలో కూడా నేను ఉప్మామీద నా అభిప్రాయాలు మార్చుకొనే అవకాశం రాలేదు. నాతోపాటు ఈ ఉప్మాను వ్యతిరేకించే జనం అంతకంతకూ పెరుగుతారని అనుకున్నాను. కానీ ఈ ఉప్మా తతంగం నా అంచనాను తప్పని నిరూపించింది.

మొదట ఓసారి ఉప్మా వడ్డించారు బానే ఉంది. అంతటితో ఏ కాఫీలాంటివో పంపగలరనుకున్నాను. అదేం లేదు. 'రెండోసారి తిరుగు' అని ఎవరో అరిచారు. అప్పుడు మొదలైంది మరో ప్రహసనం. తమతమ ఆకు దగ్గరకు మనిషి వచ్చినప్పుడు పక్కకు చూడటమో మంచినీళ్ళు తాగటమో చేస్తున్నారంతా. వడ్డించేవారు 'ఊ' అనే శబ్దం వచ్చేంతవరకూ ఉప్మాని తోడతానే ఉన్నాడు. అప్పుడే గమనించినట్లు కంగారుపడి 'ఏమిటింత వడ్డించావ్' అంటూ కోప్పడుతున్నారు.

"సర్లే కానీయ్... వేస్ట్ చెయ్యొద్దు" అని ఆంగ్లంలో అని ఓ బావగారు తన మావగారికీ, మావగారు తన అల్లుడుగారికీ... వారికి వీరు, వీరికి వారు ఉప్మా వడ్డింపచేసుకొని భోంచేస్తుంటే ఓమూలనుండి ఓ కుర్రాడన్నాడు-

"మామా... ఉప్మాతోనే ఈ పెళ్ళి అయిపోతుందనుకోకు... ఇంకా భోజనాలున్నాయి"

నాకయితే వీళ్ళకి ఈ ఉప్మా ఖర్చే ఎక్కువైపోతుందేమోననే భయం పట్టుకుంది. కొంతమంది లేచిపోతుంటే మరికొందరు వచ్చి కూర్చుంటున్నారు. 'ఎక్కువ వడ్డించావే అన్న వారు మరోసారి కూడా లాగించటం నేను గమనించాను. ఇందులో చాలామంది మోతుబరి రైతులున్నారు. మరీ ఇంత ఆబగా ఉప్మాని తింటున్నారేంటబ్బా అనే అనుమానం కూడా వచ్చింది. నేను మెల్లగా కాఫీ గ్లాసు అందుకొని ఓ మూలగా నిలుచున్నా. బహుశా కాఫీ కూడా నాలుగయిదుసార్లు తిరిగి పోస్తారేమో!

ఓమూల ఓ ముసలాయన నిలబడి ఏదో గొణుగుతున్నాడు... మెల్లగా అది నేనూ విన్నాను. నాకర్థమైందేమిటంటే ఆయనది 'పాలెం' కాదు. ఆ పెళ్ళివారికి బంధువు అనుకుంటాను. ఆయన వడ్డించేవారిని పక్కకు పిలిచి చివాట్లు పెడుతున్నాడు.

"ఏమిటయ్యా ఆ వడ్డన. ఇంకా ఎవరికీ టిఫిన్ అవసరంలేదా... సొంతం ఓ బంతయినా కాలేదు. ఆరుబొచ్చెల ఉప్మా తిన్నారు. అయినా అదేం తిండయ్యా బాబూ... ఉండలు ఉండలు చేసి గొంతుల్లోకి విసురుతున్నారు.

అరిగి చావద్దూ. అందులోనూ బొంబాయిరవ్వ. కడుపులో ఉండలుఉండలుగా చుట్టుకోదూ ... ఇలా అయితే నాలుగయిదు బస్తాలయినా చాలదు. అసలు నేను ఈ టిఫిన్ కార్యక్రమం పెట్టుకోవద్దూ అన్నా. వింటేనా అదేమంటే ఈ ఊరి పద్ధతీ అంటూ గొడవ. ఈ టిఫినే ఇలా తింటే ఇంకా భోజనాలు ఎలా చేస్తారో నాయనో" అంటూ గుండెలమీద చేతులు వేసుకున్నాడు. నాకిదంతా చూస్తుంటే నవ్వొస్తోంది. దాంతోపాటు వారి తిండిపుష్టికి అభినందించాలని కూడా అనిపిస్తోంది. నేను ఓ మూలగా కూర్చుంటే అక్కడ కొంతమంది కుర్రాళ్ల మాటలువినే భాగ్యం నాకు లభించింది. అప్పుడు నేను 'పాలెం' ఖచ్చితంగా ఓ ప్రత్యేకమైన ఊరే అనుకున్నాను.

ఇలాగే ఏదో పెళ్లిజరుగుతుందంట. మామూలుగానే 'ఉప్మాహారం' కార్యక్రమం జోరుగానే జరిగిపోతుందంట. రెండుమూడు బంతులు పూర్తయ్యాక వడ్డనని పర్యవేక్షిస్తున్న దగ్గరికి ఒకాయన పరిగెత్తుకొచ్చి చెవిలో ఏదో గొణిగాడంట. ఆయనేం కంగారుపడకుండా ఇంకా నాలుగు నిమ్మకాయలు అందులో పిండించాడంట. ఇంతకూ విషయం ఏమిటంటే గోధుమరవ్వ బదులు అందులో ఉప్పుడు రవ్వ పోశారంట.

మనం అనుకుంటుంటాంగానీ, మనకు నచ్చని విషయాలు అనేకమందికి వెర్రిగా నచ్చుతాయి. అందుకు కారణాలు ఒక్కోసారి అంతుపట్టనివిధంగా ఉంటాయి. 'పాలెం' ప్రజానీకానికి కొన్ని పట్టుదలలు కూడా ఉన్నాయి. ఇలానే ఓసారి ఓ ఏభైమంది మాత్రమే ఓ పెళ్లికి హాజరయ్యారంట. ఆ ఇంటాయన ఆఁ వీళ్లెంతమందున్నారులే అని నోరు జారి ఉప్మా తయారుచేసి వడ్డించటం ఆరంభించా




డట. బొచ్చెల్లో ఉప్మాలు వస్తున్నాయి. పాలెం జనాన్నిదాటి అవతలకు వెళ్లటంలేదంట. ఆ దెబ్బతో ఆయనకు పిచ్చెత్తి ఈ జన్మలో ఇంకెప్పుడూ ఉప్మా చేయించను ... చేయించినా పాలెం వాళ్లను మాత్రం పిలవనూ అంటూ ప్రతిజ్ఞ చేశాడట.

ఇలాంటి విషయాలు చాలా చెప్పుకొని అక్కడివారంతా నవ్వుకుంటున్నారు. నాకు బాగానే కాలక్షేపం అయింది. చినమావయ్యగారితో కలిసి నేను అక్కగారింటికొచ్చాను.

"ఎలా ఉందిరా?" అంది అక్క.

"నేను నాఫ్రెండ్‌కి ఈ విషయం అంతా చెబితే 'పాలెం పెళ్లి' అనో. 'ఉప్మా విత్ లవ్' అనే కథో రాస్తాడు. అంత గొప్పగా ఉంది" అన్నాను.

"మరి భోజనాలు కూడా చూడు" అంది.

"ఇంకానా ... బాబోయ్- నావల్లకాదు" అన్నాను

"అదేం కుదరదు" అంది...

నేను 'పాలెం' వచ్చింది వీటికోసమా? ఇక్కడి భోజనాలూ, టిఫిన్ల మీద పరిశోధన చెయ్యటానికా? అనిపించింది. ఏంచేస్తాం. తప్పదు ఇవన్నీ వారి జీవితంలోనూ, ఎవరి జీవితంలోనైనా భాగాలే కాబట్టి. నాటి గురించి కూడా ఆలోచించాలి.

"అక్కా అంతంత తిన్నారు గదా ... ఇప్పుడు వారికి అరక్కపోతే ఏంచేస్తారు? ఇక్కడెవరైనా డాక్టరున్నాడా? కనీసం మందులషాపుందా?" అన్నాను.

"మందులషాపులంటూ ఏమీ లేవు. అయితే ఇక్కడున్న కొట్టులోనే సారిడాన్, నవాల్జిన్‌లాంటి మందులు తెచ్చి అమ్ముతారు. ఇంకా అమృతాంజనంలాంటివి దొరుకుతాయి.

ఈ ఊరికి డాక్టరు ఆచారిగారొక్కరే అంది.

"ఆయన ఏవైద్యం చేస్తారు?"

"ఆయుర్వేదం అనుకుంటా. హోమియో వైద్యం కూడా ఆయనకు తెలుసు. తలనొప్పి, జ్వరంలాంటివాటికి ఆయన మందులిస్తారు. ఇంకా దీర్ఘరోగాలున్నవారు కూడా ఆయన దగ్గరే వైద్యం చేయించుకుంటారు. ఆయనవల్ల కాదనుకుంటే మాత్రం వేరే డాక్టర్‌కి చూపిస్తారు"

"ఏ అర్ధరాత్రో ఏ అవసరమొవస్తే ఏంచేస్తారు?"

"అప్పటికప్పుడు బండికట్టుకొని వెళ్తారు" అంది.

ఇక్కడ ఇంకా మంగలివారికీ, చాకలివారికీ కూడా సంవత్సరానికోసారి ఇంతని వడ్లు కొలిచి ఇచ్చే పద్ధతే కొనసాగుతోంది.

"అయినా ఇంత మూర్ఖంగా ఉంటారేమిటి? కనీసం తమ ఆరోగ్యం విషయంలో కూడా ఇంత నిర్లక్ష్యమా?" అన్నాను.

"ఆచార్యులుగారిని అంత తక్కువగా తీసివెయ్యకు ..! ఇన్ని సంవత్సరాలూ ఇక్కడివారంతా ఆయన వైద్యం చేయించుకుంటున్నారు" అంది అక్క.

నేను మరేం మాట్లాడకుండా నా గదిలోనికి నడిచాను. ఏదో పుస్తకం అందుకొని చదవటం ఆరంభించాను. తిరిగి అక్క 'భోజనానికి వెళ్లిరా' అని పిలిచేంతవరకూ నేను చదువుకుంటూనే ఉండిపోయాను.

ఈసారి కూడా అలాంటి తంతే ... అంతకు ముందు టిఫిన్‌దగ్గర గొణిగిన ముసలాయన కళ్లన్నీ నేతి చెంబుమీదున్నాయి. 'చూసి వడ్డించండి' అంటూ హెచ్చరిస్తూనే ఉన్నాడు. కానీ మావయ్యలూ, బావయ్యలూ ఊరుకుంటారా ... అరచేతినిండా నెయ్యి పోయించుకొని అన్నమంతా కలుపుతున్నారు.

"అసలు భోజనాల్లో ఈ నేతిని ఎత్తేస్తే బాగుంటుంది. పాడునెయ్యి. అంతంత తాగితే గుండెలాగి ఛస్తారు. గొండెపోట్లు వచ్చి ఎక్కడ జనం టపటపారాలిపోతున్నారు" అంటున్నాడు.

ఆయన మాటల్ని ఎవరూ నమ్ముతున్నట్లు కనిపించలేదు. ఇదంతా చూస్తుంటే ఆయనకే గుండెపోటు వచ్చేటట్లుంది. నేను చేతులు కడుక్కుంటున్నప్పుడు ఒకతనువచ్చి ... 'మీరు సుధీర్ కదూ' అన్నాడు.

అతను హనుమంతరావు!

"ఓ! నువ్వా ... వచ్చిన దగ్గర్నుండి నీగురించే అనుకుంటున్నాను ... నువ్వు కనిపిస్తే



బాగుంటుందనుకున్నాను. అసలు కనిపించ వేమో అనిపించింది'' అంటూ పక్కకు వచ్చి నిలబడ్డాం.

''ఏం చేస్తున్నారు?'' అన్నాడు హనుమంత రావు.

''ఏమిటే మీరూ అని పిలుస్తున్నావు. నిన్ను కూడా మీరూ అనిపిలవాలా?'' అన్నాను.

''అలా అని కాదు'' అంటూ ఇబ్బందిగా నవ్వాడు.

''సరే... మనం ఎక్కడైనా కూర్చుని మాట్లా డుకుందాం. నువ్వు భోంచేశావా?'' అన్నాను.

''ఇంకా లేదు'' అన్నాడు.

''అయితే నేను కూర్చుంటాను. ముందు భోజనం చేసిరా'' అన్నాను.

హనుమంతరావు భోజనానికి వెళ్లాడు. తనలో పెద్ద మార్పేం కనిపించటంలేదు. అప్ప



టికీ, ఇప్పటికీ అలానే ఉన్నాడు.

భోంచేసి వచ్చాక మేం సరాసరి అక్క వాళ్ళింటికి వచ్చాం ... నా గదిలో కూర్చున్నాక అడిగాను- "ఇప్పుడుచెప్పు హనుమంతరావు ... ఏం చేస్తున్నావు?" అన్నాను.

"ఏముంది వ్యవసాయమే" అన్నాడు.

"ఉద్యోగం ఏమీ దొరకలేదా?" అన్నాను.

"లేదు... మాకో అరెకరం ఉంది. రెండెకరాలు కౌలు తీసుకొని చేస్తన్నా"

"పెళ్లయిందా?"

"అయింది- మా అక్కయ్యగారమ్మాయే" అన్నాడు.

"నాకింకా పెళ్లికాలేదు. ఉద్యోగం కూడా రాలేదు. ఆమాటకొస్తే ఉద్యోగం కోసం సీరియస్‌గా ప్రయత్నం చేయటంలేదు. ఇంట్లోవారందరూనేమో త్వరగా ఏదైనా ఉద్యోగం చూసుకొని పెళ్ళిచేసుకోమంటూ గొడవపెడుతు



న్నారు'' అన్నాను.

''మరేం చెయ్యాలని నీఉద్దేశం'' అన్నాడు.

''అదే ఇంకా నిర్ణయించుకోలేకపోతున్నాను. ఏదో ఒకటి చేయాలి. సరే... నువ్వు ఎక్కడ ఉంటున్నావ్?'' అన్నాను.

''వెళ్దాంలే ... మా ఇంటికి'' అన్నాడు.

అసలు నేను పొరపాటు చేశాను. హనుమంతరావు గురించి ఎవరినైనా అడిగి ఉండాల్సింది. అక్క ఈ నడుమ వచ్చింది కాబట్టి ఆమెకు తెలియకుండా ఉండొచ్చు. ఏదిఏమైనా తను దొరికాడు. నాకు చాలా సంతోషంగా ఉంది. నేనిప్పుడు ఈ ఊరికి చెందిన విషయాలన్నింటినీ ఓ క్రమంలో పెట్టుకోవచ్చు. హనుమంతరావుతో మాట్లాడబోయే ముందు నేను అతనికో విషయం స్పష్టంగా చెప్పాను.

''చూడు హనుమంతరావు ... ఆ నడుమ నాకో వ్యక్తితో సరిచయం అయింది.

ఆయన ఓ స్వచ్ఛంద సంస్థకు డైరెక్టర్. నన్ను తన ఆర్గనైజేషన్‌లోకి రమ్మని ఆహ్వానించాడు. అక్కడ మేం చేసే కార్యక్రమం ఏమిటంటే దేశంలో ఫ్యూడలిజం ఎలా అములులో ఉందో పరిశీలించడం. ఆ సంస్థకు విదేశాలనుండి నిధులు అందుతున్నాయి. ఓ రకంగా నన్ను ఆ సంస్థలో అతను ఎంప్లాయ్‌మెంటుకోసం పిలిచాడు. వాళ్ళ కార్యక్రమాల గురించి కూడా కొంతవరకు వివరించాడు. వాళ్ళు రైతు కూలీల తరపున పనిచేస్తారు. వారికి కొంత సహాయం అందజేస్తారు. అలానే భూస్వాములకి వ్యతిరేకంగా అవసరమైతే కోర్టుల ద్వారాకూడా ముందు కెళ్తారు. ఇలాంటివే మొత్తంమీద కొన్ని కార్యక్రమాలు అమలు చేస్తున్నారు. వాళ్ళకి మంచి డైనమిక్‌గా ఉండే యువకులు కావాలి. నేను వెంటనే ఏ విషయమూ చెప్పలేదు. అసలు నాకా సంస్థల మీదే కొన్ని అనుమానాలున్నాయి. అదట్లా ఉంచుదాం. ఓ విషయాన్ని విశ్లేషించడానికి వారి దగ్గరకే పోనవసరంలేదు. మనం పరిశోధించాల్సిన అంశాలు మన పక్కనే ఉంటాయి.

నాకు పాలెంరోడ్డు గురించి తెలిసిన క్షణం అదే అనిపించింది. ఈ గ్రామం చుట్టూ చాలా చాలా సమస్యలు ముడిపడి ఉన్నట్లుగా నాకనిపించింది. అందుకే ముందు ఈ విషయం గురించి శోధించాలన్న జిజ్ఞాస కలిగింది. వెంటనే బయలుదేరి వచ్చాను. ఇంతవరకూ నేను చేసిన కార్యక్రమం అంటూలేదు. ఇక్కడి జనాల్ని వారి మనస్తత్వాల్ని అర్థంచేసుకోవటానికి నేను ప్రయత్నం చేస్తున్నాను. నువ్వుకూడా ఉంటే బాగుంటుందనిపించింది. మొత్తంమీద నువ్వుకూడా దొరికావు. నేను కొన్ని ప్రశ్నలడుగుతాను. అవినాకు చెబుతుండు. దాన్నిబట్టి ఓ అంచనాకు రాగలమనుకొంటాను'' అన్నాను. హనుమంతరావు అంగీకరించాడు.

రెండు రోజులు వరుసగా నేనూ, హనుమంతరావు చాలా విషయాల గురించి విపులంగా చర్చలు జరిపాం. తను విన్న తనకు తెలిసిన కథలు చెప్పాడు. ఆ గ్రామంలో ప్రముఖుల్లుగా ఉన్నవారినుండి సామాన్యుల వరకూ మేం పరిశీలించాం. అందులో కొంత మందితో మేం మాట్లాడాం కూడా.

నాకు అర్థమైన విషయం ఏమిటంటే అందరూ రోడ్డు విషయంలో భయపడుతున్నారు. ఎవరెవరి భయాలేమిటో నేను వరసగా నోట్స్ రాసుకున్నాను. ఇదంతా నా పరిశీలన. నా భావాలు సరైనవి అని నేను అనుకోవటం సహజమేకదా. మరి అవి సరైనవే అని మిగతా వారు కూడా అనుకుంటే ఫర్వాలేదు. ముఖ్యంగా 'పాలెం' ప్రజలు అనుకోవాలి. నా ఈ పరిశోధన లేక ఆరాటానికి కారణం ఒకటే. 'పాలెం' కూడా తనకంటూ ఓ రోడ్డు నిర్మించుకోవాలి.

మొదట షావుకారు నుండి ఆరంభించాను.

ఇంతకుముందు చెప్పినట్లుగానే షావుకారు పేరగానీ, ఆయన పిల్లల పేరగానీ,బంధువుల పేరగానీ వందలాది ఎకరాల భూమి ఉంది. ఈ ఊరిమీద ఆయనపట్టు బాగా ఉంది. అయితే ఈయన సినిమాల్లో చూపించేటంత క్రూరంగా కనిపించడు. ఆయనకు తన ఆస్తుల విషయంకంటే ఇతర విషయాల మీద దృష్టి ఎక్కువగా ఉన్నట్లు కనిపిస్తాడు. షావుకారు తాతలు మాత్రం చాలా క్రూరులుగా ఉన్నారు. వారు భూముల్ని సంపాదించిన తీరుగానీ.





వారు డబ్బు సంపాదించిన తీరుగాని ఏమాత్రం గౌరవ ప్రదంగా లేవు. వాటి గురించి రకరకాల కథలు ప్రచారంలో ఉన్నాయి.

షావుకారు తండ్రికాలం నుండే 'పాలెం' కు రోడ్డు కావాలనే ఓ కోర్కె ఉంది. అయితే అది పెద్దగా సమస్యలా ఎప్పుడూ వ్యక్తం కాలేదు. అందరి మనస్సుల్లోనూ ఆ కోరిక ఉంటూ వచ్చింది. కానీ పెద్దలు మాత్రం అలాంటి కోర్కెను ఏమాత్రం ఆమోదించేవారు కాదు.

షావుకారు కాలంనాటికే చాలా మార్పులు వచ్చాయి. ఆయన తన దగ్గరున్న డబ్బును పట్టణానికి తరలించడం మొదలుపెట్టాడు. ఆయన వ్యాపారాల్లోనూ, రైసుమిల్లులలోనూ, సినిమాహాళ్ళ నిర్మాణంలోనూ పెట్టుబడులు పెట్టాడు. అలాగే వడ్డీ వ్యాపారం తన ఊరిలో ఉండే కంటే పట్టణంలోనే ఉండటంవల్ల ఎక్కువలాభం ఉందని గ్రహించాడు. అందుకే తన డబ్బును ఏ రకంగా పదింతలు చేయటానికి అవకాశం ఉంటుందో ఆ పనులన్నీ చేశాడు.

ఆ రకంగా ఇటు పాలెంలోనూ అటు వివిధ పట్టణాలలోనూ కూడా ఆయన ఆస్తులు పెరుగుతున్నాయి. షావుకారు తప్పించి చాలా కొద్ది కుటుంబాలు మాత్రమే వ్యాపారంలోకి ప్రవేశించాయి. రోడ్డంటూ వస్తే ముందు అందుకు మూల్యం చెల్లించాల్సింది తనేమో అని ఆయన భయం కావచ్చు. గ్రామాల్లోనూ, పట్టణాలలోనూ ఓ పెద్ద తేడా ఏమిటంటే, గ్రామాల్లో తమ అధికారం చూపించుకోవచ్చు. మరి అక్కడ అలా చెల్లదు. కులాలూ, మతాలంటూ కూర్చుంటానికి లేదు. అనివార్యంగా అందరూ సహజీవనం చేయాల్సిందే. నగరాల్లో సైతం కులాన్ని రెచ్చగొట్టడం వేరే విషయం.

కులాలకు చెంది గ్రామసీమల్లో ఉన్నపట్టు పట్టణాల్లో ఉండదు. గ్రామాల్లో కొన్ని కులాల్ని వెలివేయటం అందరూ చూస్తుందే. పట్టణాల్లో అది కుదరదు. అయినా కూడా కొన్ని కులాల వారికే ఇల్లు ఇస్తామనే వారు అక్కడా ఉన్నారు. ఒకప్పుడు మనుమల ముఖాల్ని చూసి, అలవాట్లనుబట్టి కులాలను నిర్ణయించగలరేమోగాని ఈనాడు అది అసాధ్యం. అందుకే కాబోలు చాలామంది కులాల పట్టింపును మాత్రం వదిలేసి మాంసాహారులా, శాఖాహారులా అనే దాన్నిబట్టి నిర్ణయాలు తీసుకుంటున్నారు.

'పాలెం'కు రోడ్డంటూవస్తే దాంతోపాటు అనేక అలవాట్లు వస్తాయి. ఇప్పుడు వారు సంతృప్తిపడుతున్నట్లుగా రోడ్డు లేకపోవటంవలన 'పాలెం' మరీ వెనకబడేంలేదు. ఏదో ఒక పరిణామంలో ఆధునికత అక్కడ చొచ్చుకువచ్చింది. ఎక్కువగా వికృతమైన ఆధునికతకు గురయింది షావుకారు కుటుంబమే.

అలాంటి విశృంఖలత్వాన్ని తన కుటుంబం వరకూ ఆయన ఆమోదించగలడు. కానీ మొత్తంగా ఊరంతా అలాంటి మార్పును ఆయన ఇష్టపడడు. అందుకు కారణం ఒకటే. పట్టణాలలో ఆధునికతతోపాటు అసంతృప్తి ఉంది. అక్కడ ఓ మనిషికి డబ్బుంటే వచ్చే గౌరవానికీ, గ్రామంలో పరిస్థితికి తేడా ఉంది. 'పాలెం'లో షావుకారు మాత్రమే 'రాజు'.

పట్టణాల్లో చాలామంది ఉంటారు. ధనవంతులుగా రూపుదిద్దుకోవాలంటే కావల్సింది వినయమూ, కులమతాతీతంగా తమ తమ వ్యాపారాలకేసి అందర్నీ ఆకర్షించగల నైపుణ్యం. తరతరాలుగా తోటి మానవుల్ని హీనంగా చూస్తూ, బలవంతంగా తాము కావాలన్న పనులు చేయించుకోవటానికి అలవాటుపడిన దొరలకు ప్రజాస్వామ్య పద్ధతులు చాలా ఇబ్బందిగా ఉంటాయి. అందుకే ఆయన ఏ రోజూ రోడ్డు గురించి ఆలోచించడు.

మధ్య తరగతి రైతుకు రోడ్డు సౌకర్యం లేనప్పుడు తను పండించిన వాటికి సరైన ధరను పొందటం కష్టం. ముఖ్యంగా అతని జీవితం అంతా దళారుల మీద ఆధారపడి ఉండటంతోనే సరిపోతుంది. బాగా ధర వస్తుందని తెలిసినా తను పండించిన వాటిని మార్కెట్ దగ్గరికి చేర్చేలోపు విచిత్రమైన మార్పులు జరిగే అవకాశం ఉంది.

షావుకారుకలాంటి ఇబ్బందిలేదు. ఆయనకు రైసు మిల్లులున్నాయి. ఇంకా పాలెంలోనూ ఇతర చోట్లా పెద్దపెద్ద గొడౌన్లున్నాయి. అక్కడ నిల్వ చేసుకుంటాడు. రోడ్డు లేకపోవటంవలన ఇతర వర్గాలకు కలిగే ఇబ్బందులు



షావుకార్ని పీడించవు. కానీ...

ఆరోజు దాదాపు అర్ధరాత్రి సమయం.. ఆకాశం మేఘావృతమై ఉంది. జోరుగా వానా, గాలీ విరుచుకుపడుతున్నాయ్... ఆ వాన ఊహించనిది... అప్పుడు జరిగిందంట ఈ సంఘటన.

షావుకారుగారి భార్య ఆ చీకట్లో లేచింది. అప్పుడు కరెంట్ కూడా లేదు. ఆమెకు బాత్ రూంకు వెళ్ళాల్సిన అవసరం కలిగింది... ఎందుకో బయటకు వచ్చి చూడాలనుకుందామె... చేతిలో టార్చిలైటుతో వచ్చింది... మెరుపులూ... కొద్దిగా ఉరుములు కూడా... ఆమె కెవ్వున అరిచింది...

అందరూ పరిగెత్తుకుంటూ వచ్చారు. ఏం జరిగిందో ఎవరికీ అర్థంకావటంలేదు.

ఆమె మాత్రం 'పాము పాము' అంది. ఎవరో పరిగెత్తుకు వెళ్లి కర్రలు తెచ్చారు. ఏంపామో చూశావా అనడుగుతున్నారు. అసలు పాము కరిచిందా, చూసి కంగారు పడిందా అనే అనుమానం. ఆమె మాత్రం భయంతో వణికిపోతూంది. శరీరంనిండా చెమటలు... ఏదో చెప్పాలనుకుంటుందిగానీ చెప్పలేకపోతుంది. కొంతమంది ఆ ప్రాంతమంతా వెతుకుతున్నారు. షావుకారు మాత్రం ఏంచేయాలో తెలియక నిలబడ్డాడు. ముందుగా ఎవరో తేరుకొని అరిచారు.

"కిష్టయ్యగారిని పిలుచుకురండి మంత్రం వేస్తారు" అని అంతలోనే...

"ఆ బండి కట్టండిరా" అంటూ...

చీకటి... వాన... భయం... భయం... ఏం జరగబోతుందో తెలియటంలేదు. ఎలా పాకిందో ఊరంతా వార్త పాకింది. సంచలనం... ఎటూ చూసినా సంచలనం... రకరకాల సంభాషణలు.

"ఈ ఊరికి పట్టిన దౌర్భాగ్యం అది. ఈ వానలో ఎప్పటికి డాక్టరు దగ్గరికి వెళ్లేను... అయినా రోడ్డు విషయం ఒక్కరంటే ఒక్కరికి పడుతుందా... నేను పాతిక సంవత్సరాలుగా ఈ ఊరిని చూస్తున్నా. నా జీవితం ఈ ఊరి ఉత్తరాన కడతేరిపోవాల్సిందే. ఓ సరదా లేదు. ఓ ముచ్చటా లేదు. బతుకంతా ఈ గడ్డమీద గడిచిపోవలసిందే. అయినా ఇదేం చోద్యం... దేశమంతా ఓ దారైతే ఈ ఊరు ఓదారి. అందరూ రోడ్లు కావాలంటారు. మనకంటే వెనకాల లైబ్రరీలు పెట్టుకున్నారు. ఇంకానేమో హాస్పిటల్లు కూడా పెట్టించుకొంటున్నారు. బొత్తిగా ఈ ఊర్లో అందరికీ పోసుకోలు కబుర్లు చెప్పుకోవటం, పిచ్చితిండీ ఇవి సరిపోతున్నాయి. అయినా అల్లకేం బాధ... పదిరోజులకో సారైనా పట్నాలెల్తారు. సిన్మాలు చూస్తారు. ఎన్నెషాలైనా వేస్తారు. ఆడాళ్లు కూడా మనుమలే అని చస్తే ఒప్పుకోరు. నాయనో ఇంత ఘోరం పగాడికి కూడా వద్దు. ఏ ఊరికి ఇంత దరిద్రం వద్దు" ఇది ఆడవారిది సంభాషణ. ఎవరో ఒకావిడ "అది కాదు వొదినా" అంటూ ఏదో చెప్పబోతే అందరూ మీదపడి కరిచేసినంత పనిచేశారు.

ఆరాత్రి మంత్రాల్తో పనికాదని తెలుసు. కిష్టయ్యగారు మంత్రం వేశారు గానీ ఆమె అపస్మారకంగా పడుంది. ఆచార్యులుగారు కూడా పరిగెత్తుకుంటూ వచ్చారు వానలో తడుస్తూ. పాపం ఆయన మాత్రం ఏంచెయ్యగలుగుతారు. అందరూ నిస్సహాయంగా నిలబడిన వేళ... ఆ వానలో 'భగవంతుడి'మీద భారంవేసి ఆవిణ్ని బండిలో వేసుకెళ్లారు. దారి పొడుగునా ఆ ఎడ్లు పెట్టిన ఇబ్బందిగానీ, అప్పటికే రోడ్డుమీద కొచ్చిన నీళ్లుగానీ ఆ బాధలు వర్ణనాతీతం. ఎలా అయితే డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్లారు. నాలుగు రోజులదాకా ఏ విషయం ఎవరికీ తెలియదు. తడవకో వార్త వస్తుంటే అక్కడివాళ్లు అల్లాడిపోయారు.

అందరిలోనూ ఈ సంఘటన తీవ్రమైన సంచలనం కలిగించింది. ఎవరికివారు రోడ్డు వేయించాలంటూ కూర్చున్నారు. "ఏమిట్రా ఆ తొందర. ఇప్పుడు కావాలనుకుంటే రావటానికి అది రోడ్డా, తినే వస్తువా. అయినా రోడ్డు కావాలంటే మాత్రం కుదురుతుందా. ఇప్పటికిప్పుడు వస్తుందా. ఆగండి. ఆ షావుకార్ని రానీండి. ఆయన్తో మాట్లాడాక ఏదోఒకటి చేద్దాం"

అంతటితో మిగతావారంతా ఆగిపోయారు. అప్పటివరకూ నోరువిప్పని అనేకమంది ఈ




అవకాశం చూసుకొని గొంతువిప్పి తమ అభిప్రాయాలు చెప్పారు.

"ఇక్కడ చాలామందికి ఛాదస్తం వుంది. ఇంకా తమతమ పెద్దరికాలు నిలుపుకోవాలనుకుంటున్నారు. ఇలాంటి పనుల్తో పెద్దరికాలు నిలవ్వు. మైళ్లకొద్దీ నడిచి చదువుకోవాలంటే ఎంత ఇబ్బందో మాకు తెలుసు. అంతంత బరువులేసుకొని రెండుపూట్లా నడిచివచ్చి ఇంకేం చదువుతాం. అయినా మా అందర్నీ చూసి నవ్వుతున్నారు" అంటూ కొంతమంది పిల్లలు.

"నిజమేనయ్యా... మీరందరూ రోడ్డు లేకపోయినా బతికారు. కార్లూ, కరెంటూ లేకపోయినా బతికారు. మేం కూడా అలా బతకాలంటే కుదర్దు" అని కొంతమంది యువకులు కొప్పడ్డారు.

ఇంకా పొలాలమీదా. బీరువాతాళాల మీదా అధికారం రాని వారంతా...

"ఈ ఛాదస్తంతో చచ్చిపోతున్నాం. వీళ్లు తినరు. మనల్ని తిననివ్వరు. దేశానికంతా మన వెనకాల ఏదో వుందని ఏడుపు. ఇక్కడికొచ్చి చూస్తే తెలుస్తాయి. మేం తలకు నూనె కూడా రాసుకోలేదు. మీకు మాత్రం వాసన నూనెలు కావాలి అంటారు. మా ముఖాలకి ఆవదం పూసుకున్నాం. మేం నీరెక్కిన వంచెలు తొడుక్కున్నాం. మేం మోకాలి బురదలో నడిచాం. నోరు తెరిస్తే ఈ కథలు. అసలా పామేదో ఆవిణ్ని కరవటం ఎందుకు... వరసగా ఈ ముసలాళ్లనంతా కరిస్తే పీడా వదిలిపోయేది"

మొత్తంమీద షావుకారి భార్య ఆరోగ్యంతో తిరిగివచ్చింది. ఈలోగా వానలూ కురవటం ఆగిపోయాయి. నేల కొంచెం గట్టిపడింది. ఎవరి పనుల్లోవారు పడ్డారు. కొంతమంది మాత్రం ఆశ చంపుకోక 'రోడ్డు' గురించి అడిగారు. షావుకారు అవుననిగానీ కాదనిగానీ అనలేదంట. ఓ ముక్క మాత్రం అన్నాడంట.

"రోడ్డేస్తే పాములొచ్చి కరవ్వని ఏదైనా గ్యారంటీ ఉందా?" అని.

ఈ ముక్క మనకు తెలియకపోయింది గదాని కొందరు ఆశ్చర్యపడిపోయి- అవును నిజమేకదా. అయినా ఊహించనివిధంగా

వానలు రావడమేమిటి... ఆవిడకు బయటకు రావాల్సిన అవసరం ఏమిటి? ఆ పాము కరవటం ఏమిటి? ఇదంతా ఆ భగవంతుడి లీల. ఆవిడకు ఇంకా ఎంతకాలం బతకాల మందో శుభ్రంగా తిరిగొచ్చింది. దీనికీ, రోడ్డుకీ ఏమాత్రం సంబంధంలేదు. ఎవరికెంతకాలం ఉంటే అంతకాలం ఈ భూమ్మీద ఉంటారు అనే నిర్ణయానికి వచ్చారు.

కొద్దిమంది మాత్రం... "ఇలా జరుగు తుందని మాకు ముందే తెలుసు. మనకి దాహం అయినప్పుడు బావి తవ్వుకోవటం అలవాటైంది. షావుకారు రానీండి అన్నారు. వచ్చాడు ఏమైంది? అసలు తలో నాలుగు వందలేసుకొంటే ఈ ఊరికి రోడ్డు రాదా... మళ్లీ జిల్లాలో మా ఊరంత మొనగాడి ఊరులేదని మీసాలు మెలితిప్పుతారు. అసలది విషప్పాము అయివుండదు" అని గొణుక్కున్నారు.

కొద్దికాలంపాటు ఈ విషయం నలుగుతూ వుండి ఆ తర్వాత ఎవరి కార్యక్రమాల్లో వారు మునిగిపోయారు.

ఇలాంటి చిన్నచిన్న సంఘటనలూ... కొన్ని పెద్ద సంఘటనలూ జరుగుతూనే వస్తున్నాయి. పాలెం జనంలో ఉన్న అసంతృప్తినీ, ఆరాటా ల్నీ గుర్తించేవారు లేరు. వారిని సరైన మార్గంలో పెట్టేవారు లేరు.

అందుకు పూనుకొంది ఒకేవ్యక్తి...

ఆయన వెంకట్రావు మాస్టారు...




వెంకటరావు మాస్టారిది పాలెంకాదు. పాలెంలో ఉన్న బడిలో ఏడో తరగతిదాకా మాత్రమే ఉంది. ఆ హెడ్ మాస్టారికి చదువుచెప్పే విషయం కంటే పొలాల్లోని పంటల విష యంలోనే ఆసక్తి ఎక్కువ. ఆయనకు కొన్ని ఎకరాల భూమి ఉంది. మిగతా టీచర్లు కూడా ఏదో ఒక వ్యాపకం ఉన్నవారే. ఏదో ఆ బడికి పిల్లల్ని పంపించటం... వాళ్లు ఏదో ఒకటి చెప్పి పంపించటం జరిగాయి.

వెంకటరావు మాస్టారి ఆగమనంతో ఆ ఊరిలో ఓ సంచలనం కలిగింది. ఆయన కూడా మిగతావారికిమల్లే చదువు తప్ప మిగతా విషయాల మీద, ముఖ్యంగా పాలెం గ్రామస్తు లకు ఇబ్బంది కలిగించని విషయాల మీద శ్రద్ధ చూపిస్తే ఎవరికీ బాధ కలిగి ఉండకపోవు ను.

ఏమాత్రం ఆలోచన కలవారికైనా వచ్చే మొదటి ఆలోచన ఆయనకూ వచ్చింది. అది 'పాలెం రోడ్డు' విషయమే. ముందాయన ఈ విషయాన్ని తన పిల్లల్లో ఇంజెక్టు చేశాడు. అందుకు ఆయన తన పాఠాల్ని వివరించిన తీరుకూడా చాలా అద్భుతంగా ఉంటుందంట. ఆయన్ను ఈ ఊరి నుండి వెళ్ళగొట్టడం వెన కాల చాలా తతంగం నడిచింది. కానీ ఆయన నాటి వెళ్లిన బీజాల్ని ఎవరూ నాశనం చెయ్యలే కపోయారు. పిల్లలకి ఆయన చెబుతున్న విధానం చూసి ఎంత ఈర్ష్యపడినా తోటి ఉపా ధ్యాయులకు కూడా వినాలపించేదట.

"చాలాకాలంక్రితం మనుమలు మనుమ లుగాలేరని మీకు తెలుసా... "అంటూ మొద లుపెట్టి... మీ పాఠాల్లో చూస్తున్నారుగా రాతి ఆయుధాలు... ఆ తర్వాత మారుతూ వచ్చిన రకరకాల ఆయుధాలు... ఆదిమ మానవులు నిప్పు కనుక్కునేదాకా పచ్చి మాంసం తింటూ గడిపారు. మీరు తింటారా... కనీసం మంటల్లో కాల్చింది తింటారా... తినరు. దాన్ని నూనెలో వేయించాలి... మషాళాలు చల్లాలి. అప్పుడు లొట్టవేసుకుంటూ తింటారు. అంటే ఏమిటి... మనిషికి విజ్ఞానం పెరుగుతున్న కొద్దీ కొత్త కొత్త విషయాలు తెలుసుకుంటున్నాడు? ఎలా... రో డ్డు ద్వారా... అంటే మనం నడిచే రోడ్డు అనికాదు. మనం ఓ చోటునుండి ఇంకో చోటుకి ప్రయాణం చేయాలి. అంటే ఆ చోటుల్ని కలిపేదాన్ని రోడ్ అంటున్నాం. కాబట్టి ఈ రోడ్ అనేది కనిపించేదే కాదు. కనిపించని రోడ్లు




చాలా ఉన్నాయి. మీరు విమానాన్ని చూస్తారు. ఆకాశంలో అది పయనిస్తుంది. దానికో మార్గం ఉంటుంది. దాన్నే రోడ్ అంటాం. అది మనకు కనపడదు. విజ్ఞానమూ అంతే. మనిషికీ మని షికీ నడుమ అలాగే దేశానికీ దేశానికే నడుమ రోడ్ కావాలి. అలాంటివన్నీ జరగాలంటే ముందీ ఊరుకు రోడ్డు కావాలి''

పిల్లలంతా ''అవును కావాలి'' అంటూ అంగీకారం తెలియచేసేవారు. చూస్తుండగానే మిగతా ఉపాధ్యాయులకీ, హెడ్‌మాస్టారికీ వెంకట్రావు మాస్టారంటే గిట్టని పరిస్థితి వచ్చింది. ఊర్లో కొంతమంది కూడా వెంకట్రావు మాస్టారి 'విషయంలో దెబ్బతిన్నారు. వాళ్లకి అక్కడి టీచర్లందరినీ 'ఏవయ్యా పంతులు' అని పిలవటం అలవాటు. అందుకు వారేం బాధపడేవారు కాదు.

అదే వరసలో ఓ పేకాట బ్యాచ్ వెంకట్రావు గారిని చూసి

'కొత్త పంతులొస్తున్నాడురోయ్. ఈయన్ని కూడా మన్తోపాటు కూర్చోమంటే పోలా' అని...

'ఏయ్ పంతులూ' అంటూ పిలిచారంట. వెంకట్రావు మాస్టారు దగ్గరకు రాగానే

''గీతా పారాయణానికి వస్తారా పంతులుగారూ'' అన్నారట

''అంతకు ముందు ఏమని పిలిచారు''

''ఏం పిలిచాం. పంతులుగారూ అని పిల్చాం తప్పా?''

''పంతులుగారూ అని పిలిస్తే తప్పులేదు. 'ఏయ్ పంతులూ' అని పిల్చారు. అయినా మీకు నేనేం చదువు చెప్పటంలేదు. నా పేరు వెంకట్రావు... మీ కిష్టమైతే 'మాస్టారూ' అని పిలవండి. ఏం పంతులూ అని అసహ్యంగా పిలుస్తున్నారనుకోండి మీ తమ్ముళ్ళకో, చెల్లాయిలకో చదువులు చెప్పే వాళ్ళం కదా. వారికీ గౌరవం ఉండదు. అది వాళ్ళకీ, మీ ఊరికి కూడా మంచిది కాదు'' అనేసి వచ్చేశాడు.

ఆ తర్వాత ఆ రోజుకు పేకాట వాయిదా పడింది. 'ఏంటిరా పంతులు ఇంత మీటింగు చెప్పాడు. పెద్ద మొనగాడిలా ఈ ఊరికి మంచిది కాదంటాడేంటి' అని తలోముక్క అన్నారు.

వెంకట్రావు మాస్టారి తోటి మాస్టారొకాయన ''ఏమిటీ... ఈ ఊరికుర్రాళ్లతో మీరేదే గొడవ పడ్డారనుకుంటున్నారు?'' అన్నాడు.

''ఎవరనుకుంటున్నారు'' సూటిగా అడిగాడాయన.

ఆయన కంగారుపడి... ''అదే... అదే బజార్లో అనుకుంటుంటేనూ...''

''ఏ బజార్లోనండి. ఈ ఊరికి ఓ బజారు కూడా ఉందా? అయినా మనం వెళ్ళి ఆ కుర్రాళ్ళతోపాటు కూర్చుని పేకాటలు ఆడి, సిగరెట్లు ఊదుతుంటే వాళ్ళకేం గౌరవం ఉంటుందండీ. 'పంతులూ' అని పిలుస్తారు. లేకపోతే 'ఏరా' అంటారు. మన వృత్తికి కొంత గౌరవంతోపాటు బాధ్యతలున్నాయి. మనకు కొన్ని బలహీనతలుంటే ఉండొచ్చుగానీ ఇలా వీధినపడటం మంచిదికాదు. అయినా ఈ ఊర్లో కుర్రాళ్లంతా ఇంకేం పనిలేనట్లు ఆ పేకాటలు ఆడటం ఏమిటి? ఆ సినిమా కబుర్లేమిటి? మనకు చేతనయితే వాళ్ళను మార్చగలగాలి. లేదా కనీసం వారిని చెడగొట్టకుండా. వారితోపాటు మనం చెడిపోకుండా ఉంటే అది కొంతవరకు నయం''

ఆ మాటతో ఆయన కంగుతిన్నాడు. ఆయనకదే కార్యక్రమం. ఇలాంటి వారంతా వెంకట్రావు మాస్టారి గురించి ఓరకమైన ద్వేషాన్ని పెంచుకున్నారు. వెంకట్రావు మాస్టార్ని నేనయితే చూడలేదుగానీ... మా హెడ్‌మాస్టారికాయన ఉండేవారు. ఆయన గుర్తొచ్చారు వెంకట్రావుగారి గురించి విన్నాక.

ఆయన కనీసం అయిదారు సంవత్సరాలు ఆ ఊర్లో ఉన్నారు. ఎవరూ ఆయన్ని బయట చూసిన వారులేరు. పది గంటల సమయంలో ఓ పెట్టెలో బడికి చెందిన ముఖ్యమైన కాగితాలు ఫ్యాన్ మోసుకొస్తుంటే వెనక నడిచివస్తుండేవారు. తిరిగి సాయంకాలం అదే దృశ్యం. అన్ని సంవత్సరాల్లోనూ, ఆయన్ని సినిమా చూస్తుండగా గాని, సిగరెట్ తాగుతుండగా గాని చూసిన వ్యక్తులు లేరు.

అలా చేయటం మంచిదా కాదా అనేది వేరే విషయం. కానీ ఆయనున్నంతకాలం ఆ పదవికున్న పవిత్రతను కాపాడారు. ఆ తర్వాత

వచ్చిన వారిగురించి చెప్పుకోవటానికే లేదు. చిల్లర రాజకీయాల నుండి ఎక్కడ చూసినా వారే. పెద్ద రౌడీలుగా పేరుపొందిన వారు కూడా ఆయన్ను చూసి జంకుతుండేవారు. అప్పుడూ టీచర్ల నడుమ రాజకీయాలున్నా వాటిని గుసగుసల రూపంలోనే దాచుకునేవారు.

ఆయన అలా ఉండటాన్ని కూడా తీవ్రంగా విమర్శించినవారున్నారు. ఏమైనా ఆయన పద్ధతి ఆయనది. క్రమశిక్షణ... విద్యను నేర్పే వారు కొన్ని విలువలకు కట్టుబడి ఉండాలనేది ఆయన ఆచరించి చూపించారు.

వెంకట్రావు మాస్టారు మరో అడుగు ముందుకు వేశారు. ఆయన తనకు నచ్చని విషయాలుంటే నాకెందుకులే అని తల దించుకొనిపోలేదు. ఆయన సామాజిక సమస్యలుగా భావించిన వాటిని ఎదుర్కోవటానికే ప్రయత్నం చేశారు.

ఆ తర్వాత తర్వాతయితే ఏమయ్యేదోగాని మొదట్లో రాగానే ఆయన ఉండటానికి ఇల్లు ఇచ్చారు. ఓ రోజు ఆయన తన భార్య చేయిపట్టుకొని వీధిలో నడుస్తూ వెళ్లాడని ఊరు ఊరంతా గుప్పుమంది. ఇది ఉపేక్షించదగిన సాధారణ విషయం అనిపించలేదు. తీవ్రమైన చర్చలు జరిగాయి.

"ఇంత బరితెగిస్తే ఎలా. ఎంత పెళ్లామైతే మాత్రం అలా నడిబజార్లో చేతులు పట్టుకొని నడవాలా? పిల్లలు ఇలాంటి వాటిని చూస్తే ఇంకేమైనా ఉందా? వెంటనే ఇలాంటిది మరసారి జరగకుండా చూడాలి" అనుకున్నారు.

వెంకట్రావు మాస్టార్ని షావుకారుగారింటికి పిలిపించారు.

"చూడండి మాస్టారూ... మా ఊరికి కొన్ని కట్టుబాట్లున్నాయి. మీరు మీ భార్య చేతులు పట్టుకొని కబుర్లు చెప్పుకుంటూ వెళ్లారంట రోడ్డుమీద. మీకు తెలుసో తెలియదో ఈ ఊర్లో సొంతం మొగుడి ముఖమే చూడని ఆడంగులు చాలామంది ఉన్నారు. అక్కడిదాకా ఎందుకు మా కూలీలున్నారు. ఆ ఆడవాళ్ళు కూడా తమ నోటితో మొగుడి పేరు చెప్పరు. మీరు పట్నంలో ఉండొచ్చారు. ఇలాంటివన్నీ మీకు తప్పుకాదు. కానీ ఈ ఊర్లో పెళ్లికావల్సిన ఆడపిల్లలున్నారు. పెళ్లి చేయాల్సిన మొగపిల్లలున్నారు. వారందరూ ఇప్పటివరకూ కొన్ని కట్టుబాట్లతో ఉన్నారు. మరి మిమ్మల్ని చూసి వాళ్లంతా కూడా ఆడా మొగా కల్సి రోడ్లమీద పడితే బాగుండదని ఓసారి చెబుదామని కబురుచేశాం" అన్నాడాయన.

ఆయన పక్కన కూర్చున్న వారందరూ తల లూపారు. మొదట వెంకట్రావు మాస్టారు కొంచెం ఖంగుతిన్నారు. వెంటనే ఆయన సర్దుకున్నాడు.

"మంచిదండి. మీరిలా చెప్పటం చాలా బాగుంది. నేనూ, నా భార్య కలిసి నడిచివచ్చిన మాట నిజమే. అయితే మేం చేతులు పట్టుకొని నడవలేదు. సరదాకి నడుద్దామనుకున్నా నేనేం కొత్త పెళ్లి కొడుకునికాదు. కాకపోతే నా భార్య నేను ముందు నడుస్తుంటే నా వెనకాల అడుగులు వేసుకుంటూ వచ్చింది. మీరు చెప్పినట్లు మాకు ఇలాంటివి తప్పుకాదు. అలా అని చెప్పి మీ ఊరి సంప్రదాయాల్ని నేను వ్యతిరేకించాలనుకోవటం లేదు. అందులోనూ మీ ఊరిపిల్లల విషయంలో మీరింతగా ఆందోళన చెందుతున్నారు కాబట్టి ఇక నుండీ మేం మీకెలాంటి ఇబ్బంది కలిగించదలుచుకోలేదు. తర్వాత పిల్లల గురించే ఇంకో విషయం మీకు చెప్పాలనుకుంటున్నాను. చాలామంది పిల్లలు ఇక్కడ ఏ గమ్యమూ లేకుండా ఉంటున్నారు. పేకాటల్లో కాలం వెల్లబుచ్చుతున్నారు. ఏ ఊరికైనా ఇదేమంత మంచి విషయం కాదు. పిల్లలు చెడిపోకుండా ఉండటానికి మీరు చూపిస్తున్న శ్రద్ధ చాలా అవసరం" అనేసి వచ్చాడు.

వెనకాలనుండి మాస్టార్ని నిర్ఘాంతపోయి చూడటం మినహాయించి ఏంచేయలేకపోయారు. 'నా భార్య, నా ఇష్టం' అంటూ మాట్లాడితే తగాదాకు కూర్చుకున్నారు. ఆయన మెత్తగా అంటించిపోయాడు.

"తలబిరుసు వంతులే" అని తీర్మానించుకున్నారు.

"అవునయ్యా మన పిల్లలు పేకాటలాడుతున్నారు. ఏంచేస్తారు. ఇంటిదగ్గర ఏమీ తొయ్యకపోతే నలుగురు కలిసి ఆడుకుంటు




న్నారు. వాళ్ళేం క్లబ్బుల్లో ఆడుకోవటంలేదు గదా. ఓవేళ ఆడుకుంటే ఈ పంతులేమైనా డబ్బులిస్తాడా. మా డబ్బుల్తో మేం ఆడు కొంటాం. తగలేసుకుంటాం. ఈయన కెందు కంటా. షావుకార్రి దగ్గర మాట్లాడటం అలా నేనా... మనూరికి చాలామంది పంతుళ్ళొచ్చా రుగానీ ఈడెవడో ఫోజులిస్తున్నాడు. ఆడ్ని పిలిచి అడిగినప్పుడు తప్పయిపోయిందని చెంపదెబ్బలు వేసుకుపోవాల" అని కృష్ణమూర్తి లాంటాయన ఎవరో ఆవేశపడ్డాడు.

"అది సంగతి నీకు తెలియదు బాబూ... పంతులుగారూ అని పిలిస్తే అవమానమంట. మాస్టారూ అనాలంట. అసలీడికి ఉద్యోగవి చ్చింది ఎవడయ్యా బాబూ... పిల్లకాయలికి పాఠాలు చెప్పమంటూ పంపిస్తే అయి మాత్రం వదిలేసి మిగతావన్నీ చెబుతాడు" అని ఇంకో రు బాధపడితే.

"అది సర్లేరా... ఈ పంతులొచ్చినాక పిల్లలు కొంచెం చదవటం మొదలుపెట్టారు. ఇదివర కయితే పుస్తకం చేతిలో ఉండటం నేనెప్పుడూ చూడలేదు"

"ఆఁ ఏంచదువుల్లేవోయ్. బొమ్మలు గీయా లంటాడు. మ్యాపులు కావాలంటాడు. ఆట లంట. నాటకాలంట. పాటలంట. దానిసిగద రగ ఎన్ని డబ్బులూ చాలటంలేదు" అంటూ మొదటాయన కస్సుమన్నాడు.

ఏమైనా వారందరికీ మాస్టారి విషయంలో బాగా అసంతృప్తి కలిగింది. ఆయన తన తీరిక సమయాల్లో మొత్తం ఆ గ్రామ జీవితాన్ని అధ్యయనం చేయటానికి కేటాయించుకున్నా డు. ఆయన దృష్టికి వచ్చిన అంశాలు గమ నించి దిగ్భ్రాంతి చెందాడు.

తనూ, తన భార్య చేతులు పట్టుకొని నడు స్తుంటే సహించలేని ఆ గ్రామంలో చాలా అక్రమసంబంధాల్ని ఆయన గమనించాడు. అందులోనూ పెద్దలుగా చలామణీ అవుతున్న వారే ఎక్కువ. వారి గురించి అందరికీ తెలు సు. కానీ ఏమీ తెలియనట్లుగానే ఉంటారు.

ఆ గ్రామంలో నిర్వీర్యమైన యువకులు ఉత్పత్తికావటం వెనకవున్న కారణాలు ఆయ నకు అర్థం అయ్యాయి. ఈ గ్రామంలోని పెద్దల్లో చాలామందికి అనేక బలహీనతలు న్నాయి. వాటి నుండి వారెలానూ బయటపడ లేరు. తమ కుర్రాళ్ళు వ్యవసాయం చేయకపో యినా, చీట్లాడుతున్నా పిలిచి మందలిస్తే వాళ్లంతా తిరగబడి "మీరు చేస్తున్నదేమిటీ?" అంటే వాళ్ల పెద్దరికం అంతం అవుతుంది. అందుకే దీని చుట్టూ ఓ సిద్ధాంతం అల్లుకువ చ్చారు.

రోడ్డు లేకపోతే ఒకటే ఇబ్బంది. ఇప్పుడు గానీ రోడ్డుకూడా ఉందంటే ఈ కుటుంబాలన్నీ కొల్లేట్లో దూకాల్సిందే. సాయంకాలానికల్లా స్కూ టర్లు వేసుకొని చేతిలో గోల్డు ఫ్లాక్ సిగరెట్ పెట్టె, గ్లాస్కో లుంగీతో వెళ్లి క్లబ్బుల్లో కూర్చుంటే ఇంకేమైనా ఉందా? మందుకి మందు అలవా టవుతుంది. ఇంకా అన్ని రకాలుగానూ చెడిపో తారు. ఇదిగో ఇక్కడయితే ఏ చిన్న స్టేకులో ఆడుకుంటారు. చాటుమాటుగా ఏ సారానో, ఇంకేమైనా బుడ్లో తాగినా అవంత లెక్కలోకి రావు. అయినా ఈ కాలంలో తాగని వాడెవడు"

ఆ విధంగా పాలెం జనంలో చిత్రమైన వైరుధ్యాలున్నాయి. వారికి అంగీకారమైతే ఎలాంటి భయంకరమైన సమస్య అయినా దాని చుట్టూ ఓ రంగు పులుముకుంటారు. మిగతా ప్రజలంతా సహజమైన విషయాలు అనుకునేవి వారి దృష్టిలో పెద్ద నేరాలుగా ఉంటాయి. ఇంకా అప్పటివరకూ ఆ గ్రామాన్ని పెద్దకుదుపు కుదపకపోయినా కూలీల జీవి తంలోకి పాలెం మోతుబరులు చొచ్చుకువెళ్తు న్న విధానాలపట్ల వారికి చాలా అసంతృప్తి ఉంది. అందుకే వెంకటరావు మాస్టారు అలాంటి వారితో కూడా సంబంధాలు ఏర్పరు చుకున్నాడు. ఈ విషయం మోతుబరులందరి కీ కంటకప్రాయం అయింది.

ఒరకంగా ఇంతకాలం రోడ్డు నిర్మించకుండా వేటినయితే కాపాడుకుంటూ వచ్చామనుకు న్నారో అవన్నీ ఈయన మూలంగా ధ్వంసం అయ్యే పరిస్థితులొచ్చాయి. అందుకే ఏంచే యాలా అనుకున్నప్పుడు రకరకాల ఆలోచన లు వచ్చాయి. కొంతమంది శాల్తీనే గల్లంతు చేస్తే పోతుంది అని సలహా ఇచ్చారట. మరి కొందరు బెదిరించితే చాలన్నారంట. గోటితో పోయే దానికి గొడ్డలి ఎందుకనుకున్నారేమో తిరిగి వెంకట్రావ్ మాస్టారితో సమావేశం జరి




గింది. ఈసారి చాలా వేడివేడిగా కూడా జరిగింది.

"ఏవయ్యా పంతులూ... ఇంతకు ముందోసారి హెచ్చరించి పంపాం గదా. నువ్వు మా ఊరి విషయంలో చాలా అనవసరంగా జోక్యం చేసుకుంటున్నావు"

"అదేమిటి మా ఊరు అంటున్నారు. మీ ఒక్కరిదేకాదు ఈ ఊరు. నేనిక్కడ పనిచేస్తున్నాను. ఈ గాలి పీల్చుకుంటున్నాను కాబట్టి నాది కూడా ఈ ఊరే. విషయం ఏమిటో సూటిగా చెప్పండి"

"ఏంటయ్యా నీకు చెప్పేది. ఇప్పటివరకూ మాలో ఎలాంటి తగాదాలు లేవు. నువ్వు వచ్చి ఈ గ్రామానికే చిచ్చుబెడుతున్నావు. కూలోళ్లని రెచ్చగొడుతున్నావు"

"నేనా... నేను రెచ్చగొడుతున్నానా... అలా చేస్తే బాగానే ఉండేది... మీకు తెలుసో తెలియదో మీ పిల్లలు చాలా ముందుకుపోయారు. తెల్లారిలేచిందగ్గర్నుండి వారి కళ్లన్నీ మాలపల్లి మీదే. అక్కడ అమ్మాయిల విషయంలో చాలా అసభ్యంగా ప్రవర్తిస్తున్నారు. మీ మీదున్న భయంతో వాళ్ళింకా ఇవన్నీ బయటకు చెప్పుకోలేకపోతున్నారు. వాళ్ళు కూడా మనందరికిలానే పిల్లల్ని కన్నారు. మీ మీ పొలాల్లో పనిచేస్తుంటే వాళ్ళకు డబ్బులిస్తున్నారు. అంతమాత్రాన అన్ని విషయాల్లో వాళ్ళు లొంగివుంటారని మీరు భావించొద్దు. కాలం చాలా మారింది. అందుకే నేను చెబుతున్నాను. వాళ్ళను రెచ్చగొడుతుంది నేనుకాదు మీ పిల్లలు. ఇంతకు ముందుకూడా ఓసారి నన్ను ఇలానే పిలిచారు. మీ భార్యలు ఎవరి ముఖాలు చూడరని గొప్పలు చెప్పుకున్నారు. అదేమంత గొప్పవిషయం కాదు. ఈ ఊరి పెద్దమనుషులు చాలామంది చీకటి రాత్రులు ఏంచేస్తుంటారో నాకు తెలుసు. నాకే కాదు అలాచేస్తున్న వారి పిల్లలకు బాగా తెలుసు. అందుకని కొంచెం కళ్లు తెరవండి. మీ మీ పిల్లలు చెడిపోకముందే వారిని కాపాడుకోండి"

"నువ్వు అనవసరమైన వాగుడు వాగుతున్నావ్. ఈ ఊర్లో నీకు మంచినీళ్లు పుట్టవు"

"అలాంటి పరిస్థితి వస్తే ఏం చేయాలో నాకు బాగా తెలుసు"

"ఏందోయ్ నీకు తెలుసేది" అంటూ ఎవరో ముందుకు రాబోయారు కోపంగా

"ఏమిటి చేతులు మడిచివస్తున్నావ్. కొడతావా?"

"కొట్టడం కాదురా... నరికి రోడ్డు మీద పడేస్తా"

"రోడ్డా? ఏ రోడ్డు మీద? ఎవరి రోడ్డు మీద? ఏ ఊరి రోడ్డుమీద? ముందు నన్ను నరకాలంటే ముందురోడ్డు వేయించుకోండి. ఆ తర్వాత నరికి మీ రోడ్డు మీదే పడేస్తే మీ శౌర్యానికి జనం మెచ్చుకుంటారు. చూడండీ. నేను మీ కింద పనిచేయటంలేదు. ఇంతకు ముందు ఏదో పెద్దవారు లెమ్మని ఊరుకున్నాను. మాది ఈ ఊరుకాకపోవచ్చు. అంతమాత్రాన చేవచచ్చి ఎవడూ లేడు. ఈ రోజు మీరందరూ కలిసి నన్ను నరకొచ్చు. గుర్తుపెట్టుకోండి. ఆ తర్వాత మీ గతుకుల రోడ్డే మీకు హద్దవుతుంది... మీకు సమాధానం చెప్పవలసిన వారు చెబుతారు" అనేసి గిరుక్కున వెనక్కి తిరిగివచ్చాడు.

"ఈడి తల్లి... కొడుకుని ఇప్పుడే తెగేస్తా" అంటూ అతను ముందుకు దూకబోయాడు... అందరూ అతన్ని గట్టిగా పట్టుకుంటే వెంకటరావు మాస్టారు వెనక్కి తిరిగి అన్నాడు.

"పశువులా మాట్లాడకు. నువ్వు ముంజికాయలు నరకాల్సిందే"

★ ★ ★

వెంకట్రావు మాస్టారు వెళ్ళాక అందరూ అతనిమీద విరుచుకుపడ్డారు.

"ఏమిట్రా పెద్దమొనగాడిలా బయలుదేరావ్... నరుకుతా నరుకుతా అంటావ్. అసలు నీకు తలకాయుందా? ఆ పంతులు చూడు ఎంత మాటని వెళ్లాడు. అయినా మాట్లాడటానికి ఇంతమంది పెద్ద వాళ్లున్నారు. ఇంతలోపు నీకెందుకంట. అయినా నరికి పారెయ్యటానికి నీ చేలో చెట్లా లేదా అలగా జనం అనుకున్నావా. ఆ పంతులు ది ఏ ఊరో... ఆడి ఎనకాల కులం బలమే ఉందో, రాజకీయాలున్నాయో, అసలాడి కథ ఏమిటో ముందు చూడాలికదా. ఇప్పుడు ఆడేమన్నాడు నన్ను నరికితే ఈ రోడ్లమీద ఎవడూ తిరగడన్నాడు. ఎంత ధీమా

లేకపోతే ఆ మాట అంటాడు. నరకటం సులభ మేరా. అదేమంత గొప్పకాదు. ఆ తర్వాత వస్తుంది అసలు విషయం. పోలీసులకి పొయ్యాలి వేలూ లక్షలూ. నువ్వూ, మేమూ అందరవూ కల్సి ఆ కోర్టుల చుట్టూ తిరగాలి. ఏదైనా మాట్లాడేముందు కొంచెం ఆలో చించాలి. ఆడు మామూలుగా చెబుతుంటేనే రెచ్చిపోతుంటే నువ్వేమో ఇంకా" అంటూ చివాట్లు వేశాక వారందరూ నిర్ణయించుకుందొ కటే.

"ఈడు ఎలా మాట్లాడాడనేది పక్కన పె డదాం. అసలు ఇంతమంది పెద్దవాళ్ళం ఉన్నాంకదా. ఎవర్ని లెక్కచేశాడు. మనకి కూడా పాఠాలు నేర్పుతున్నాడు. నేను ఇంతవ రకూ ఇలాంటి వాళ్లను చూడలేదు. ఏదిఏమైనా ఇదంతా మన ఊరి సమస్య. ఆ పంతులుని ఇలా వదిలేస్తే కష్టం. రేపు ఆ మాలపల్లిలో వాళ్ళూ ఎదురు తిరుగుతారు. అందుకు ఏం చేయాలో చర్చించండి. అసలు మన వెంకట్రామయ్యగారి సలహా తీసుకుంటే బాగుంటుంది" అనుకున్నారు.

వెంకట్రామయ్యగారికి పొలాలున్నాయి. ఆయన కూడా ధనవంతుల్లో ఒకరు. అయితే ఎప్పుడూ ఖద్దరు బట్టలు మాత్రమే ధరి స్తుంటారు. ఆయనకి ఆచార్యులగారికీ సాహిత్యం అంటే ఇష్టం కూడా. కాకపోతే మిగతా వారికి మల్లే ఆయన తన తోటి వారిమీద దౌర్జన్యంగా ప్రవర్తించడం చేయరు. కనీసం పని వాళ్లను కూడా పల్లెత్తు మాట అనరు. వారితో చాలా సౌమ్యంగా ఉంటారు. ఊరి రాజకీయాల గురించి కూడా పట్టించుకోరు. ఆయన దగ్గరికి వెళ్తే ఒకటే చెబుతుంటారు. "మీరు ఏం చేసినా నాకు అభ్యంతరం లేదు. కానీ ఈ ఊరి పరువు ప్రతిష్టలు మాత్రం దృష్టిలో పెట్టుకోండి" అని

షావుకారికి కూడా వెంకట్రామయ్యగారంటే గౌరవం ఉంది. ఆయనకు చెందిన సమస్యల్ని కూడా వెంకట్రామయ్య ముందు పెట్టాడు. ఇంక ఆయన రోజూ ఎవరో ఒకరికి ఏదో ఒక విషయం గురించి వివరించటమో, మెత్తగా మందలించటమో లేదా తగాదాలు తీర్చ టమో చేస్తుంటారు.

ఆయన అలా ఉంటాడుగానీ పాలెంలో ఏం జరిగినా ఆయనకు తెలుస్తూనే ఉంటుంది. ఆయన పైకి మాట్లాడకపోయినా ఆ ఊరిలో ప్రధానమైన మార్పులు ఆయన ఆమోదం లేకుండా జరగవు అనేది కూడా ఉంది. కాగా వెంకట్రావు మాస్టారు గురించి అంతా ఆయన వింటున్నాడు. మొదటిసారి పిలిచి చెప్పట మూ. రెండోసారి ఘర్షణ విన్నాక ఆయన గ్రామ పెద్దలికి చాలా విషయాలు చెప్పారనేది బయటకొచ్చింది.

"పాలెం హింసకు దూరంగా ఉండాలి. ఆయనంటే మనకు పడటం లేదంటే అందుకు మనం మర్యాదగానే, మన గౌరవం దెబ్బతినకుండానే పని పూర్తిచేయించుకోవచ్చు. అంతక్కుమించి గందరగోళం చేస్తే ఆ మాస్టా రు దీన్ని రాజకీయ చేయొచ్చు. ఇన్ని సంవత్స రాలుగా మనం ఎలా బతుకుతున్నామో ఈ ప్రపంచానికి తెలియదు. ఓ రకంగా కొంత మంది దృష్టి ఇటు పడకుండా మనం కాపాడు కొంటూ వచ్చాం. అయినా మనం కూడా మన పద్ధతులు మార్చుకోవాలి. దేశంలో ఎలాంటి మార్పులొస్తున్నాయో మీకు అర్థం కావటం లేదు. గతంలోలా ఉండాలంటే మాత్రం కష్టం. మనం ఈ జిల్లాల్లో కొన్ని ఊర్లు చూస్తున్నాం కదా. అవెప్పుడూ ప్రశాంతంగా ఉండటం మనం చూడలేదు. ఎప్పుడూ ఎవరో ఒకరు తలలు పగలగొట్టుకోవటమో, హత్యలు చేసుకో వటమో జరుగుతుంది. ఆ ఊర్లో సంబంధాలు చేసుకోవటానికి కూడా భయపడే పరిస్థితిలొ చ్చాయి. మరి ఈ ఊరుని కూడా అలా తయా రు చేసుకుందామంటారా? అందుకే మెల్లగా ఆ మాస్టారుని ఇక్కడ నుంచి మార్పించు కుంటే సరి. ఆ మాత్రం పనులు చేయించుకో గలం కదా.

ఈ మాటలు పేకాడే ఉడుకు రక్తం మోతు బరులకి నచ్చలేదు.

"అసలు ఈయన్ని ఇలా వదిలేస్తే, ఆ అలుసు చూసుకొని రేపొచ్చే పంతులు కూడా మన ఊరి విషయాల్లో జోక్యం చేసుకుంటాడు. అందుకే ఈ పంతులకి బుద్ధి చెప్పాలి. అయినా పోలీసులు పోలీసులంటే భయపడా లంటారు. పట్టపగలు అందరూ చూస్తుండగా




పాడిచేసి వెళ్తున్నారు. రెండు సంవత్సరాలు తిరక్కముందే కాలరెత్తుకొని తిరుగుతున్నారు. అసలు ఈ ముసలాళ్లకి పెట్టెలో నుంచి పైసా తియ్యాలంటే బాధ... అయిందానికీ, కానిదానికీ ఆ వెంకట్రామయ్యగారు దొరుకుతారు. అసలీ పంతుల్ని ఇలా వదిలేస్తే లాభం లేదు'' అనుకున్నారు.

వాళ్లెంత గంభీరంగా మాట్లాడినా వాళ్ల ప్రాణాలన్నీ పెద్దల చేతుల్లో ఉన్నాయి. ఓ దశకు మించి వారి మీద వత్తిడి తేలేమని వారికి తెలుసు. అందుకే వెంకట్రావు మాస్టారికి ఆ ఊరు నుంచి బదిలీ చేయించటానికి ప్రయత్నాలు చేస్తుండగానే తమ ఇళ్ల నుంచి ఖాళీ చేయించారు. ఆయన మాలపల్లి దగ్గర ఉండాలనుకున్నాడు. అక్కడ ఇల్లు ఇవ్వటానికి వాళ్ళు కూడా భయపడ్డారు. ఈ గొడవ ఎలా పోయి ఎలా వస్తుందోనని వెంకట్రావు మాస్టారేం కంగారుపడలేదు. ఆయన చిన్న గుడిసె పోరంబోకు స్థలంలో వేసుకున్నాడు. ఆ తర్వాత ఇంకేం జరిగేదోగానీ బదిలీ ఆర్డర్లు వచ్చాయి.

గ్రామంలో మోతుబర్లు మీసాలు మెలేశారు. వెంకట్రారు మాస్టారేం ఢీలా పడలేదు. కాకపోతే ఒకటే అన్నారట.

''ఎక్కడైనా, ఒంటరిగా పోరాడితే అపజయమే మిగులుతుంది. ఇక్కడ కొంతమంది ఈ ఊరంతా ప్రశాంతంగా ఉందనుకొని భ్రమ పడుతున్నారు. నేనేం వీరిమీద పోరాటం చెయ్యలేదు. కనీస అవసరాలు గురించి ప్రస్తావించాను. యువకులు చెడిపోతున్నారని చెప్పాను. అదికూడా భరించలేకపోయారు. అయితే 'పాలెం' ఎప్పుడూ ఇలానే ఉండదు. ఇక్కడి జనం చాలా చాలా అడిగే రోజులొస్తాయి. అప్పుడు ఓ మహాయుద్ధమే జరగవచ్చుకూడా''

''మాస్టారూ- తిరిగి ఈ ఊరేరావటానికి మీరెందుకు ప్రయత్నం చేయకూడదు'' అనడిగితే.

''ఈ దేశంలో కొన్ని లక్షల గ్రామాలున్నాయి. ప్రతిచోటా సరిగ్గా ఇలానే కాకపోయినా ఈ మోస్తరు అనుభవాలే ఉన్నాయి. నేను ఈ ఊరినుంచి వెళ్లిపోతున్నందుకు బాధపడడంలేదు. అలాగని సంతోషంగా కూడా లేదు. ఈ ఊర్లో ఉండటానికి నేను ప్రయత్నం చెయ్యటం కాదు. ఈ ఊర్లో వారు చెయ్యాలి. కనీసం కొంతమందయినా ఈ అన్యాయానికి వ్యతిరేకంగా గొంతు విప్పాలి. ఇక్కడి పెద్దలు చెప్పిందే వేదంకాదని వారు గుర్తించేలా చేయాలి. కాని అలాంటి స్పందన ఇప్పటికీ ఈ గ్రామంలో లేదు. నన్ను ఇల్లు ఇవ్వకుండా తరిమేయగలిగారు. మాలపల్లిలోని ప్రజలు నన్ను తమ దగ్గర ఉంచుకోవటానికి భయపడటాన్ని నేను అర్థం చేసుకుంటాను. కానీ ఇంత మంది చదువుకున్నవారున్నారు. ఇందులో ఒక్కరు కూడా ఇదేమిటని ముందుకు రాలేకపోయారు. అందుకే చెబుతున్నాను. ఈ ఊరు మారాలంటే ముందు మీక్కావలసింది మంచి రోడ్డు... అది నిర్మించుకోండి. రోడ్డంటే ఏమిటో నేను మీకిప్పుడు చెప్పాలనుకోవటంలేదు. మీ పిల్లలకి చెప్పాను. ఎప్పుడైనా తీరిక దొరికితే వారిని కనుక్కోండి.

వెంకట్రావు మాస్టారు వెళ్ళిపోయారు. ఈ విషయంలో చాలా కొద్దిమంది మాత్రమే విశ్వాసాన్ని (విక్ర తానందాన్ని) పొందారు. చాలాకాలంపాటు వెంకట్రావు మాస్టారి గురించి అక్కడ అందరూ చెప్పుకున్నారు.

తాము చేసినపనిలో సమంజసత్వం లేదని చాలామందికి అనిపించింది. రోజువారీ జీవితపు సంగ్రామంలో వారు వెంకట్రావు మాస్టారిని మరిచిపోగలిగారు.

పాలెం ప్రజల మనోభావాలను నిశితంగానే అర్థంచేసుకుంటానికి మేం ప్రయత్నం చేశాం. మా అంచనాలు ఈవిధంగా ఉన్నాయి. మొదట స్త్రీ, పురుషులు పరస్పరం ఒకరిమీద ఒకరు ఎలాంటి అవగాహనను కలిగి ఉన్నారనే విషయానికొస్తాను.

కొన్ని కుటుంబాల్లో ఆర్థికపరమైన అంశాల్లో స్త్రీలు చెప్పినమాట నెగ్గుతుంది. అంతకు మించి స్త్రీ-పురుష సంబంధాలు భిన్నంగా ఏమీలేవు. స్త్రీలు స్వేచ్ఛగా బయటకు వచ్చే వాతావరణం అక్కడలేదు. కొన్ని కుటుంబాల్లో స్త్రీలు మాత్రమే బయటిప్రపంచాన్ని చూడగలుగుతున్నారు. వారు బట్టల విషయంలోనూ,



నగల విషయంలోనూ ఆధునికంగా ఉండగ లుగుతున్నారు.

అదేవిధంగా కొన్ని కుటుంబాల్లోని స్త్రీలు అప్పుడప్పుడూ టౌన్‌కు వచ్చి తమకు కావల సిన వస్తువులు తీసుకువెళ్ళటం లాంటివి చేస్తారు. అలా రావటం అంటూ జరిగితే చాలాపనులు పెట్టుకునేవస్తారు. మిగతాచో ట్లకూ, పాలెంకూ ఓ ముఖ్యమైన తేడా ఉంది. పెద్దకులాల స్త్రీలు ఇంటికే పరిమితమవటం అది. ఆ చుట్టుపక్కల కొన్ని గ్రామాల్లో బయట వారిపొలాల్లోకి పనులకెళ్ళకపోయినా తమ స్వంతపొలాల్లో స్త్రీలు పనిచేస్తుంటారు. కొన్ని కుటుంబాల్లో స్త్రీలు కూడా బయటకు వచ్చి పనులు చేయాల్సిన అవసరం ఉండికూడా వారు బయటకురారు.

పాలెం పురుషుల్లో చాలామందికి స్త్రీలపట్ల సదభిప్రాయంలేదు. అక్కడి యువకులు కొంతమంది పరమభయంకరమైన భాషలో తిడుతుంటారు. చాలాకాలంవరకు ఆడపిల్లల ను చదివించటం అక్కడలేదు. మొదట్లో పాలెంలో అయిదు తరగతులకు మించి ఉండేదికాదు. ఆ తర్వాత ఏడోతరగతిదాకా వచ్చింది. చాలామంది ఆడపిల్లలకు అంతకు మించి చదివే అవకాశంలేదు.

కానీ పాలెం ప్రజలు ఆడపిల్లల చదువు విషయంలో తమ అభిప్రాయం మార్చుకోక తప్పని పరిస్థితులు ఏర్పడ్డాయి. ముఖ్యంగా తమతమ పిల్లల్ని పెద్దచదువులు చదివిన అబ్బాయిలకు కట్టబెట్టాలనుకున్నప్పుడు అటునుంచి కూడా అమ్మాయి ఏం చదివిందనే ప్రశ్నరావటం మొదలైంది. ఆ ఊరికి చెందిన కొంతమంది ఆడపిల్లలకు ఈ కారణంతోనే అనుకున్న సంబంధాలు కుదరలేదు. వారి అహం దెబ్బతిందికూడా అప్పుడే.

"పాలెం"లోని కొంతమంది బంధువులు వారికి సలహాలు ఇచ్చారు.

"ఇదివరకటిలా ఆడపిల్లలకు చదువు అవ సరమా అంటే కుదరదు. తప్పకుండా చదువు కావాలి. ఈ కాలంలో చాలామంది ఆడవాళ్ళు ఉద్యోగం చేస్తున్నారు. అలాచేస్తేనే పట్నాల్లో బతకగలిగేది. అయినా కనీసం పిల్లలకు చదువు చెప్పించుకోవాలన్నా వాళ్ళకి చదు వుండాలికదా. ఇప్పటి పిల్లల చదువు తెలుగు భాషతో ప్రారంభంకావటంలేదు. నాలుగు సంవత్సరాల నుండి ఇంగ్లీష్ రావాలి. అందు కే నువ్వు ఎంతడబ్బు పోస్తానన్నా కనీసం చదువులేకపోతే కష్టం. అలాకాకున్నా ఈరోజు పరిస్థితులు ఎలామారిపోతున్నాయనుకున్నా రు. మీరు రాబోయే రోజుల్ని ఊహించటంలే దు. ఆడపిల్లలు తమ కాళ్ళమీద తాము నిబడాల్సివస్తుంది. అందుకే వాళ్ళను చది వించండి.

ఈ అంశాల్ని వారు అర్థంచేసుకున్నారు. అందుకే కొంతమంది తమ రంగాన్ని పట్టణా లకు విస్తరింపచేశారు. పిల్లల చదువులకోసమే అక్కడ కాపురాలు పెట్టారు. ముఖ్యంగా ఆడ పిల్లల కోసం. వారిని చాలా జాగ్రత్తగా, అనేక కట్టుదిట్టాల నడుమ ఆ చదువుకు పంపించటం మొదలుపెట్టారు.

పాలెం యువకుల్లో చదువుకొని ఆ రకంగా పైకిరావాలనుకుంది చాలా తక్కువ. అక్కడ డాక్టర్లూ, ఇంజనీర్లూ, ఇంకా ఉన్నత పదవుల్లోకి వెళ్ళినవారు లేకపోలేదు. అలాంటివారిలెక్క లు తీసినా చాలా విశేషాలు తెలుస్తాయి. వీరందరూ స్వయంప్రతిభతో అలాఅయినవా రు కాదు. లక్షలాది రూపాయల డొనేషన్లు పోసి ఆయా విద్యలను కొనుక్కున్నారు. ఆ తర్వాత చదువుకోవాలని నిజంగా భావించినవారు పైకొ చ్చారు.

అంతకుమించి విద్య మానవ జీవితానికి ముఖ్యం అనే వాతావరణం అక్కడలేదు. ఇప్ప టికీ చాలామంది లెక్కలు నేర్చుకునేధోరణిలోనే ఉన్నారు. అదికూడా దళారులచేతిలో మోసపో నంతవరకు మాత్రమే. కొంతకాలంపాటు ఈ పరిణామం ఉంటే ఆ తర్వాతకాలంలో దేశంలో పెరిగిన నిరుద్యోగం వారిలో ఓ నిర్లిప్తతను పెంచింది. చదువు కేవలం ఉద్యోగసంపాద నకు ఓ మార్గం అని భావించిన వారికి అది ఆచరణలో నిజంకాకపోవటం చూశాక ఓ రక మైన స్తబ్దత. పైగా ఇంకోరకమైన ధోరణికూడా పెరిగింది. 'ఉద్యోగాలు రావాలంటే మనం ఈ కులాల్లో పుట్టకూడదు. ప్రభుత్వాలన్నీ ఎస్.సి, బి.సిలకు దోచిపెడుతున్నాయి' అనే నిర్ణయా




లకు రావటం జరిగింది.

ఇవన్నీ కలసి అక్కడివారిలో కొత్త ఆలోచనలను రేకెత్తించటమో, ఇతర రంగాలకు మళ్ళించటమో జరగలేదు. రవి లాంటి వారు కూడా చాలా తక్కువ. ఇతర కుటుంబాల్లో తాము ఇంతకాం శ్రమించి కూడబెట్టిన డబ్బును కుర్రాళ్ళని నమ్మి అంతత్వరగా బయటకు తీయటానికి సిద్ధంగా లేరు. అందుకే ఆ గ్రామాల్లో చెట్లకింద, చావిడికింద చేరి ఊసుపోక, చెత్తకబుర్లతో కాలక్షేపం చెయ్యటం. కనీస జీవితానికి ఎలాంటి ఇబ్బందులు లేవు కాబట్టి మొత్తంమీద రోజులు గడుపుతున్నారు. అలాంటివారందరూ తమ పెద్దల పాత అభిప్రాయాల్తోనే తామూ జీవిస్తున్నారు.

వారిలో చాలామంది చదువుకున్న ఆడపిల్లల్ని వివాహం చేసుకోవటానికి ఇష్టపడరు. అందులోనూ పట్నంలో ఉండే ఆడపిల్లల్ని చేసుకోవటం అసలే ఇష్టంఉండదు. ఇష్టం లేదనేకంటే భయం. అందుకే అక్కడ సంబంధాలు ఎక్కువగా ఆ చుట్టుపక్కలే తిరుగుతుంటాయి. అందుకు ఇంకో కారణంకూడా ఉంది. తాము సంపాదించిన ఆస్తులు విడిపోవటం అక్కడివారికి ఇష్టంలేదు. అందుకే ఆడపిల్లలుగానీ, మొగపిల్లలుగానీ పుట్టడంతోనే వారి సంబంధాలు ఖాయంఅయిపోయేవి. ఏ జంటనుచూసినా ఏదోఒక చుట్టరికం కనపడుతుండేది. 'పాలెం'లో బయటినుండి వచ్చినవాళ్ళు చాలా తక్కువ. వారికి ఈ కట్టుబాట్లూ, ఆస్తుల విషయంలో వారు కఠినంగా ఉండటం గమనించినప్పుడు 'పాలెం' అంటేనే అసహ్యం కలిగేది.

'పాలెం' యువతీయువకులు చాలామంది బలవంతంగా కాపురాలు చేస్తున్నారు. తమతమ ఆస్తుల్ని కాపాడుకోవటానికి ఇష్టాల్తో సంబంధంలేని పెళ్ళిళ్ళు చేయటం అందుకు కారణం. ఇంకా ఈ ఆస్తులు కాపాడుకోవటం అనే విషయాల్లో ఆ గ్రామాల్లో జరిగిన దారుణాలు సామాన్యంకావు. అవన్నీ వ్యక్తిగత విషయాలుగా చెప్పుకోవటం– ఆ పరిధినిమించి బయటకు రాకపోవటంతో బయటిప్రపంచానికి అంతగా తెలీదు.

చాలా గ్రామాల్లో ఇలాంటి పరిస్థితులే ఉండొచ్చు. కానీ అమ్మ ఇంతగా ఆ గ్రామంగురించి భయపడటానికి దాఖలాలు అక్కడ ఉన్నాయి. ఆస్తులకోసం స్వంత మనుమల్ని విచక్షణారహితంగా దాడులు చేసి హింసించటం, చంపుకోవటం దాకా అవి వ్యాపించాయి. కొన్ని కుటుంబాల్లో తల్లిదండ్రులు తమ బిడ్డల్లో ఏదోఒక పక్షం వైపే మొగ్గుచూపేవారు. కోర్టులచుట్టూ తిరగటంలో 'పాలెం' ప్రజలు తక్కువవారుకాదు. ఆస్తులకు చెందిన అనేక కేసులు కోర్టుల్లో ఉన్నాయి.

ఎంతడబ్బున్నా అక్కడి ముసలివారు తమ చివరికాలంలో తమను చూడరనే అభద్రతాభావంతో ఉండేవారు. అందుకే తమపేరుతో కొన్ని ఆస్తులు, బంగారం ఉంచుకోవటం ఎవరైతే తమనిచూస్తే తమ తదనంతరం వారికి చెందుతాయని చెబుతుంటారు. కేవలం ఈ డబ్బు కారణంగానే ముసలివారిని పెట్టిన ఇబ్బందుల గురించి విన్నప్పుడు అమ్మ భయాలకు కారణం ఏమిటో అర్థమైంది.

మిగతాచోట్ల అందరూ తమతమ తల్లిదండ్రుల్ని బాగా చూస్తున్నారనికాదు. కానీ పాలెంతో పోల్చుకుంటే చాలా మెరుగే చాలాచోట్ల. 'పాలెం' కంటే కరుడుగట్టిన గ్రామాలు చాలా ఉండిఉంటాయి. 'పాలెం' రోడ్డు విషయంలో నాకు అర్థమైన వాటిల్లో ఈ ఊరులో స్పష్టంగా లోపించింది విశాల దృక్పథం. తోటి మానవుడ్ని ప్రేమించగలగటం.

డబ్బును మాత్రమే ప్రేమించగలవారెవరైనా బయటి ప్రపంచంతో సంబంధాలు పెంచుకోవటానికి అంగీకరించరు. ఓవేళ అంగీకరించినా అది కూడా తమ డబ్బును పెంచుకోవటానికి ఉపయోగపడేవి అయి ఉంటాయి. లేదా తమ డబ్బు విషయంలో ఇబ్బంది పెట్టనివి అయి ఉంటాయి. ఈ ప్రపంచంలో డబ్బుండటాన్కి మించి గొప్ప అర్థతేం వారి దృష్టిలో ఉండదు. తామేం చేసినా తమ డబ్బు కాపాడుతుందనే ధీమా వారికి ఉంటుంది. తాము కొత్త విషయాలు తెలుసుకోకపోయినా, ఈ ప్రపంచంలో జరుగుతున్న పరిణామాల గురించితెలుసుకోలేకపోయినా వారేం చింతించరు. ఇంకా విచిత్రం ఏమిటంటే వారు తమ చుట్టూ ఓ వర్గాన్ని



సృష్టించుకుంటారు.

వారు నిరంతరం తమకు భజనచేయాలి. తామేం చేస్తే అది అద్భుతం అనాలి. అందుకు ప్రతిఫలంగా తాము తినేవాటిలో, తాగేవాటిలో కొంతభాగం రాలుస్తుంటారు. వారి అజ్ఞానమే వారి ప్రతిభగా కీర్తిస్తుంటారు. లేకపోతే కృష్ణమూర్తి రోడ్డు లేకపోవటానికి చెప్పిన కారణాల్లో దొంగలు రాకపోవటం ఒకటంట.

పాలెం ప్రజల దృష్టిలో దొంగంటే అర్ధరాత్రి, అమావాస్య, శరీరమంతా నల్లటి మసీ, దట్టంగా నూనె పట్టించుకొని వచ్చేవారు. అలాంటి దొంగలు పాలెం రాకపోవచ్చుగానీ, అంతకుమించిన దొంగలున్నారు. ఒక్కసారి వెనక్కి తిరిగి మొత్తం ఈ గ్రామమంతా ఎంత నష్టపోతుందో తీరిగ్గా ఆలోచించగలిగితే కృష్ణమూర్తి గుండెలు నిజంగానే బద్దలవుతాయి. ఏ వేసవికాలంలోనో నా చిన్నతనంలో సెటిల్‌మెంట్ దొంగలు వస్తుండేవారనుకునేవాళ్ళం. వాళ్ళకు దొరికేది చాలా స్వల్పం. మరి పాలెంలో ఉన్న ఘరానాదొంగలు దోచుకునేది వారికెవరికీ బాధనిపించని రీతిలో ఉంది.

వీటన్నింటినీ వారెలా భరిస్తున్నారు? ఇతరుల్తో పోల్చుకోవటం ద్వారా. తమ ప్రక్క గ్రామాల్లో ఇన్ని కట్టుబాట్లు లేవు. అక్కడి ఆడవాళ్ళు కూడా మొగుళ్ళ మాటవినరు. ముందసలు వారికి కూడు పెట్టే దిక్కేలేదు. వారికి సంసారం కంటే బయటి విషయాలంటే ఇష్టం. అక్కడ ఆడవాళ్ళు సంఘాలు పెడుతున్నారు. అల్లికలూ, కుట్లూ అంటున్నారు. దాని ఫలితం మొగవాళ్ళు అనుభవిస్తున్నారు.

పాలెం రోడ్డుకు ఆటంకమైన విషయాల్లో మిగతా అంశాల్తో పాటు పురుషాహంకారం చోటు చేసుకోవటాన్ని గమనించినప్పుడు అనిపించింది. ఒకానొక అంశం చాలా చిన్నదిగా కనపడవచ్చు. అది అలా పరిణామం

చెందటం వెనక ఎన్నెన్నో అంశాలుంటాయి. వాటన్నింటినీ పరిగణించాలి. పాలెంరోడ్డు అంటూ పడితే... అది తెచ్చే మార్పులు ముందు స్త్రీల మీద పడతాయి. ఇప్పటివరకూ వంటింటికి పరిమితమైన వారు రేపటి నుండి వీధుల్లోకి వస్తారు. అంతవరకైనా పర్లేదు. వాళ్ళంతా ఇంకేమాత్రం తామేం అంటే అందుకు ఎదురు చెప్పకుండా ఉండే పరిస్థితి ఉండదు. ఇంకో భయం ఏమిటంటే...

స్త్రీలు కూడా వికృతంగా తిరగటానికి అలవాటు పడతారేమో. ఇప్పటివరకూ వ్యభిచరించటం అనేది పురుషుల సహజ లక్షణంగా గుర్తించబడుతోంది. అందుకు స్త్రీలకు బాధలే కపోలేదు. అయినా కూడా 'మొగాడు తిరక్క చెడ్డాడు. ఆడది తిరిగి చెడింది' అనే సామెత మాటున ఆ బాధను అణుచుకుంటున్నారు. అయినా మగాడన్నాక లక్ష తిరుగుళ్ళు తిరుగుతాడు. అయినా ఎప్పటిలాగే కుక్కలా పెళ్ళాం దగ్గరకు రావల్సిందే అనే ప్రచారం వివిధ రూపాల్లో సాగుతుంటుంది. ఆధునిక సమాజం అలాలేదు. పురుషులతో పాటు స్త్రీలూ సమానంగా తిరిగే రోజు కోసం కొందరు ప్రయత్నాలు ఆరంభించారు. పోరాటం చేస్తున్నారు. అదే కనక జరిగితే....

ఇంతకాలం కేవలం తమ స్వంత ఆస్తిగా భావించిన పెళ్ళాం... తన పేరు తప్పించి, తన రూపం తప్పించి మరొకరి గురించి ఆలోచించటమే భరించలేనితనం నుంచి, తానేం చేస్తున్నాడో అదేవిధంగా బరితెగించి ఇంకో పురుషుడితో ఆనందం అనుభవించటమా? ఇంకేమైనా ఉందా? ఈ ప్రపంచం ఇంక మనగలుగుతుందా? అప్పుడు మిగిలేది అరాచకం కాదూ? ఇలాంటి మార్పులు విరుచుకువడేకంటే అసలు రోడ్డు లేకపోతే ఏమిటి? ఇప్పటికే కాదు. ఎప్పటికీ రోడ్డు అవసరం లేదు.

చినమావగారుగానీ, మరొకరుగానీ 'నీకు తెలియదులే' అని అనటం వెనక ఇలాంటి కారణాలే ఉన్నాయి. అవి ఒక్కొక్కరికి ఒక్కోరకంగా ఉన్నాయి. అలాంటివన్నీ ఇతరుల భయాల్ని కూడా తమతో కలుపుకుంటాయి. అప్పుడు భయాల సంఖ్య పెరిగిపోతూంది.




అలా పెరిగిపోతున్న కొలదీ 'రోడ్డు' అంతకంతకూ దూరమవుతూ ఉంటుంది. ఇంత కాలం జరిగిందదే. పురుషులకు చెందిన కొన్ని భయాలు అర్థం చేసుకునే ప్రయత్నం చేశాం. మరి ఇంక స్త్రీల పరిస్థితి ఏమిటి? వారెందుకని ఈ రోడ్డు విషయంలో మౌనంగా ఉంటున్నారు. ఎందుకని రోడ్డును కావాలని కోరుకోవటంలేదు. వాస్తవానికి 'పాలెం రోడ్డు'ను స్త్రీలు తలుచుకుంటే ఇంతకాలం అలా వదిలి ఉంచేవారు కాదు. వారు తలుచుకుంటే తమ బిడ్డల్నీ భర్తల్నీ కూడా ప్రభావితం చేయగలరు. అందుకే వారి ఆలోచనల గురించి నిశితంగా పరిశీలించాలి. వారి మనోభావాల్లో దాగిన భయాల్ని వెలికి తీయగలగాలి.

ఈ విషయంలో నేనూ హనుమంతరావు కొంచెం దీర్ఘంగానే చర్చించుకున్నాం. కొన్ని గ్రామాలకు కొన్ని సంప్రదాయాలుంటాయి. అలాగే కొన్ని జాతులకు కొన్ని లక్షణాలుంటాయి. అందరూ అలానే ఉంటారనేది కాదు. ఉదాహరణకు 'ఆంధ్రులు ఆరంభశూరులు' అంటారు. ఇది పూర్తిగా వాస్తవం కాదు. అలాగని అబద్ధమూ కాదు. అలా కొంతమంది అభిప్రాయపడటానికి అవకాశాలొచ్చాయి. అలాగే కొన్ని మతాలవారున్నారు. ఒక్కోసారి కొందరు చేసే పనులవల్ల ఆయా మతాలవారు గాయపడతారు. అలా అంటున్నామంటే ఆ మతంలోని అందరూ బాధపడ్డారనికాదు. ఈ విధంగా చూసినప్పుడు కొన్ని కుటుంబాల వారు ఒకే ధోరణిలో ఆలోచిస్తారు. కొన్ని గ్రామాలు అదేరకంగా ఉంటాయి. జిల్లాలూ, రాష్ట్రాలూ, దేశాలూ ఆరకంగా ఉంటాయి. ముందే చెప్పినట్లు అందరూ సరిగ్గా అలానే ఆలోచిస్తున్నారని కాదు. ఎక్కువ భాగం. ఇవన్నీ మిళితం అయి.... విభిన్న వైరుధ్యాల నడుమ ఈ సమాజం ముందుకు వెళ్తుంటుంది.

ఎక్కడిదాకానో ఎందుకు మా అక్క విషయం తీసుకుంటాను. తను గతంలో స్వతంత్రంగా ఆలోచించేది. ఈనాటికి కూడా ఆమెలోని స్వతంత్రభావాలు మృగ్యమైపోయాయని కాదు. తను పాలెం వచ్చింది. తనకు ఇష్టంలేని పనులు కూడా చేయవలసి ఉంటుంది. మొదట్లో అందుకు తన అభ్యంతరం చెబుతుంది. ఇది ఈ ఊరు సంప్రదాయం అని పది మంది చెప్పినప్పుడు

ఏమవుతుంది? రాజీపడుతుంది. తను కూడా ఆ పద్ధతుల్నే అనుసరిస్తుంది.

చాలా భావాలూ, భయాలూ కూడా అంతే. వాటి గురించి లోతుగా ఆలోచించనంతకాలం. వాటి విభిన్న కోణాల గురించి చర్చించనంత కాలం వాటి మార్పుకోసం ముందుకురాలేం. ఓ భావంగానీ... భయంగానీ - మన మీద దాడి చేస్తోంది... మన జీవన విధానాన్ని శాసిస్తోంది. ఇందువల్ల మన్తోపాటు మనవారూ ఎంతో నష్ట పోతారు. దీన్ని ఎదుర్కోవాలి అనే ఆలోచన కలిగేంతకాలం ఆభావాలూ, భయాలూ మను మల మీద దాడి చేస్తూనే ఉంటాయి.

అలాంటి ఆలోచన ఎలా కలుగుతుంది? అకస్మాత్తుగా వస్తుందా? రాదు! ఏ ఆలోచన కూడా ఆకాశం నుండి ఊడిపడదు. అందుకు కొంత ప్రయత్నం జరగాలి. అది వ్యక్తిగతంగా కావచ్చు. సామాజికంగా కావచ్చు. జీవితాను భవం మాత్రమే ఆలోచనల్ని రగిలిస్తుంది. అది ఎవరి జీవితానుభవమైనా కావచ్చు. సిని మాలుగానీ, సాహిత్యం గానీ, మరోటిగానీ జీవి తానుభవాలే. చాలామందికి ఓ అనుమానం వస్తుంటుంది. ఈనాటి సినిమాలూ, సాహిత్య మూ ఇవన్నీ జీవితానుభవం నుండే పుడుతు న్నాయా? జీవితంలో ఇంత వికృతత్వం ఉందా? అసలు ఇది మన జీవితమా?

నిజమే. మనం చూసేదీ, చదివేదీ మన జీవితానుభవం కాదు. ఇక్కడ 'మన' అంటే అర్థం ఏమిటి? మన భారతీయులదనా? మన ఆంధ్రులదనా... లేక మా జిల్లాదా.. పాలెందా.. ఇంకా మాట్లాడుకోవాలంటే వ్యక్తి, కుటుంబం, నివశించే ఊరూ... అక్కడినుండి జిల్లా, రాష్ట్రం, దేశం, విశాల ప్రపంచం ఇవన్నీ అంతకంతకూ మానవుడు ఎదుగుతూ వెళ్లే మెట్లు. ఇందులో ఏది లోపించినా, ఏది అధికమైనా ప్రమాదమే.

వ్యక్తి తనను తాను ప్రేమించుకోగలగాలి. తన మెరుగైన జీవితంకోసం పోరాడాలి. కుటుంబం తన సభ్యుల నడుమ ప్రేమానురా గాల్ని పెంపొందేలా చూడాలి. ఒకరికోసం ఒక రు త్యాగం చేసే, తపించే అవగాహన ఉండాలి. అలాగే గ్రామమూ, దేశమూ, మానవ ప్రపంచమూ కూడా.

జీవితంఅంటే అది ఒక్కరికే స్వంతమైంది కాదు. జీవితానుభవమూ అంతే. అది మానవ జాతి ఉమ్మడిసొత్తు. ఎవరి జీవితానుభవమూ వారి సొంతంకాదు. ఇతరుల జీవితానుభవా లకు అతీతంగా అది స్వతంత్రంగా ఉండజా లదు. అంతేకాదు. జీవితంలో ఉంది. అంతా మంచేనా? అంతా చెడేనా? వీటన్నింటిని మేళ వించుకొంది జీవితం. అందుకే కొన్నిచోట్ల అది అద్భుతంగా ఉంటే, మరికొన్ని చోట్ల వికృ తంగా ఉంటుంది.

జీవితంలోనిఅందమూ శాశ్వతం కాదు. వికృ తమూ కాదు. అందుకే మనం అన్నింటినీ పరిశీలించాలి. మనకు ఏది అవసరమో దాన్ని గ్రహించాలి అనవసరమనుకున్న దాన్ని వదలి పెట్టాలి.

నేను కొంతమందిని గమనించాను. వారు చాలా ఎదిగారు అనటానికి నాకేం అభ్యంతరం లేదు. ఆ ఎదుగుదల ఎంతస్థా యికి పోయిందంటే వ్యక్తి, కుటుంబం, రాష్ట్రం, దేశం వీటిని అభిమానించటం వారి దృష్టిలో చాలా సంకుచితంగా కనిపిస్తుంది. ఓ వ్యక్తి తన ఒక్కడి గురించే ఆలోచించుకోవటం, తనకు తాను అమితంగా ప్రేమించుకోవటం, తన బాగుకోసం ఏమైనా చేయటం... వీటిని ఆమోదించలేం.

పాలెం ప్రజలందరూ తమ గ్రామాన్ని ప్రే మించాలి. అయితే తమ గ్రామాన్ని మాత్రమే ప్రేమిస్తే ఇంక వారిగురించి మాట్లాడుకోవటాని కి చాలా తక్కువ ఉంటుంది. కొన్ని వేల సంవత్సరాల తర్వాత మొత్తం ప్రపంచానికి హద్దులంటూ లేని రోజు వచ్చినా కూడా ఈ వ్యక్తిగత... కుటుంబ... దేశభావనలు సొంతం హరించుకుపోవు. విశ్వమానవుడంటేఅర్థం వీట న్నింటికి అతీతుడని కాదనుకుంటాను నేను. వీటన్నింటినీ సమపాళ్లలో మేళవించటం. పాలెం ప్రజల్లో తమ గ్రామాన్ని ప్రేమించటం అనేది గుడ్డిగా ఉంది. వారికి చెందిన భావనల న్నీ ఇరుకుగా ఉన్నాయి. చాలా కొద్దిమంది మాత్రమే ఈ గ్రామాన్ని షరత్తుల్తో ప్రేమించగ లుగుతారు. ఈ ఊరికి అందం ఉంది. ఇక్కడ బంగారుపంటలు పండుతాయి. ఈ చెట్లమీద కురిసే వెన్నెల బాగుంటుంది. ఇక్కడి కొబ్బరికా యల నీళ్లు మధురంగా ఉంటాయి. బావికు

లైన వారికి ఈ వాతావరణం చాలా ఆనందం కలిగిస్తుంది...

నిజంగా రోడ్డంటూ పడితే ఈ ప్రశాంతత అంతా ఒక్కసారిగా ఎగిరిపోతుంది. ఈ దారంతా సిటీబస్సుల, లారీల ధ్వని కాలుష్యం తోనూ, రద్దీతోనూ నిండిపోతుంది. పాలెం అడ్డ రోడ్డు పక్కన చెట్లు ఎంత భయంకరంగా తయారయ్యాయో ఇక్కడా అలా అవుతుంది. ఈ బస్సులు తిరిగేటప్పుడు ఏక్సిడెంట్లు అవు తాయి. ఇవన్నీ వాస్తవాలే.

ఈ బాధలున్నాయని ఇవన్నీ మానేస్తామా? వీటితోపాటు కొత్తగా వచ్చే లాభాలూ ఉన్నాయి. మానవుడి జీవితం అంతకంతకూ విస్తృతం అవుతున్నప్పుడు ఇలాంటివాటిగురించి ఆలో చించటం హాస్యాస్పదంగా ఉంటుంది. ఉన్నా ఉండకపోయినా రోడ్డు తెచ్చే సమస్యలకు కూడా పరిష్కారాలున్నాయి. అది మాత్రం వాస్తవం. ఇవన్నీ వ్యక్తులుగా కొందరు గు ర్తించటం చాలదు. ఈ 'పాలెం' విషయం మాట్లాడుకుంటున్నాం కాబట్టి వీరంతా గు ర్తించాలి.

ఇదంతా ఇక్కడ స్త్రీల మనోభావాలగు రించి మాట్లాడుకోవాలనుకున్నప్పుడు చెలరే గిన భావాల పరంపర.

ఇక్కడ స్త్రీలు బానిసల్లా ఉంటారు. ఏమా త్రం వ్యక్తిత్వం లేకుండా ఉంటారు. అసలు ఈ రోడ్డు లేకుండా వీరిని అణిచి ఉంచటానికి పురుషులు చేస్తున్న కుట్ర.

ఇదంతా ఈ రకంగా కూడా విశ్లేషించవచ్చు. ఆ రకమైన విశ్లేషణలోకూడా కొన్ని వాస్తవా లుంటాయి. అంతకుమించి ఆ భాష చాలా ఉద్రేకింపచేస్తుంది కూడా. అయితే ఇక్కడ కావల్సింది ఆ ఉద్రేకంకాదు.

ఇక్కడి స్త్రీలు తమగురించి అలా ఆలో చించటంలేదు. వారికి ఒకటే దృష్టి. బాల్యంలో తల్లిదండ్రులు, పెళ్లి అయ్యాక భర్త, ఆ తర్వాత పిల్లలు, తమ సంసారం... గుట్టుగా కాపురం చేసుకోవటం, అందుకు సహకరించవ లసిందిగా భగవంతుడికి ప్రార్థన చేయటం. అందులో భాగాలే ఉపవాసాలూ, వ్రతాలూ, పూజలూ గట్రా అన్నీనూ. వారికి వేరే వినోదం అంటూ ఉండదు. సంవత్సరానికొసారి ఏ సిని మాకోవెళ్తారు. అదికూడా ఏ భక్తి సినిమానో అయి ఉంటుంది. కొంత ఆధునికత వచ్చింది కాబట్టి కొంచెం మంచి బట్టలు ధరించగలుగు తున్నారు. ఇదివరకు అదీ లేదు. వారికి కావల సింది తమ సంసారం హాయిగా గడిచిపో వటం.

తమ పిల్లలు చక్కగా చదువుకొని, వృద్ధిలోకి రావటం. తమ ఆడపిల్లలకు మంచి సంబంధాలు రావటం. ఇదేమంత సులభం కాదు. అసలు తమ చుట్టుపక్కల కొన్ని ఊర్లలో గాని, నగరాల్లో ఉంటున్న తమ చుట్టాల అను భవాలు గాని వేరే రకంగా ఉంటున్నాయి.

ఈ కుటుంబం కొంచెం ఫర్వాలేదులే అను కుంటే ఆ ఇంటాయన తాగుడికి అలవాటుప డుతున్నాడు. రోజుల తరబడి క్లబ్బుల దగ్గర కూర్చుని పేకాట **ఆడుతున్నాడు**. వేలాది రూపా యలు తగలెయ్యటం అలా ఉంచి ముందు కుటుంబ గౌరవం మంటలో కలిసిపోతుంది. ఎక్కడ పడితే అక్కడ అప్పులు చేస్తే కుటుంబం పరిస్థితి తారుమారవుతుంది. ఇవే కాదు. వాళ్లకి ఓ భార్య చాలటంలేదు. ఇంకా ఎవరో ఒకర్ని తెచ్చి వేరే కాపురాలు చేస్తున్నా రు. అంత భరించలేని వారు వ్యభిచరిస్తున్నా రు. ఫలితంగా కుటుంబాలకు కుటుంబాలే గుల్లయిపోతున్నాయి. చాలా కుటుంబాలకు బీటలుపడ్డాయి. ఎవరికి వారు నటిస్తున్నారు అంతే. ఇంకెంతోకాలం లేదు. అలాంటి కుటుంబాలన్నీ వీధులమీద కొస్తాయి.

అందుకే రోడ్డులేక పోవటం వారిని బాధించటంలేదు. రోడ్డు లేకపోవడంవలన వీళ్లంతా ఇక్కడ ఉంటున్నారు. రోడ్డు రావట మంటూ జరిగితే జరిగేది కళ్లకు కట్టిన ట్లుంటుంది. రోడ్డుతోపాటు ఊర్లోకి బస్సువ స్తుంది. బస్సు వస్తే మాత్రం ఓ రూపాయకి తీసుకెళ్లి టౌన్‌లో దించుతారు. ఇంక సాయంకా లంపూట చెట్లదగ్గర కూర్చోవటం అంటూ ఉండదు. టౌన్‌లో ఏ షాపు దగ్గరో కూర్చుంటా రు. కాదంటే సిన్మాలు చూస్తారు. ఇంకా మందు లషాపుల దగ్గరకు వెళ్తారు. ఇవన్నీ చేస్తుంటే ఇంతకుముందున్న ఆరోగ్యమూ ఉండదు. దాంతోపాటు రకరకాల జబ్బులొస్తాయి. ఇవన్నీ

ఓ ఎత్తయితే అసలైన ప్రమాదం ఇంకోటుంది. తాము రోజూ అనేక రకాల వ్యాపారాలు చూస్తుంటారు. డబ్బు ఊరికినే వస్తుందనిపిస్తుంది. ఆరుగాలం పనిచేసి, చెమటలు పిండితే సొంతం నోటికొస్తుందనటానికి లేదు. వానకో, వరదకో అది నాశనం కావచ్చు. అసలీ తలనొప్పంతా ఎందుకు... శుభ్రంగా కాపురం ఇక్కడికే మార్చి వ్యాపారం చేసుకుంటే బాగుండుననే ఆలోచనకు వస్తారు.

ఇక్కడుంటే సొంత ఇల్లు. పాడీపంట దొడ్డిలో కూరగాయలు పెంచుకోవచ్చు. మరక్కడికి వెళ్తేనో ఇళ్లకోసం వందలరూపాయలు కుమ్మరించాలి. అయినా ఇరుకు గదులు. స్వేచ్ఛగా వాడుకోవటానికి నీళ్ళు ఉండవు. పాల దగ్గర నుంచి అన్నీ కొనుక్కోవాలి. కూరగాయల ధరలు చూస్తే మతిపోతుంది. ఇంతచేసినా వ్యాపారం కలిసి వస్తుందని గ్యారంటీ ఏం లేదు. తెలివిగల వాళ్లకు మాత్రమే వ్యాపారాలు కలిసివస్తాయిగానీ అందరికీ కలసిరావు.

ఈ అభిప్రాయలన్నీ వారిలో కదలాడుతుంటాయి. అందుకే అక్కడి స్త్రీలు మనస్ఫూర్తిగా తమ ఊరికి రోడ్డును ఆహ్వానించలేకపోయారు. కానీ ఇదంతా ఇలానే ఉంటుందా... ఆ ఊర్లో రేడియోలున్నాయి. కొంతమందికయినా టీ.వీలున్నాయి.

తమ పిల్లలు చదువుపేరుతో బయటకు వెళ్తున్నారు. కాబట్టి కొన్ని అక్కడి భావాలను వెంట తీసుకువస్తారు. ఆగ్రామంలో పెద్దకులాల వారిని ఓ ఊపు ఊపిన సంఘటన ఇది.



పాలెంకు చెందిన 'వినయ్‌బాబు' విజయవాడలో గ్రాడ్యుయేషన్ చదువుతున్నాడు. అక్కడివారికి బంధువులుండటంతో ఆ ఇంట్లో ఉంచి చదివిస్తున్నారు. పిల్లాడు బుద్ధిమంతుడు. చదువు తప్పితే ఇంకే విషయంలోనూ ఉత్సాహం చూపించేవాడు కాదు. సినిమాలకు వెళ్లటంగానీ, చాటుమాటుగా సిగరెట్లు తాగటంలాంటివి గానీ లేదు. కనీసం పాలెంలో కుర్రాళ్లతో కూడా కలిసేవాడు కాదు. ఎప్పుడూ తనేమిటో... తన చదువేమిటో అంతే. అలాంటి వినయ్ ఓ రోజు సరాసరి ఓ అమ్మాయిని వెంటబెటుకొని పాలెం వచ్చాడు. ముందు అక్కడివారంతా విస్తుబోయారు. ఆ అమ్మాయి లంగా, ఓణీలాంటివి ధరించలేదు పంజాబీ డ్రెస్‌లో వచ్చేసింది. 'ఎవరా అమ్మాయి' అని మాత్రం అనుకున్నారు. ఏమైనా అనటానికి వారిదగ్గర పూర్తి సమాచారం లేదు. ఇంటిదగ్గర వాళ్లు కూడా ఈ అమ్మాయిని చూసి కంగుతిన్నారు. ముఖ్యంగా పాలెం ఆడపిల్లలంతా ఆ అమ్మాయికేసి ఆరాధనగా చూశారు. వారు సినిమాల్లో చూడనీ, ఎక్కడైనా పెళ్లిళ్లలో చూడనీ, రకరకాల ఫ్యాన్సీ దుస్తుల్లో ఆడపిల్లల్నీ చూస్తున్నారు. వారంతా సైకిళ్లు తొక్కటం, మోపెడ్ లాంటివి నడుపుకుంటూ స్కూల్‌కీ, కాలేజీకీ వెళ్లటం వారికి వింతగాకంటే సంతోషంగా అనిపించాయి.

కనీసం అలాంటి డ్రస్సులు తాము కూడా వేసుకుంటే బాగుండుననిపిస్తుండేది. ఇంట్లో అన్నయ్యలకు చెబితే ఏమిటాభోగం వేషాలు అని తిడతారని తెలుసు. అయినా అలాంటివేషాలు వేసుకున్న సిన్మాతారలకేసి ఆబగా చూస్తుండటం కూడా వారి అనుభవంలోకి వచ్చిందే. అలాంటిది ఆ అమ్మాయి ఓ దేవతలా తమ ఊరికి వచ్చింది. ముఖ్యంగా 'వినయ్' అంటూ మాట్లాడుతోంది. వారికి రోజూ అలవాటయినా 'ఏమే' 'ఒసేయ్' లాంటి పిలుపులు లేవు. చాలా హాయిగా కూర్చుని వివిధ విషయాలమీద మాట్లాడుకున్నారు. ఇద్దరూ కలసి పెళ్ళిపాలాలు చూశారు. ఆ అమ్మాయి పాలెం గురించి ఎన్నెన్నో విషయాలు అడిగి తెలుసుకొంది. కనీసం అక్కడున్న మూడురోజుల్లోనూ ఒక్కసారైనా చీరకట్టుకోలేదు. రకరకాల బట్టలు. తామెప్పుడూ అంతకు ముందు చూడనివి ధరించింది.

చుట్టుపక్కలవారికి ఏమైనా అనాలనే ఉత్సాహంకంటే ఆ అమ్మాయి వేషమే ఆక ర్షించింది. తమ పిల్లల్లా రెండుజడలు వెయ్య లేదు. చక్కగా జుట్టుచు కత్తిరించుకొంది. ఆ అమ్మాయికి అలా కత్తిరించుకోవటం నప్పింది. చాలా అందంగా ఉందనిపించింది. ము ఖంమీద చిన్నబొట్టు బిళ్ల అంటించింది. ఇంకా ఓ చేతికి రిస్ట్‌వాచి పెట్టుకుంది. కాళ్లకు వేసు కున్న హైహీల్స్‌గానీ, గోళ్లకు పూసుకున్న నెయి ల్‌పాలిష్‌గానీ తామెప్పుడూ చూడనివే. అసలా అమ్మాయి ఇంగ్లీష్‌లో టకటకా మాట్లాడే స్తూంది.

వినయ్ అమ్మగారు "ఎవర్రా అమ్మాయి?" అంది రాగానే

"నాతోపాటే చదువుతోంది పేరు హరిణి. ఇంట్లో అందరూ 'మున్నీ' అంటారు. మన పాలెం చూడాలనుంది అంటే తీసుకువచ్చా ను"

"ఏమిటి అక్కడ ఆడపిల్లలూ, మొగపిల్ల లూ కలిసి చదువుతారా?"

"అవును"

"ఆడపిల్లలకు వేరే విడిగా చదువుకోవటా నికి ఉన్నాయనుకుంటాను కదా"

"ఎందుకుండవూ"

"మరి ఈ అమ్మాయి అక్కడ ఎందుకు చేరలేదు"

"అందరూ అక్కడ చదవాలనేముంది. ము న్నీకి ఇక్కడ సీటొచ్చింది చేరింది"

"ఆ అమ్మాయి ఏంచదువుతోంది"

"నేను చదివేదే బిఎస్సీ"

"అదిసరేరా నిన్ను 'వినయ్' అని పిలు స్తుందేమిటి?"

"మరింకేమని పిలవాలి?"

ఏమని పిలవాలో ఆమెకూడా చెప్పలేకపో యింది.

"అదీ సరేరా ఈ అమ్మాయి ఇంటిదగ్గర చెప్పకుండా వచ్చిందా?"

"చెప్పకుండా ఎందుకువస్తుంది?"

"అంటే వాళ్ళు పెద్దమనిషయిన అమ్మా యిని నీతోపాటు ఇచ్చి పంపించారన్నమాట"

"ఏమవుతుందంట. వాళ్లకి వాళ్లమ్మాయి మీద ఆమాత్రం నమ్మకం ఉంది. నన్నడిగితే అడిగావుగానీ ఆ అమ్మాయిని అలా అడక్కు"

"నేనెందుకు అడుగుతాను" అంటూ ఉలి క్కిపడింది.

ఆమెకు ఇదంతా అగమ్యగోచరంగా ఉంది. ఈ ఊర్లోనే తన పిల్లవాడంత బుద్ధిమంతుడు లేడని ఆమెకు గర్వంగా ఉండేది. అసలు విజయవాడ పంపించటం కూడా తనకు ఇష్టంలేదు. తనబిడ్డలాంటి అమాయకుడు అలాంటిచోట బతకలేడని ఆమె నమ్మకం. అలాంటిది వాడు మాట్లాడుతున్న తీరే ఆశ్చ ర్యంగా ఉంది. ఆడపిల్లని పెద్దమనిషయ్యాక ఇలా పంపిస్తారా... ఇప్పుడు కొంచెం నయం. తన చిన్నతనంలో అయితే ఆడపిల్ల పెద్దమని షయిందనే విషయం బయటకు చెప్పుకోవటా నికి భయపడేవారు. అలా అయిన మరుక్షణం ఎప్పుడు పెళ్ళిచేసి ఓ అయ్యచేతిలో పెడ దామా అనుకునేవారు. ఇప్పుడు కూడా తమ ఊర్లో పుష్పవతయిన ఆడపిల్లలు గుమ్మందాటి బయటకురారు. స్వంత అన్నయ్యలతోనే మాట్లాడటానికి సిగ్గుపడతారు. అలాంటిది ఏకంగా అమ్మాయినిచ్చి షికారుకు పంపించా రంటే ఏమనుకోవాలి. ఈ విషయంలో ఇప్పటికే అందరూ గుసగుసలు చెప్పుకుంటున్నారు. అయినావాడు అలా అంటాడేమిటి? నమ్మకం ఉందంట. నమ్మకం ఉంటే చాలా? రేపేదైనా జరగరానిది జరుగుతుంది. అప్పుడు ఏడిస్తే వస్తుందా? అయినా పాలెం చూట్టమేమిటి? ఇదేమన్నా మహానగరమా... లేదా ఇక్కడేమైనా గుళ్ళూ, గోపురాలూ ఉన్నాయా? అసలు ఆ అమ్మాయి వస్తానందే అనుకో ముందు వాడికి బుద్ధి ఉండాలికదా" అనుకొని ఆలోచిస్తుంటే ఆమె మనసులోకి మెల్లగా ఓ ఆలోచన ప్రవే శించి పెద్దదైంది.

"అంతేనా? వీడికి అలాంటి ఆలోచన ఉందా? ఇద్దర్నీ పట్టుకొని అడిగేస్తే" అను కొంది. ఎందుకనోగాని తను తొందరపడలేదు.

"ఏం పిన్నీ ఎవరా అమ్మాయి" అంటే తను విననట్లే నటించింది.

"మీ చుట్టాలమ్మాయా?"

"అవునే పొయ్యిమీద పాలుపెట్టాను"





అనేసి వచ్చేసింది.

మూడురోజుల తర్వాత ఆ అమ్మాయిని టౌన్ తీసుకువెళ్ళి బస్సు ఎక్కించి వచ్చాడు.

"ఆ అమ్మాయిని ఒక్కదాన్నే పంపించావా?" అంది ఆశ్చర్యంగా.

"అవును భయమేముంది. తను విజయవాడలో దిగుతుంది. ఏరిక్షాలోనో ఇంటికి వెళ్తుంది" అన్నాడు.

"నాకు నీ పద్ధతేం నచ్చలేదురా" అంది

"నా పద్ధతా.... మున్నీ పద్ధతా?"

"ఆ అమ్మాయి సంగతి నాకెందుకు. అది వాళ్ల అమ్మా బాబూ చూసుకోవాలి"

"ఇంతకూ ఏమిటంటావ్?"

"మనఊరి సంగతి నీకు తెలుసుకదా. ఇలా నువ్వు ఎవరి అమ్మాయిల్నో తీసుకువస్తే ఏమనుకుంటారు?"

"చూడమ్మా. మున్నీ ఎవరో అమ్మాయికాదు. పెద్ద ఆఫీసర్‌గారమ్మాయి. వారంతా బాగా చదువుకున్నారు. మేం మంచి ఫ్రెండ్స్ కాబట్టీ... తనెప్పుడూ ఇలాంటి గ్రామాలు చూడలేదుకాబట్టి చూస్తానని అంటే వాళ్లనాన్నగారు సరేనన్నారు. ఇందులో తప్పేముంది. మన ఊరివాళ్లసంగతి నాకు అనవసరం. అలా అనుకునే వాళ్ళెవరో నాకు చెప్పు వాళ్లబ్బాయిలంతా ఆడపిల్లల్ని ఎందుకుగొడవచేస్తున్నారో నేనడుగుతా. నీకు తెలియదనుకుంటా పాలెం అమ్మాయిల్ని అల్లరిపెట్టే పాలెం అబ్బాయిలు చాలామంది ఉన్నారు. మన ఊరివారు అలాంటి వాటన్నింటికీ బాగానే తలూపుతారు. అయినా ఇది నా స్వంత విషయం. ఇందులో బయటివారు జోక్యం చేసుకుంటే నేను అంగీకరించను" అంటూ స్పష్టంగా చెప్పాడు.

"ఇంతకూ ఏమిటంటావ్?" అంది

"నేను అనేదేముంది. నువ్వేమంటావో చెప్పు" అన్నాడు.

"ఇంతకూ వాళ్ళెవరు?"

"అంటే"

"మన కులంవారేనా అని"

"ఏమో నాకు తెలియదు"

ఆమెకు ఏం మాట్లాడాలో అర్థంకాలేదు. ఈ విషయంలో వినయ్‌బాబు నాన్న ఏమీ పట్టించుకోవటం లేదు. అసలాయన ఏ విషయాన్నీ పట్టించుకోడు కూడా. వినయ్ తల్లికి తన కొడుకుని చదువు మాన్పించుదామా అనే ఆలోచన వచ్చింది. ఇప్పుడు అలాచేసినా ఊరంతా నవ్వుతారు. మరేం చెయ్యాలి... ఇంకా అక్కడే ఉంటే అసలు తమకు దక్కుతాడో... లేదో... ఆమెకు తన బంధువుల మీద కోపం వచ్చింది.

"వాళ్ళను నమ్మి చేతిలో పెట్టొస్తే ఇలానేనా చూడటం. వాడి ముఖాన రెండు ముద్దలు వేస్తే సరిపోయిందా" అనుకొంది. అంతలోనే పశ్చాత్తాపపడింది.

"నిజానికి వాళ్ళకి అనవసరమైన శ్రమకలిగించింది తను. వాళ్ళకి వాళ్ళ పిల్లల గురించి పట్టించుకోవటానికే తీరిక ఉండదు. అయినా జ్ఞానం వీడికుండాలి. తనెందుకు వెళ్ళింది. చదువుకుంటానికి. అయినా కనీసం ఏ కులమో తెలుసుకోకుండా ఈ స్నేహాలేమిటి? ఆడపిల్లల, మొగపిల్లల స్నేహాలా... అవ్వ"

వినయ్‌బాబు తిరిగి వెళ్ళేటప్పుడు మరలా చిన్నగొడవ.

"ఇకనైనా పిచ్చిపిచ్చి వేషాలు మానేసి శుభ్రంగా చదువుకో"

"చూడమ్మా నేనేం వేషాలు వెయ్యటం లేదు. బాగానే చదువుకుంటున్నాను. నువ్వు నన్నడగటానికి మొహమాట పడ్డావనుకుంటాను. మున్నీ అంటే నాకు చాలాఇష్టం. అలాగే ఆ అమ్మాయికి కూడా నేనంటే ప్రాణం. అయినా కూడా మేమేం తొందరపడదలుచుకోలేదు. మా చదువు పూర్తయినాక మేం పెళ్ళిచేసుకుంటాం. ఇంకనువ్వు బాధపడటం మానేస్తావా?" అన్నాడు.

అసలు బాధ అక్కడినుండి మొదలైంది. 'పాలెం'లో మొదట కులాంతర వివాహం బహుశా వినయ్‌బాబుదే అయ్యుంటుంది. అందుకు జరిగిన తతంగం అంతా ఇంతాకాదు. వినయ్ అమ్మ తను చనిపోగలనంటూ బెదిరించింది. నీ ఇష్టం అన్నాడు. 'నవమాసాలు మోసి కన్నానురా' అంది. అతను కరగలేదు. 'ఇదంతా మీ నాన్నగారు సంపాదించిన

ఆస్తి. నీకు చిల్లిగవ్వ రాదని తెగేసి చెప్పింది. వినయ్ తొణకలా. ఈ ఊరిలో బతుకుతూ ఈ సంప్రదాయాల్ని మంటగలిపితే చూస్తూ ఊరు కోరంది. వినయ్ చాలా స్పష్టంగా చెప్పాడు.

"ఇన్నిమాటలు అనవసరం. పాలెం ఎవరి స్వంతమూ కాదు. ఇంతకు ముందునుండీ ఇప్పటిదాకా అందరూ ఇక్కడికి బతకటం కోసం వచ్చినవారే. పెళ్ళి అనేది ఈ ఊరికి చెందిన విషయంకాదు. మా స్వంత విషయం. ఇందులో ఎవరో అంగీకరించటమనే సమస్యకాదు. అందుకే చెబుతున్నాను. వీళ్ళందరూ మిమ్మల్ని తలోమాట అంటారనుకుంటే నాతో వచ్చేయండి. లేదంటరా ఇక్కడే ఉండండి. ఆస్తులివ్వనసీ, అదనీ, ఇదనీ అనవసరం. మేం కలిసి జీవించటానికి నిర్ణయించుకున్నాం. అంతే. ఈ నిర్ణయాన్ని ఎవరూ మార్చలేరు"

వినయ్ పెళ్లి జరిగిపోయింది. దానికి ఎవరూ వెళ్ళలేదు. ఆ గ్రామాన్ని విడిచిపెట్టి వెళ్ళటానికి కూడా వినయ్ వాళ్ళ అమ్మా, నాన్నా అంగీకరించలేదు. తమకసలు కొడుకే లేడనుకుంటాం అనుకున్నారు. అలా ప్రశాంతంగా సాగిపోతున్న పాలెం జీవనంలో వినయ్ ఓ తుఫాన్ సృష్టించాడు. కానీ ఎవరికీ తెలియకుండా గుట్టుచప్పుడుకాకుండా పని పూర్తిచేశామనుకున్న మరో సంఘటన కూడా మా దృష్టికి వచ్చింది.

గాలిని బంధించటం ఎవరితరం అవుతుంది. ప్రపంచంలో ఏమూలన మంచి జరగనీ, చెడుజరగనీ అదంతా గాలిలా విశ్వవ్యాప్తమవుతుంది. అలాంటి సమాచారాన్ని తెలుసుకోకుండా ఉంచటం ఎలా ఎల్లకాలమూ సాధ్యంకాదో... కొన్ని పరిణామాల్ని ఆపాలనుకోవటమూ అలానే సాధ్యంకాదు.

వెంకట్రామయ్యగారు ఆ గ్రామంలోనే కాదు చుట్టుపక్కల కూడా బాగా పేరున్న వ్యక్తి. మొదట్నుండీ కాంగ్రెస్‌పార్టీతో ఆయనకు సంబంధాలున్నాయి. ఆ సంబంధాలను కూడా గౌరవప్రదంగా కాపాడుకుంటూ వచ్చాడు. జిల్లాలో అనేక రకాల గ్రూపులుండేవి. ఈనాటికీ ఉన్నాయి కూడా. అయితే వెంకట్రామయ్యగారు ఏ గ్రూపు పక్షానా ఉన్నట్లు చెప్పుకునేవారు కాదు. ముఖ్యంగా ఎన్నికలు వచ్చినప్పుడు అందరూ ఆయనచుట్టూ తిరుగుతుండేవారు. అందరితోనూ మంచిగానే ఉండేవారు వెంకట్రామయ్య.

పార్లమెంట్ ఎన్నికలప్పుడు ఎం.పీలూ మొదట వచ్చి వెంకట్రామయ్యగారింట్లోనే భోజనాలు చేసేవారు. అందులో ఆ ప్రాంతానికి చెందినాయన ఖచ్చితంగా ఎన్నికలప్పుడే చేతులు జోడించుకుంటూ వచ్చేవాడు. ఆయన వెంకట్రామయ్యగారిని బలవంతంగానైనా సరే తనతో తీసుకొని వెళ్ళేవాడు. కొన్ని సందర్భాలలో అసంతృప్తి బద్ధులై కొంతమంది ఇండిపెండెంట్స్‌గా నిలబడేవారు. అలాంటివారిలో కొంతమందికి జనంలో మంచిపేరు కూడా ఉండేది. అప్పుడు కూడా వెంకట్రామయ్యగారు ఒకటే చెప్పేవారు.

"వ్యక్తులుకాదు ఇక్కడ ముఖ్యం, పార్టీ. దీన్ని నిర్మించింది మహాత్ముడు. ఆయన బ్రిటీష్‌వారిని ఈ దేశం నుంచి బయటకి పంపించేదాకా నిద్రపోలేదు. అలాంటి పార్టీకి మనం ఓట్లు వేస్తున్నాం. ఇందులో క్రమశిక్షణ ఉండాలి. ఎవరికి సీటు ఇచ్చారా అనేది ముఖ్యం కాదు. ఓసారి పార్టీ తరపున ఒక వ్యక్తిని నిర్ణయించాక అతని విజయం కోసం మనం పనిచేయటం అవసరం. కాంగ్రెస్ పార్టీ దేశవ్యాప్తంగా ఉంది. అది ఈ దేశంలో ఉన్న ఏకైక పెద్ద పార్టీ. అలాంటప్పుడు సహజంగానే ఇందులో క్రమశిక్షణ ఉండాలి. ఎవరికి సీటు ఇచ్చారా అనేది ముఖ్యం కాదు. ఓ సారి పార్టీ తరపున ఓ వ్యక్తిని నిర్ణయించాక అతని విజయం కోసం మనం పనిచేయటం అవసరం. కాంగ్రెస్ పార్టీ దేశవ్యాప్తంగా ఉంది. అది ఈ దేశంలో ఉన్న ఏకైక పెద్దపార్టీ. అలాంటప్పుడు సహజంగానే ఇందులోకి అనేకమంది వస్తుంటారు. రావద్దని ఆపటం కూడా ఎవరితరమూకాదు. అలా వచ్చేటప్పుడు కొంత చెత్తసరుకు కూడా వస్తుంటుంది- మనం భరించాలి"

ఇలాంటి ధోరణిని వెంకట్రామయ్యగారు అన్ని విషయాలలోనూ అనుసరించారా? ఖచ్చితంగా లేదు. ఆయన గాంధీయవాదే. కానీ కరుడుగట్టిన గాంధేయవాది కాదు. లౌకికుడైన





గాంధేయవాది. ఆయన గాంధీతత్వం అంతా ఎప్పుడూ ఖద్దరు ధరించటంలోనే కనిపిస్తుంది.

ఆయన ఎంత ప్రశాంతంగా కనిపించినా, ఘర్షణ వాతావరణాన్ని ఇష్టపడకపోయినా ఆయన నిర్వహించిన పాత్ర మాత్రం మా దృష్టిలో వివాదాస్పదమైంది. గ్రామాన్ని కుదిపివేసే సంఘటనల్లో ఏనాడూ ఆయన తన వాదంతో ప్రత్యక్షంగా రాలేదు. గ్రామానికి చెందిన అవసరాల విషయాల్లో ఆయన ముందుండి మార్గదర్శకత్వం వహించిందీ లేదు.

ఆయన్ను అభిమానించేవారు చెప్పేదేమిటంటే ఆయనకెప్పుడూ నాయకత్వం వహించాలని లేదు. పదవుల మీద దాహం లేదు. అదే ఉంటే ఆయనకు ఏనాడో సీటు వచ్చేది. మంత్రి కూడా అయ్యేవారు. నిజమే. ఆ మాటల్లో కొంత వాస్తవం లేకపోలేదు. అయితే ఆ కారణాలు కూడా పూర్తి వాస్తవాలు కాదు.

రాజకీయచదరంగంలోకి అడుగుపెట్టడం అంటూ జరిగితే సంభవించే పరిణామాలు రెండు. మొదటిది ఆ ఊబి నుంచి బయటపడలేకపోవటం. రెండోది రాజకీయాల్లో అందరినీ సంతృప్తిపరచటం ఎవరికీ సాధ్యంకాదు. తనూ, తనచుట్టూ వున్న జనం అంతకంతకూ అందులో కూరుకుపోతారు. అప్పుడు ఇంకేమాత్రం 'స్వచ్ఛమైన నాయకుడిగా' ఉండటం కష్టం. వీటన్నింటినీమించి క్షణం తీరిక ఉండదు. ఉన్న పదవిని ఎలా నిలుపుకోవాలి? తన వక్కవాడు ఎదగకుండా ఎలా చూడాలి? తను ఇంకా పైపైకి ఎలా వెళ్ళాలి? ఇలాంటి ఆలోచనల్తో, కార్యక్రమాల్తో జీవితం చాలా కోల్పోవాల్సి ఉంటుంది. చాలా వదిలేయాల్సి ఉంటుంది.

అంత హీనంగా దిగజారటానికి వెంకట్రామయ్యగారు సిద్ధంకాలేదు. ఆయనకి ప్రశాంతమైన జీవనం కావాలి. ముఖ్యంగా కుటుంబజీవితం కావాలి. వాటితోపాటు అవసరమైనప్పుడు సాహిత్యం కావాలి. వేదాంతం కావాలి. తనీ ప్రపంచంలోకి వచ్చినందుకు 'సొంత లాభం కొంత మానుకొని పొరుగువాడికి తోడ్పడాలి' అదీ ఆయన సిద్ధాంతం.

'పాలెం' చరిత్రలో వెంకట్రామయ్యగారిది విశిష్టస్థానం. ఆయన ఇంతకాలం నిర్వహించిన పాత్రపట్ల అక్కడ వారికి సంతృప్తి ఉంది. కానీ ఆయన మీద ఎప్పుడూ అలాంటి భావాల్తోనే ఉండరు.

ఆయన లౌకికత్వం ఆయన జీవన విధానంలోనే కనిపిస్తుంది. ఆయన పిల్లలు మంచి చదువులు చదివారు. ఒకతను మాత్రం హైదరాబాద్‌లో ఓ చిన్న పరిశ్రమను నెలకొల్పాడు. ఇంకో అబ్బాయి మంచి ఉద్యోగంలో ఉన్నాడు. ఆయన మనవడు విదేశాల్లో చదువుకుంటున్నాడు. వెంకట్రామయ్యగారు సతీసమేతంగా ఈ ఊర్లన్నీ తిరుగుతుంటారు. అక్కడ కూడా ఆయన పెద్దమనిషిగా గౌరవించబడుతుంటారు. అలాగే తన అల్లుళ్ళు కూడా మంచి మంచి వ్యాపారాల్లో ఉన్నారు. వారంతా ఆయన్ని పాలెం వదిలి తమతో ఉండటానికి వచ్చేయమంటుంటారు.

అలాగే పండితులూ, కవులూ తాము జరిపే కవి సమ్మేళనాలకి వెంకట్రామయ్యగార్ని ఆహ్వానిస్తారు. ఎక్కువగా ఆయన ఆయా సభలలో అధ్యక్షస్థానం వహిస్తుంటారు. చాలా వినమ్రంగా చెబుతుంటారు. "నేను కవిని కాదు. పండితుడ్ని కాదు. ఇలాంటి సభలకు నన్ను పిలవటం అన్యాయం అని ఎంత మొత్తుకున్నా వినరు. అయితే నేను మీకు ఏదో చెప్పటానికి రాలేదు. మీ అందరితోపాటు ఈ కవి పండితులు చేసే గానం విని అనుభూతి చెందాలని వచ్చాను. భోజరాజు ముఖం చూస్తే కవిత్వం చెప్పాలనిపించేదట. అలాగే ఈ పండితుల్ని చూశాక నాలోనూ కవితావేశం వచ్చింది. ఈ పద్యం రాశాను" అంటూ ఒకటో అరో చదివి ముగించేవారు.

ఆయనకి ఈ విషయంలోనూ మంచిపేరుంది. వెంకట్రామయ్యగారిని అధ్యక్షుడిగా పిలుచుకుంటే హాయిగా ఉంటుంది. ఆయన గంటలు గంటలు మాట్లాడరు. ఎవరికీ ఇబ్బంది కలిగించరు అని....

పాలెం దగ్గర టౌన్లోనే ఇంకా ఒకరిద్దరు ఆస్థాన ఉపన్యాసకులున్నారు. అందులో ఒకాయన రష్యాకూ, మరొకాయన అమెరికాకూ వెళ్ళి వచ్చారు. పాపం వారిని అనుకోవటానికి లేదు.




ఆయా దేశాల్లో తామేం చూశారో అవన్నీ వివరించాల్సిన బాధ్యత తమ మీదా కూడా ఉంది. అలాంటప్పుడు నేను చూసిన రష్యానో, నే వెళ్ళిన అమెరికా అనో ఓ సభపెట్టి అయిదారు గంటలు కాకపోతే ఓ రెండు రోజులు జనానికి వివరించేస్తే బాగుంటుంది గానీ ప్రతిసభలోనూ ఈ విధంగా హింసించటం భావ్యం కాదు అని విమర్శించేవారున్నారు.

చాలామంది తాము ఓ కార్యక్రమం జరుపుతున్నామనే విషయాన్ని తెలియకుండా గోప్యంగా ఉంచుతారు. అయినా ఎలా పసిగడతాడో ఏమో 'అమెరికా' ఆయన మాత్రం వస్తాడు. 'రష్యా' ఆయనకు మాత్రం ఎప్పుడూ అంత తీరిక దొరకదు. ఆయన ఉద్యమరీత్యా ఎక్కడెక్కడికో తిరుగుతుంటారు కూడా. మైకు ముందుకు పిలిస్తే విషయంలోకి రావటానికి కనీసం పది నిముషాలు పడుతుంది. అప్పటికీ వెనకనుండి 'గురువు గారూ' అంటూ హెచ్చరికలు వినిపిస్తూనే ఉంటాయి. పోనీ కొత్త శ్రోతలు ఎవరైనా ఉంటే ఆయన ఉపన్యాసాన్ని వింటారనుకోవచ్చు. శ్రోతలూ వారే. ఉపన్యాసకులూ వారే. ఈ రకమైన హింసల నడుమ వెంకట్రామయ్యగారు చాలా పెద్దమనిషి.

ఆయన చాలా ప్రదేశాలు చూశాడు. ముఖ్యంగా గీతను వివరించటంలో ఆయనకాయనే సాటి అంటారు. అమెరికా ఆయన చూడందేం కాదు. రష్యా గురించి కూడా ఆయనకు తెలుసు. వారు మన రామాయణాన్ని తమ భాషలోకి అనువదించుకొని ఎంత సంతోషపడుతున్నారో తెలుసు. అయితే ఎంత తెలిసినా గంభీరంగా ఉంటారు. ఎంత అవసరమైతే అంతే చెబుతాడు. అన్నీ ఉన్న విస్తరిలాంటివాడు వెంకట్రామయ్యగారు.

మరి ఈయన గ్రామాభ్యుదయానికి ఏంచేయలేదా అంటే ఎందుకు చెయ్యలేదు. చాలా చేశాడు. గ్రామ సమస్యలకి తన దగ్గరకు వచ్చిన వారందరికీ నచ్చజెప్పేవాడు. ముఖ్యంగా ఆ గ్రామంలో 'గీతాపారాయణం' జరిగేది. రాత్రి అందరూ భోజనాలు పూర్తిచేసుకొని వచ్చాక ఆచార్యులగారి ఆధ్వర్యంలో గీతోపదేశాన్ని వివరిస్తుంటే పొంగిపోయేవారు జనమంతా. ఆ శక్తి భావనలో తడిసిపోయేవారు. గీతామృతంతోపాటు గాంధీజీ కన్న కలల గురించి వెంకట్రామయ్యగారు చాలా బాగా వివరించేవారు. అలా వినిపించటంతో రెండురకాలు ఉండేవి. ఓ ఉపదేశం అక్కడి మోతుబరులకి. రెండో ఉపదేశం అక్కడి కూలీలకు.

"మానవుడు తోటి మానవుడికి సాయపడాలి. స్వార్థాన్ని పూర్తిగా త్యజించమని నేను చెప్పను. 'సొంత లాభం కొంత మానుకోండి' అంతవరకు మాత్రమే నేను చెప్పగలను. ఈ దేశంలో అందరూ బతకాలి. సోదరుల్లా బతకాలి. వైషమ్యాలకతీతంగా బతకాలి. నీలో స్వార్థం పెరిగి పోతుందంటే అరాచకం మొదలవబోతుందని అర్థం. నీకింద పనిచేస్తున్న వారూ మనుమలే. వారికేసి చూడాలి. వారి జీవితాలు సాఫీగా సాగాలి. వారిని దయతో చూడాలి. నీకు అనవసరమైన దాన్ని వారికి అందించాలి. యజమాని ఎప్పుడూ సేవకుడి పట్ల కరుణ కలిగి ఉండాలి. మమకారం కలిగుండాలి. అప్పుడే నిన్ను అతడూ ప్రేమించగలడు. దౌర్జన్యంతో అన్ని పనులూ పూర్తి కావు. దౌర్జన్యం తిరిగి దౌర్జన్యాన్నే ప్రేరేపిస్తుంది".

ఈ మాటల్లోని ఆంతర్యాన్ని ఆ గ్రామంలో చాలామంది అర్థం చేసుకున్నారు. తమతమ ఆస్తులు కాపాడుకోవాలంటే కనీసం తమ అహాన్ని విడువగలగాలి. కూలీల్తో మర్యాదగా ఉంటే ఎంత పనయినా చేయించుకోవచ్చు. వారిని ప్రేమిస్తున్నట్లుగా కనపడాలి. ముఖ్యంగా వారికి పెరుగుతున్న తమ ఆస్తుల్ని చూసి ద్వేషం కలగకూడదు. అలా కలగకుండా ఉండాలంటే వారికి అప్పుడప్పుడు ఎంగిలి మెతుకులు విదల్చాలి.

మొత్తం పాలెం గ్రామంలో భూస్వాములకీ, కూలీలకూ ఇతర వర్గాలకూ ఘర్షణ తలెత్తకుండా ఉండటానికి వెంకట్రామయ్యగారు చేసిన ప్రయత్నం ఫలించింది. అక్కడ కూలీలు తమనేం చేస్తారో అనే భయంతోనే కాదు...ఓ రకమైన ప్రేమతో కూడా ఆ ఊరిమోతుబరుల్ని చూస్తారు. "వారి ఉప్పు" తిని బతుకుతున్నామనుకుంటారు. గ్రామంలోని మిగతా పరిస్థితుల్తోపాటు వెంకట్రామయ్యగారి 'ధర్మకర్తృత్వ సిద్ధాంత వ్యాప్తి' కూడా ఇందులో ఉంది.



కాగా వెంకట్రామయ్యగారు ఆధునికుడు. ఆయనకి విదేశీ పరిజ్ఞానాన్ని వినియోగించుకో వటంలో ఎలాంటి అభ్యంతరమూ లేదు. 'పాలెం'లో కుటీరంలాంటి ఇంటిలో ఉండగలడు. భాగ్యనగరంలో ఏ.సి రూముల్లో విహరించగల రు. గ్రాండ్ ట్రంక్ రోడ్లమీద మెత్తటి కారుసీట్ల మీద ప్రయాణం చేయగలరు. పాలెం గతుకుల బాటమీద ఎడ్లబండితో పరచిన గడ్డి మీదా కూర్చోగలరు. ఇంతగా అభివృద్ధి చెందిన ఈ ఆధునిక గాంధేయవాది ఎందుకని రోడ్డుకోసం పాటుపడలేదు. ఖచ్చితంగా ఆయనకు రానున్న పవనాల గురించి అందరికంటే బాగా తెలును.

పాలెం గ్రామానికి రోడ్డు వస్తే తను ఇంకేమాత్రం మర్యాదపూర్వకమైన పెద్దమనిషిగా ఉండలేదు. రోడ్డుతోపాటు ఆధునిక భావాల పరంపర ఓ వెల్లువలా వస్తుంది. అప్పుడు దూరంనుండి తను తటస్థంగా చూస్తూ ఊరకుండలేదు. ఏదో ఓ వైపు నిలబడాలి. తాము ఇంతవరకూ కాపాడుకుంటూ వస్తున్నవన్నీ ధ్వంసం కావచ్చు. ఇప్పటివరకూ తాము చెప్పేవాటిని మౌనంగా వింటున్న వారు ఆలోచిస్తారు. తమ వేదాంతాన్ని రాజకీయాన్ని ప్రతిదానీ్ని ప్రశ్నిస్తారు. ఆ వెల్లువ ఎంత దారుణంగా ఉంటుందంటే - ఇంతకాలం ఎవరినీ ఆలోచించనీయకుండా చేశారు. అడ్డుకట్టలు కట్టారు. ఒక్కసారిగా అవి తెగిపోతే ఏముంటుంది...ఆ ప్రవాహం అడ్డం వచ్చిన ప్రతిదానీ్ని నిర్దాక్షిణ్యంగా ధ్వంసం చేస్తూ వెళ్తుంది. భావాలూ అంతే.

మనకి చాలా భావాలు అరాచకంగా కనపడతాయి. ప్రశ్నించటం అనే మహత్తరమైన విషయాన్ని విచక్షణ లేకుండా వినియోగించటంలో ఆగ్రహమూ వ్యక్తం అవుతుంది. ఆ మొరటుదనానికి అసహ్యం కలుగుతుంది. దిగ్భ్రాంతి కలుగుతుంది. కానీ దానివెనుక కారణం ఏమిటి? జరగవలసిందేదో జరగలేదు. అందుకే ఈ భావ ప్రళయాలు...అందుకే ఈ ఉప్పెనలు. ఇవన్నీ సరైనవే అనుకున్నా... ఇదంతా చెత్త అనుకున్నా. మానవుడు పొరపాటు పడుతున్నట్లే. ఓ ఉప్పెన జన జీవితాన్ని ధ్వంసం చేయగలిగినంత మేరకూ ధ్వంసం చేసిపోవచ్చు. అంతటితో జీవితం ఆగిపోదు. మరుక్షణం నుండే పునర్నిర్మాణం ఆరంభం అవుతుంది. కావాలి. మానవ మనుగడకు తప్పనిసరి అంశమది. అది ఎంత త్వరగా జరుగుతుందనే విషయం ఎవరూ జ్యోతిషం చెప్పలేరు.

ఆధునిక సమాజాన్నీ గీతనూ అర్థం చేసుకున్న వెంకట్రామయ్యగారికి ఈ విషయం తెలియకుండా వుండదు. అయినా చూస్తూ చూస్తూ తాను అంగీకరించనివాటిని ఆయన ఆహ్వానించలేరు కూడా. ఈ గ్రామ చరిత్రవెనుక మేం అర్థం చేసుకున్న మేరకు వెంకట్రామయ్యగారి పాత్ర అది.

ఆయన గురించిన అంచనా సమగ్రం కాదని మాకు తెలుసు. మాకు అంటే ముఖ్యంగా నాకు. మేం వదిలేసిన అంశాలు ఇంకా చాలా వుంటాయి. మొత్తంమీద స్థూలంగా అయినా ఓ అంచనాకు రాగలిగామా అనేది ప్రశ్న. ఆ సంగతిని నేను వివరించటం బాగుండదు. ఇప్పుడు ఆ సంఘటన గురించి...

వినయ్ పెళ్ళి వ్యవహారం ఓ సంచలనమే. అయినా అక్కడివారికి కొంత ఉపశమనం కలగటానికి కారణం అతను పురుషుడు కావటం. అదే తమ కుటుంబాల్లో స్త్రీలకు జరిగితే...!

పాలెంలో ఓ మోతుబరి వుండేవాడు. ఆయన బంధువులమ్మాయి ఎవరో అబ్బాయిని పెళ్ళి చేసుకు వచ్చిందని విన్నాక అమాంతం బయలుదేరాడు. ఆయన్తోపాటు పాలెంకు చెందిన ఇంకో పెద్దాయన కూడా వున్నాడు. అక్కడకు వెళ్ళేసరికి ఆ కుటుంబం తీవ్రసంక్షోభంలో వుంది. ఆ కుటుంబంలో కొందరు సభ్యులు ఆ పెళ్ళిని ఆమోదిస్తుంటే మరికొందరు పరువుతీసింది అంటూ కుంగిపోతున్నారట. అలాంటి సమయంలో ఈయన వెళ్ళాడు.

ఆ కుటుంబంలో ఓ యువకుడ్ని పక్కకు తీసుకువెళ్ళి "ఏమిట్రా ఇదంతా" అన్నాడు.

"అవును బాబాయి తను వివాహం చేసుకొచ్చింది. అలాచేసి వుండాల్సింది కాదు. ముందు తనిలా చేసుకుంటానని చెప్పి వుండాల్సింది. అప్పుడు ఏం చేసేవాళ్ళమో. ఇంత ధైర్యంగా పెళ్ళి చేసుకొచ్చినప్పుడు మేం కాద

 

న్నా తప్పకుండా ఎదిరించి వెళ్ళేదికదా. అందుకే నేను బాధపడుతున్నాను. ఇప్పుడు అంతా జరిగిపోయింది. పెళ్ళి చేసుకొచ్చాక మనం చేయగలిగిందేం లేదు. తను ఇష్టపడి చేసుకుంది. రేపు ఎలాంటి ఇబ్బందులొచ్చినా తనే ఎదుర్కొంటుంది" అంటూ చెబుతుంటే తెల్లబోయి చూస్తూ అన్నాడట.

"అది సరేరా... మరి పెళ్ళిళ్ళు కావలసిన వారున్నారు కదా... మరీ విషయం తెలిస్తే... కొంచెం కష్టమౌతుందేమో" అంటూననుగుతుంటే.

"ఎవరి గురించి బాబాయ్... నువ్వు మాట్లాడుతుంది" అన్నాడా యువకుడు.

"మీ చెల్లెలి గురించి" అన్నాడు.

ఆ యువకుడు ఓ క్షణం మాట్లాడలేకపోయాడు. తామున్న పరిస్థితుల్లో వారు నైతికపరమైన మద్దతుకోసం ఎదురుచూశారు. "జరిగిందేదో జరిగిపోయింది. దేశంలో ఇలాంటివి మొదటిసారి కాదుజరుగుతున్నది. మీరేం బాధపడకండి" అనగలడని అనుకుని వుంటాడు.

అలా అనకపోయినా ఇబ్బందిలేదు. ఏం మాట్లాడకపోయినా అర్థం చేసుకునేవాడు. కానీ ఈ మాటల్ని ఊహించలేదేమో... కుర్రాడు కదా కళ్ళవెంట నీళ్ళు తిరుగుతుండగా అన్నాడు...

"బాబాయ్... ఈ విషయంలో మీరేం దిగులు చెందాల్సిన అవసరంలేదు. పెళ్ళిళ్లంటూ కాకపోతే మాకు కాకుండా పోవాలి. అయినా పెళ్ళి చేసుకున్నది మా అక్క. మీకు చాలా దూరంలో మేం వున్నాం. ఇంతకాలం మేమెలా బతుకుతున్నామో ఎవరికీ అవసరం లేకపోయింది. అయినా అక్క చేసుకుంటే మీ అమ్మాయికి పెళ్ళి కాకపోవటం ఏమిటి? మీదగ్గర చాలా డబ్బులున్నాయి. మీరు మీ అమ్మాయి పెళ్ళి విషయంలో ఆందోళనచెందాల్సిన అవసరంలేదు" అంటూ వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడంట.

"చూశావుటయ్యా వాడి పొగరు. అయినా ఏ మాటకా మాట చెప్పుకోవాలి. ఆడపిల్లకు చదువులు వద్దయ్యా అంటే వింటారా... ఓవేళ చదివించినా ఎంత జాగ్రత్తగా వుండాలి. ఏమైనా పాలెం పద్ధతి ఇంకోళ్ళకి రాదయ్యా... మన ఆడపిల్లల పద్ధతులు ఇంకోళ్ళకెందుకొస్తాయి చెప్పు. అయినా ఈ రోజుల్లో ఏం చెబుతాం. పెళ్ళి చేసుకునేటప్పుడు ఇటు ఏడు తరాలు అటేడుతరాలు ఎలా వుంటాయో చూసేవారంట వెనకటికి. దీన్నడ్డం పెట్టుకొని ఇంకో పాతిక పెంచమంటారు. ఇట్టాగా బతికేది... ఛ...ఛ... అసలు దేశమే చెడిపోయిందిలే" అని బాధపడిపోయాడట. దారంతా.

తమ ఊరిపట్లా, తమ పిల్లలపట్లా పాలెం ప్రజలకున్న నమ్మకానికిదో ఉదాహరణ. వారి దృష్టిలో పెద్దలు కుదిర్చిన సంబంధాలే అత్యుత్తమమైనవి. ఈనాడున్న కట్నకానుకలకు తూగలేక పెళ్ళిళ్ళు కాకపోయినా వారికి బాధలేదు గానీ ప్రేమవివాహమో, కులాంతర వివాహాలో వారి దృష్టిలో మహాదారుణమైనవి.

అలాంటిచోట... ఓ మోతుబరిగారమ్మాయి ఓ యువకుడ్ని ప్రేమించింది. అంతేకాదు నెల తప్పింది. వాళ్ళిద్దరూ నిష్కల్మషంగా ప్రేమించుకున్నారనటానికి నిదర్శనం ఆ అమ్మాయి ఆ అబ్బాయికి లేఖలు రాయటమంట. ఈ విషయం తెలిసి మోతుబరిగారి గుండెలు బద్దలయ్యాయ్... ముందా అమ్మాయిని వడేసి బాది వదిలిపెట్టారు. ఓ వరసలో నాన్న, తర్వాత అన్నా మధ్యలో తిట్లతో అమ్మా ఇలా...

తమ వంశం ఎంత ఘనచరిత్ర కలిగి వుందో... దాన్ని ఎలా భ్రష్టుపట్టించిందో తలుచుకుంటున్న కొద్దీ కుమిలిపోతూ కొట్టారు. ఆ ఆవేశంలో గొంతు పిసికి చంపిపారేయటానికి ప్రయత్నం చేశారు. పాపం ఆ అమ్మాయి ఏమీ మాట్లాడలేదు. అన్నింటినీ మౌనంగా భరించింది.

ఆ పిల్ల తల్లి తల్లడిల్లిపోయింది. ఈ విషయం తెలిస్తే చుట్టుపక్కల వారు ఎలా పొడుస్తారో ఆమెకు బాగా తెలుసు. పిల్ల చేసిన పనికంటే అదే బాధగా వుంది. అవును మరి ఇలాంటివి జరిగినప్పుడు తనూ అంతకంటే దారుణంగా ప్రవర్తించింది. ఆ పిల్లల్నీ ఆ పెంపకాల్నీ ఆ ఊర్లని కూడా తెగతిట్టిపోసింది. పాలెం గ్రామం చుట్టూ ఓ కవచం వుంటుందనుకొంది. తమ పిల్లల్లో ఇలాంటి

భావాలు ఏర్పడతాయని తను ఊహించనేలేదు.

ఓపికున్నంతసేపు తన్నాక ఆ గదిలో ఆ అమ్మాయిని పడేసి, ఇప్పుడేం చేయాలా అనేది చర్చించటం మొదలుపెట్టారు. మొదట ఆ ఇంటాయన భార్యమీద విరుచుకుపడ్డాడు.

"అసలిదంతా జరగటానికి కారణం నువ్వు. దాన్ని ఇంట్లో వుంచుదామంటే... సుబ్బయ్యగారమ్మాయి చదువుతోంది.. వెంకయ్యగారమ్మాయి చదువుతోంది అంటూ వెనకాల మొదలుపెట్టావు. ఇప్పుడు నీ కూతురు చదివిందిగా... మురిసిపో..."

"ఏమిటంత బిగ్గరగా మాట్లాడతారు. అందరికీ ఈ విషయం తెలియదనా... మీ కంత ఇదిగా వుంటే డప్పుచ్చుకు వెళ్ళండి. నేను చదువుకుంటానికి పంపించమన్నాను గానీ ఇలా చేస్తుందని తెలుసా? అయినా ఏరోజున మీరు పట్టించుకున్నారులే. ఎంతసేపూ... ఆ ఊరోళ్ళందరితో కూర్చుని కబుర్లు. ఎందుకో ఆ కబుర్లు. కూడూ గుడ్డకి రానివి ఎన్ని చెప్పుకుంటే ఏం లాభం..."

"ఛ...నోర్ముయ్" అరిచాడు.

"నా నోరు మూయించటం కాదు. రేపట్నుండి ఊరి నోరు మూయించాలి."

"దాన్ని గొంతు పికిసి చంపి ఆ నూతిలో పారేస్తా. నాకసలు ఆడపిల్లే పుట్టలేదనుకుంటా"

"అంతకంటే ఏం చేస్తావుమరి" అందామె.

"అంటే నీ ఉద్దేశమేంటి... ఆడెవడో కనుక్కొని ఆడిచేత మూడు ముళ్ళు వేయించమంటావా... నా గొంతులో ప్రాణం వుండగా అలాంటిది జరగదు.ఈ కుటుంబంనాశనమైపోయినా అలా జరగదు. అంతే"

"అసలా చిందులేమిటండి... మీ ఇష్టం వచ్చినట్లు చేయండి. లేకపోతే ఈ ఊర్లో గన్నేరు చెట్టుందిగా తీసుకురండి. అందరూ ఒకేసారి పోదాం" ఆ మాటల్తో ఆయన ఆవేశం తగ్గటం ప్రారంభించింది. ఆ తర్వాత ప్రశాంతంగా ఆలోచించారు. ఆ అమ్మాయి పెళ్ళి ప్రసక్తిలేదు. ముందు చేయించాల్సింది అబార్షన్...

ఏనాడూ గడప దాటటానికి ఇష్టపడని పిన్నిగారూ బయటకు అందులో పిల్లని తీసుకొని ఎందుకెళ్ళింది? వాళ్ళ వెనకాల బాబాయిగారు ఎందుకెళ్ళారు? అసలు ఆ ఇంట్లో తలుపులు వేసుకొని వారు చేసిందేమిటి? ఆ ముఖాల్లో వెలుగులు లేవెందుకని? నవ్వులు కరిగిపోయా యెందువల్ల? దీనివెనక జరగరానిది జరిగిందా? అదే జరిగి వుంటుందా?

అక్కడ ఆడవారిలో రకరకాల అనుమానాలు... వాటిని తీర్చుకోవటం కోసం పక్కవారి చెవిలో గుసగుసగుసలు...

ఆ అమ్మాయి గుండెలు పగిలేలా ఏడ్చిందో... తనలో పెరుగుతున్న బిడ్డను బలవంతంగా చంపుతుంటే విలవిలలాడిపోయిందో... ఏం చేసిందో... ఏమో ఓ జననాన్ని నిరోధించగలిగారు. ఆ అమ్మాయి అన్న 'రౌడీ'గా పేరు బడ్డ యువకుడు. వాడి నోరు తెరిస్తే బూతులు తప్ప మరోటిరావు. అందులోనూ కూలీ నాలీ జనం అంటే మరీ అలుసు. ఆ ఆడపిల్లలను ఏడిపించటం అంటే మహా సరదా. అలాంటి వాడికి తన పొట్టకొస్తే అక్షరం ముక్కరాకపోవడం తన వంశానికికొచ్చిన మచ్చుకాలేదు. వాడి నాన్నకూ అంతే. వాడ్ని ఏమైనా అనటానికి నోరు రాదు. మరి వారందరికీ లోకువ అయ్యింది ఆ అమ్మాయి.

ఆ అన్నగారు చెల్లి రాసిన ఉత్తరాల్ని సంపాదించుకొచ్చాడు. ఆ పిల్లవాడ్ని కొట్టించారో, ఇంకేమైనా చేశారో, బెదిరించి పంపించారో తెలియదు.

ఓ రాత్రివేళ... ఆ అమ్మాయి కళ్ళవెంట నీళ్ళే కారుతున్నాయో, రక్తమే కారుతుందో తెలీని క్షణాన ఆ అమ్మ గొంతు విప్పింది.

"నువ్వు తప్పు చేశావు. అందులోనూ ఈ ఊరిలో ఎవరు చేయని తప్పు నువ్వు చేశావు. ఎంత అమాయకత్వంతో చేశావో నీకు అర్థం కావటంలేదు. అయినా పెళ్ళి కాకుండా వాడెన్ని కబుర్లు చెప్పినా ఆడపిల్ల అంగీకరించవచ్చా? నీకు అలా చేస్తున్నప్పుడు మన కుటుంబం గుర్తుకు రాలేదా? మన ఊరిలో వారికి ఈ విషయం తెలిస్తే కాకుల్లా పొడుస్తారనే విషయం తెలియదా? మరెందుకిలా చే




శావ్? సరే అయిపోయిందేదో అయిపోయింది. మరో నెలరోజుల్లో నీ ఆరోగ్యం బాగు పడుతుంది. ఇంక వాడి విషయం మరిచిపో నీకు వేరే పెళ్ళి చేస్తాడు మీనాన్న. మాట్లాకుండా తలవంచు. మనం ఆడవాళ్లం. ఇంతకంటే ఏం చెయ్యలేం గుర్తు పెట్టుకో. రేపు నీకు ఆడపిల్లలు పుట్టొచ్చు. అయితే నువ్వు చేసిన తప్పు మాత్రం నీ పిల్లలు చేయకూడదు''

ఆ అమ్మాయి మాట్లాడలేదు. నూనె కూడా రాసుకోకుండా విరబోసుకున్న జట్టుతో పిచ్చిదానిలా ఉంది. ఆ తర్వాత ఎంతోకాలం జరక్కముందే ఆ అమ్మాయి పెళ్ళి చేసుకొని దూరంగా వెళ్ళిపోయింది.

ఈ విషయాలు అందరికీ తెలుసు. కానీ తమకు తెలిసిందనే విషయం తెలియనట్లుగా ప్రవర్తిస్తారు. అందరికీ ఈ విషయం తెలుసునని వాళ్లకీ తెలుసు. కానీ ఏం జరగనట్లే ప్రవర్తిస్తారు. అందరూ నవ్వుతూ మాట్లాడుకుంటారు. కాని ఒకరినొకరు వెక్కిరించుకుంటారు.

అందుకే ఆ గ్రామంలో సహజమైన నవ్వులుండవు. ఏదో కృత్రిమత్వం రాజ్యం చేస్తుంటుంది. అక్కడివారి అంతస్తులు నిర్ణయం అయ్యేది ఎవరికెంతుందనే దాని మీద ఆధారపడే. అలా లెక్కలు కట్టేటప్పుడు మొగపిల్లలు ఆస్థులుగానూ, ఆడపిల్లలు అప్పులుగానూ వస్తారు. ఆస్తి ఎక్కువగా ఉన్న వారిని చూస్తే ఎవరికి వారికి లోలోన ఈర్ష్య ఉంటుంది. తమకంటే తక్కువ ఉన్నవారిపట్ల చిన్న చూపు ఉంటుంది. ఇలాంటి లక్షణాలు తమకు ఉండటాన్ని వారు సమర్థించుకుంటారు. కానీ తమ దగ్గర పనిచేసే వారికి మాత్రం అనవసరం అనుకుంటారు.

పాలెం గ్రామంలో జరిగిన సంఘటన అదొక్కటే కాదు. 'కూలోల్ల' మాటల్లో చెప్పాలంటే ''అయన్నీ పెద్దాల్ల యవ్వారాలు''

నేను ఆశ్చర్యపోయిన అక్రమ సంబంధాలూ పాలెంలో ఉన్నాయి. అంతకంటే దారుణమైన విషయం ఏమిటంటే అక్కడ చాలా మంది కుర్రాళ్ళు సుఖరోగాల్తో బాధపడుతున్నారు. ఈ మాట వింటానికి నాకు జుగుప్స కలిగింది. అయినా ఇది విస్మరించలేని సత్యం.

ఇప్పుడనిపిస్తోంది... వీళ్ల అహానికి అర్థముందా? వీళ్ళు ఎంత భ్రమల్లో బతుకుతున్నారు. ఏ రోద్దు వస్తే తమ సాంఘిక జీవనం అల్లకల్లోలం అవుతుందని వారు కంగారుపడుతున్నారో... ఆ పరిణామాలు 'పాలెం'లోకి ప్రవేశించటాన్ని నిరోధించగలిగారా?

ఇక్కడ ప్రేమల్ని నిషేధించటమూ సాధ్యంకాలేదు. మరోదాన్ని ఆపటమూ కుదరలేదు. కానీ తమ అజ్ఞానంతో ఆధునికత తెచ్చే లాభాల్ని వదులుకున్నారు. వదులుకుంటున్నారు. ఎంత విషాదం!



ఇప్పుడు పాలెం ప్రజల మనస్తత్వం గురించి విశ్లేషించాలి. పాలెంలో చాలామంది ఉంటున్నారు. అయినా షావుకారు ఒక్కడే. మిగతా ఎవరిని షావుకార్లని అనరు. ఆయన తర్వాత 'చిన్న షావుకారు' ఉండొచ్చు. ఆ తర్వాత కొద్ది మంది ధనిక రైతులున్నారు. ఊర్లోని పొలంలో ఎక్కువ భాగం వారి ఆధీనంలోనే ఉంది. మరి మిగతా వారి పరిస్థితి ఏమిటి?

చాలామందికి ఒకటి రెండు ఎకరాలకు మించిలేదు. మరికొందరికి నాలుగైదు ఎకరాలుండొచ్చు. చాలామంది తమ పొలాల్లో పనులకు మనుషుల్ని పిలిచినా తాము కూడా పనిచేస్తుంటారు. అందరికీ సంవత్సరం పొడుగునా పనిచేసే పని మనుషులు లేరు. గొడ్డూ గోదా కూడా షావుకారికే ఎక్కువ. ఎక్కువమంది ఒకటి రెండు గేదెల్ని పెట్టుకున్నా మజ్జిగ కోసం, కాఫీల కోసం వాడుకున్నవి మినహాయిస్తే అమ్ముకోవడం తక్కువే. వ్యాపారపరంగా

గొడ్లను మేపుతోంది పెద్దరైతులే.

చిన్న చిన్న రైతులకి అవసరానికి అప్పులు ఇచ్చేసి. కళ్ళాల్లో ధాన్యాలు కొలిపించుకొనేది వారే. ఇంకో చిత్రమైన అంశం కూడా ఉంది. ఈ సన్నకారు రైతులు పంటలకోసం రుణాలు తెచ్చుకుంటారు. అవి చేతికందటానికి ఇబ్బందులు పడలేని వారు డబ్బున్న వారినే ఆశ్రయిస్తారు. తిరిగి అప్పులు పుట్టాలంటే వాటిని సక్రమంగా తీర్చాలి. వారెంత అభిమానం కలిగి ఉంటారంటే తాము తినకపోయినా అప్పులు ముందు తీరుస్తారు. 'ఒకరి సొమ్ము ఎగెయ్యటం' వారి దృష్టిలో పాపం. అది తమ బిడ్డలకు శాపంగా పరిణమిస్తుంది.

ఈ భయాలు పెద్దవారికుండవు. వారు తమ పొలాలకు కట్టవలసిన వేవీ కట్టరు. వారిని అడగటానికి కూడా సిబ్బందికి భయం. సంవత్సరాలు అలా గడుస్తూనే ఉంటాయి. ఈలోగా వానలధికంగా కురవటమో, అసలు కురవకపోవటమో, తుపాన్లు రావటమో చేస్తాయి. చెల్లించాల్సిన అప్పుల్లో కొంతభాగం రద్దు కావటమో, వాయిదా పడడమో జరుగుతుంది. అవన్నీ ఉపయోగపడేది ఎవరికి? షావుకారుకి. ధనిక రైతుకి. మిగతావారంతా వారి దగ్గరకే చేరతారు.

ఈ విషయాలన్నీ మామూలు రైతు ఆలోచించే పరిస్థితుల్లో ఉన్నాడా? లేడు. తానసలు క్రిందకి చూడడు. తనదెప్పుడూ పై చూపే. పై వర్గం ఆలోచనల్లోనే ఉంటాడు. తనకు నువ్వు అమాయకత్వంలో ఉన్నావంటే కోపం. అసలు ఈ ప్రపంచంలో అతనికి శత్రువులుగా కనపడే వారు ఈ పొలాలూ, ఆస్తులూ వొద్దనేవారు.

ఎవరో ఎక్కడి నుండో వచ్చి తమ ఆస్తులు దోచుకుపోతారని భయం. ఇదీ అక్కడి పరిస్థితి. అలాంటప్పుడు వారిలో ఉన్న ఈ ధోరణుల్ని క్రమక్రమంగా మార్చాలంటే ఎవరో ఒకరుండాలి. వ్యక్తులు కావచ్చు, పార్టీలు కావచ్చు.

వెంకట్రామయ్యగారు ఆ పని చెయ్యలేదు సరే... మరి ఆ తర్వాత ఇంకెవరు చెయ్యాలి... అవును... పాలెంలో ఓ కమ్యూనిస్టు ఉన్నాడు.

అయన పేరు రాంబాబు

★ ★ ★

రాంబాబు టౌన్లోనే చదివాడు. చదువుకునే రోజుల్లోనే ఆ రాజకీయాలవైపుకు ఆకర్షించబడ్డాడంట. ఇప్పుడాయన వయసు కూడా దాదాపు యాభై సంవత్సరాలదాకా ఉంటాయి. ఆయనమీద ఓ గొప్ప జోక్ కూడా ఉంది.

రెండున్నర దశాబ్దాలుగా ఆయన ఎర్ర జెండాను నిలబెడుతున్నాడంట. నిజమే జెండాను గాలంటూ ఉండి ఎగరేస్తే రెపరెపలాడుతుంది కూడా. కానీ జెండాను ఎగరెయ్యటమే నిలబెట్టడం అవుతుందా?

మరి ఈ జెండా నీడలో ఎంతమంది చేరారు? రాంబాబు ఒక్కడే. రాంబాబే జెండా పట్టుకొని, కట్టుకొని ఎగరేస్తుంటాడు. అంతకు మించి ఎవరిమీదా ప్రభావం చూపించలేకపోయాడాయన.

పాలెంలో గాంధేయవాది ఎంత సాంప్రదాయకంగా ఉన్నాడో, అక్కడ కమ్యూనిస్టు రాంబాబూ అంతే. మరి ఆయన చేసిన, చేస్తున్న కార్యక్రమాలేం లేవా? ఎందుకు లేవూ!

రైతుల సభలు జరిగినప్పుడో, వ్యవసాయ కూలీలసభలో లేక పార్టీల మహాసభలు జరుగుతున్నప్పుడో తప్పకుండా హాజరవుతాడు. తన తోపాటు కొంతమందిని కూడా బలవంతానో, ఇష్టంమీదనో తీసుకువెళ్తాడు.
అప్పుడప్పుడు చిన్న రశీదు పుస్తకాలు తెచ్చి ఓ పావలా తీసుకొని మీరందరూ ఈ సంఘంలో సభ్యులు అని చెబుతాడు. వాళ్లకదేం తెలియదు. తామిచ్చిన డబ్బులు మాత్రం ఆ పార్టీకి ఇచ్చామనుకుంటారు. ఆ విషయంలో రాంబాబు నిజాయితీపరుడే.

ఏ మహాసభలకో విరాళాలు అంటూ పోగుచేసినా అవేమీ స్వంతానికి వాడుకోడు. అసలు రాంబాబు కూడా పేదరైతు. ఆయనకు ఇద్దరమ్మాయిలూ, ఓ అబ్బాయి ఉన్నారు. వారి చదువుల విషయంలోనూ, ఇంట్లో సరిగ్గా జరగక ఆయన బాధలుపడుతున్నాడు. ఆయనకు పార్టీ అంటే ఇష్టం. ఎర్ర జెండాను చూస్తే ప్రేరణ కలుగుతుంది. ఆ పార్టీ నాయకులంటే ఆరాధన ఉంది. వారు చెప్పే అంశాల్ని కూలీలకు వివరిస్తుంటాడు.

రష్యాలో విప్లవం ఎలావచ్చిందో, అక్కడి జనం అంతా ఎంత సంతోషంగా ఉన్నారో చెబుతాడు. మరి ఈ రెండు దశాబ్దాలకు పైగా




ఈ గ్రామానికి తనేం చేశాడో మాత్రం ఆయన చెప్పలేడు. ఆయన మహత్తర కార్యక్రమాలు నిర్వహించలేకపోవచ్చు. కానీ రోడ్డు నిర్మాణం విషయంలో కూడా ఎలాంటి చొరవా చూపించ లేకపోయాడు. అసలు ఇన్ని సంవత్సరాల చరిత్రలోనూ ఆయన షావుకారుతోనూ, ధనిక రైతులతోనూ సంఘర్షించిన దాఖలాలే లేవు.

ఆయనకు భగవంతుడిమీద నమ్మకం ఉందా అంటే ఖచ్చితంగా చెప్పటం కష్టం. ఆ విషయాన్ని అతనెప్పుడూ తేల్చిచెప్పలేదు. వెంకటరావు మాస్టారు లాంటి వారొచ్చినా ఆయన ఘుందడుగు వెయ్యలేకపోయాడు.

"ఆయన చాలా మంచాయన. అలా మన ఊరినుండి పంపించటం బాగుండలేదు. ఆయన్ని ఉంటున్న ఇంటినుంచి వెళ్లగొట్టకూడదు. ఇంతే కార్మికుల రాజ్యం వచ్చేంతవరకూ ఇలాంటివి తప్పదు. మా రాజ్యంవస్తే ఇలా ఉండదు" ఆయనకామాట ఎంత ఊతపదం అంటే ... పాలెం గ్రామంలో చాలామందికి అదో వినోదం ... వారెలాంటి విషయం తీసుకున్నా...

'రాంబాబుగారి రాజ్యంవస్తే ఇలా ఉండదు' అనేస్తారు.

ఇంకా నిశితంగా పరిశీలించిచూస్తే నా దృష్టికి ఇంకా మరికొన్ని విశేషాలొచ్చాయి. రాంబాబు కమ్యూనిస్టుకాదు. కమ్యూనిస్టు అభిమాని మాత్రమే.

ఆయన కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతాలను చదవలేదు. వాటిని అర్థం చేసుకోవటానికి ప్రయత్నం చెయ్యలేదు. ఆయన ఎలా ఆకర్షించబడ్డాడోగానీ ఆ పార్టీకి ఆకర్షితుడయ్యాడు. ఆ తర్వాత ఆ పార్టీయే రెండుముక్కలయ్యింది. కొన్నాళ్ళపాటు ఆ చుట్టుపక్కల ఎవరు వచ్చినా వారి సభలకు హాజరవుతుండేవాడు.

ఎవరికివారు రాంబాబు మా పార్టీవాడే అనుకునేవారు. అక్కడి నాయకులకి రాంబాబు తనచుట్టూ తిరగటం మాత్రమే కావాలి. అవసరమైతే షావుకారిగారి ట్రాక్టరు అడిగి తీసుకొని కొంతమంది జనాన్ని తీసుకురాగలగాలి. తమ సభలప్పుడు కూరగాయలో, విస్తరాకులో విరాళాలు సేకరించగలగాలి. ఈ పనులు చేస్తుంటే చాలు.

ఇలా జరుగుతుందా అని నాకు నమ్మకం కుదరలేదు. ఇవన్నీ వాస్తవాలు. దేశంలో ఉత్తేజకరమైన వాతావరణం ఉన్నప్పుడు ఆ పార్టీలో ఇలాంటివి లేవు. తర్వాతి కాలంలో చాలామందికి ఈ దేశంలో విప్లవం వస్తుందనే నమ్మకం పోయింది. అయినాకూడా ఆ పార్టీలనే అంటిపెట్టుకొని ఉన్నారు. వారింకేమాత్రం ఓ ఆవేశంతో కదిలే స్థితిలోలేరు. ఎవరైనా ముందుకు వెళ్తున్నా రెండడుగులు వెనక్కిలాగేటట్లుగా తయారయ్యారు.

అందులోనూ దేశమంతా చైతన్యం విరిసిన రోజునే పాలెంలో ఆ పవనాలు ప్రవేశించలేదు. ప్రవేశించినా చాలా స్వల్పంగా మాత్రమే. అవి ఆ గ్రామజీవితంలో ఎలాంటి సంచలనం కలిగించలేదు.

ఇంకా చిత్రమైన విషయమేమిటంటే రాంబాబుకంటే తన పార్టీ సిద్ధాంతం గురించి వెంకట్రామయ్యగారికి బాగా తెలుసు. అలా తెలుసు కాబట్టే ఎక్కువ కాలం 'పాలెం'ను ఎలా రక్షించుకోవాలో, తమ పునాదుల్ని ఎంత బలంగా నిర్మించుకోవచ్చో ఆచరణలో నిరూపించాడు.

రాంబాబు గారిని రోడ్డుగురించి కదిలించి చూడండి ... నిజమే. రోడ్డు వేయించాలి. మరి ఆ గవర్నమెంటువారు అన్ని ఊర్లకి వేయిస్తున్నారు. పాలెంకు కూడా వేయిస్తే బాగానే ఉంటుంది"

"వేయిస్తే బాగానే ఉంటుంది. మరి వేయించటం లేదుగా. దానికేమిటి మార్గం"

"చైనాలో ఏం చేశారంటే జనమంతా కలిసి రెండు రోజుల్లో పెద్ద రోడ్డు వేసుకున్నారు"

"చైనాదాకా ఎందుకండి మన ఆంధ్రప్రదేశ్‌లో కూడా కాలవ తవ్వారు కదా"

"అవును నిజమే తవ్వారు"

"మరి అలా ఈ ఊర్లో కూడా తవ్వచ్చుగా ... రోడ్డు పోసుకోవచ్చుగా"

"అలాచేస్తే బాగానేఉంటుందనుకోండి ... కొన్ని ఇబ్బందులున్నాయి."

"ఏమిటండి ఆ ఇబ్బందులు?"

అంతటితో ఆయన నిస్సహాయంగా చూస్తాడు.



అలాంటి వ్యక్తులున్న 'పాలెం'లో ఇన్ని సంవత్సరాలపాటు రోడ్డు పడకపోవటంలో ఆశ్చర్యం ఏముంది?

నా పరిశీలన ఇంతటితో పూర్తికాలేదు. ఇంకా దృష్టిలోకి తీసుకోవలసిన వర్గాలున్నాయి. వారి భావాలు కూడా పరిగణించాలి. వారి భయాల్ని పరిశీలించాలి. అప్పుడు మాత్రమే అసమగ్ర చిత్రమే అయినా ఓ రూపు తీసుకుంటుంది...

ఇక్కడ చెప్పుకోవలసింది ఇంకో వ్యక్తిని గురించి

అతనూ రాంబాబే!

వీర విప్లవ రాంబాబు!!

★ ★ ★

రాంబాబుకి ఆస్తి బాగానే ఉంది. ఆయన చదువుకునే రోజుల్లోనుండే చాలా విప్లవాత్మకంగా ఉండేవాడు. పిల్లలందరూ అతని ధైర్యసాహసాలుచూసి ఆశ్చర్యపోతుండేవారు. అంతకుముందుదాకా తాము చదువుకుంటున్న బడిలో టీచర్లన్నా హెడ్‌మాష్టరన్నా భయపడుతుండేవారు. రాంబాబు అలా ఎప్పుడూ భయపడలేదు. అంతేకాదు ఆ మాష్టార్లందరినీ అనుకరిస్తుండేవాడు. వార్షికోత్సవాల సమయంలో మిమిక్రి చేస్తుండేవాడు.

రాంబాబును అప్పుడు గమనించిన వారందరూ బాగా వృద్ధిలోకి వస్తాడని ముందే ఊహించారు. తను కాలేజీకి ఎదుగుతున్నకొద్దీ కొత్త కొత్త పరిచయాలు ఏర్పడ్డాయి. ముఖ్యంగా మైకుముందు నిలబడి అనర్గళంగా మాట్లాడుతుండేవాడు. అందులో విషయం ఏమీ లేకపోవటం వేరేవిషయం. అప్పట్లోనే అతన్ని అసెంబ్లీకి నిలబెట్టాలనుకున్నారు కొంత మంది. కానీ మరికొందరు ఇప్పుడేకాదంటూ వారించారు.

అయినా కూడా స్వతంత్ర అభ్యర్థులుగా నిలుచున్నవారు తమ తరపున ఉపన్యసించటానికి ఈ రాంబాబును వినియోగించుకునేవారు. అప్పుడు చూడాలి ఆయన వైభవాన్ని. ఇంటినుండి పుష్కలంగా తెచ్చుకున్న డబ్బులు విచ్చలవిడిగా వెదజల్లుతుండటంతో కొంతమంది రాంబాబు ఏం మాట్లాడినా కేరింతలు కొడుతుండేవారు. కాలేజీ ఎన్నికల్లో తనదే విజయం. పట్టణంలోకూడా తనకంటూ ఓ 'ఇమేజి' సృష్టించుకున్నాడు.

చదువు పూర్తయింది. ఇదివరకటిలా డబ్బులు కూడా చేతికి అందటంలేదు. ఓ రోజున అకస్మాత్తుగా అతను మాయం అయ్యాడు. పాలెంలో అందరూ రాంబాబు ఏమైపోయాడా అని ఆశ్చర్యపోయారు. అతన్తో తిరిగే ఒకరిద్దరు మాత్రం చెప్పారంట ...

తనకీ పరిస్థితులన్నింటిమీదా కసి పెరుగుతుందట. ఇంకెంతకాలమో తాను ఈ గ్రామంలో ఉండలేననీ ... వెళ్ళిపోతాననీ చెప్పాడట. కొంత మందికి మద్రాసు నగరంవెళ్ళి సినిమాల్లో చేరటానికి ప్రయత్నం చేస్తానన్నాడట. మరికొంతమందికి ఇంకా ఏమేమో చెప్పాడు. అయితే ఏమైపోయాడో ఎవరికీ అర్థంకాలేదు. అతడేమయ్యాడో వెతికించమని రాంబాబు నాన్నమీద వత్తిడి తెచ్చారు. ఆయన తిరస్కరించాడు.

"అదేంటే అలా వాడినొదిలేస్తే ఎలా? ఆడేదో నీ మాట వినలేదని కోపంతో ఉంటే ఎలా? వాడెక్కడున్నాడో వెతికి తెప్పించి పెళ్లి చేస్తే ఆడే మారిపోతాడు" అని చెప్పి చూశారు.

"ఆడికా... ఆడికి పెళ్ళి చెయ్యాలా? ఎందుకయ్యా ఆ వచ్చేది నాకు పడి ఏడవటానికా? ఆడిసంగతి నీకు తెలియదు. ఇంట్లో తీసుకెళ్ళిన డబ్బులు. కాసిని అయిపోతే ఆడేకుక్కలాగా తిరిగొస్తాడు"

"అది కాదే. రోజులు బాగుండలేదు. అడవుల్లోకి పోతానన్నాడంట. ఏ పోలీసులో పట్టుకొని కాల్చేస్తే ఎట్టనే"

"మీదంతా వేళాకోళంరా. ఆడు అడవుల్లోకి ఎల్తాడూ. ఆ పనిచేస్తే ఇక్కడ వ్యవసాయమే చేయొచ్చుగా. అయినా ఆడికి నలుగురిని పక్కనపెట్టుకొని మందు తాగటం అలవాటైంది. ఇంక వాడెందుకు పనికొస్తాడురా" అని ఖచ్చితంగా తెగేసి చెప్పాడు. ఇంక ఎవరు మాత్రం ఏంచేస్తారు. మాట్లాడకుండా ఊరుకున్నారు. రెండుమూడు సంవత్సరాలదాకా రాంబాబు ఆచూకీ దొరకలేదు. అసలేమయ్యాడో ఎవరికీ అంతుచిక్కలేదు. ఓరోజు 'పాలెం'లోకి పోలీసులొచ్చారు.

తిరిగి గ్రామం మొత్తం కంగారువడిపో




యింది. ఎప్పుడూ పోలీసులు రావటం తాము చూడలేదంటూ వారందరూ షావుకారి దగ్గరకు వెళ్ళారు. అక్కడికే వెంకట్రామయ్యగారు వెళ్ళారు. చాలాసేపు తర్జనభర్జనలు జరిగాయి. అప్పటికప్పుడు బులెట్లమీద వెళ్ళి నాలుగైదు కేసులు తెచ్చారు. కోళ్ళు తెగాయి. ఇంకా మరికొన్ని రకాలు అప్పటికప్పుడు తీసుకువచ్చారు.

షావుకారి దగ్గర ఎప్పుడూ 'రత్నం' అని ఒకడు తిరుగుతుండేవాడు. ఆ తర్వాత ఒకరిద్దరి దగ్గర చెబితే ఈ విషయాలన్ని తెలిశాయి.

ఆ పోలీసాఫీసర్లు "ఇదేంటి షావుకారుగారూ... ఎప్పుడూ పాలెం గురించి మాకు కంప్లయింట్‌లేదు. మీ ఊరికుర్రాడంట. రాంబాబు... సరే ఇప్పుడేదో పేరుపెట్టుకున్నాడు. ఓ భూస్వామిని వీళ్ళందరూ చంపేసి ప్రాంసరీనోట్లన్నీ తగలేసి ఇంట్లో డబ్బూ బంగారం కాజేసుకుపొయ్యారంట. ఇప్పుడు మాకు పైనుండి ఆర్డర్స్. కనిపిస్తే కాల్చేయమని."

"ఓరి వీడి దుంపతెగా... రెండు సంవత్సరాల క్రితమనుకుంటావాడు ఇక్కడి నుండి వెళ్ళిపోయాడు. ఆ తర్వాత ఇప్పటివరకూ కనపడలేదు. ఏమైపోయాడా అనుకునేవాళ్ళు. ఆఖరికి ఇక్కడ తేలాడన్నమాట" అన్నాడు షావుకారు.

"ఇంతకూ అతని వివరాలేంటో చెప్పండి. ఎంతవరకు చదివాడు. కుటుంబం పరిస్థితులేమిటి?"

"ఏదో చదివాడులెండి. కుటుంబం పరిస్థితి ఏముంది. చదువుకున్నన్ని రోజులూ మా మావ ఎంతకావాలంటే అంత ఇచ్చాడు. అప్పుడాడి ఇష్టమైపోయింది. ఆయనకు ఈ దేషాలన్నీ తెలిశాక డబ్బుఇవ్వటం ఆపేశాడు. ఆడేమో అటెల్తా ఇటెల్తా అంటూ ఊర్లోవారికి చెప్పాడు. వాళ్ళు వెళ్ళి ముసలాయనకి చెబుతారని తెలుసు. ఆయన మహా మొండోడు. పోరా వెధవా అనుకున్నాడు. ఓరోజు మాయమైపోయాడు. ఏదోలే పెద్దాయన్ని బెదిరిస్తున్నాడులే అనుకున్నాం. మీరు చెబుతున్నారుగా ఇప్పుడు"

"మావ అంటున్నారు. ఆయన మీకు బంధువులా?"

"ఏదో బీరకాయ పీచులెండి. ఆయనకి కబురుచేద్దాం"

"ఈమధ్య ఎప్పుడైనా వచ్చాడా?"

"అబ్బే... అలాంటి సమస్యేలేదు. ఆడొస్తే నాకు తెలియకుండా ఉండదు"

"ఏరాత్రో వచ్చి వెళ్ళిపోవటానికి అవకాశంలేదంటారా?"

"ముందు ఆడికాధైర్యం ఉండద్దూ. మా మావ వాకిట్లోనే ఎందుకొచ్చావ్ తొత్తుకొడకా అంటూ కూర్చోడూ" అంటూ కూర్చున్నాడు.

"అదేంటి అలా అంటారు మర్డర్ కేసులో ఉన్నాడతను. అతనికి ధైర్యం లేకపోవటం ఏమిటి?"

"లేదండి. వాడుత్త పిరికిగొడ్డు. మహా అయితే వీడు గేటు బయటఉండి ఉంటాడు"

"మరేం చేద్దాం" అన్నాడు పోలీసాఫీసర్ షావుకార్ని చూస్తూ ఆయన వెంకట్రామయ్యగారికేసి చూశాడు.

వెంకట్రామయ్యగారు తన సహజమైన చిరునవ్వు నవ్వి...

"కుర్రాళ్ళది ఉడుకురక్తం కదా. వాడి విషయం తొందరపడకండి. మేం వాడికి చెప్పుకుంటాం" అన్నారు.

"అయినా వీళ్ళకిదేం పోయేకాలమండి. మా ప్రాణాలు తోడేస్తున్నారు. అసలు ఇదంతా చూస్తుంటే మాకు ఆశ్చర్యం కలుగుతోంది. మంచి మంచి కుర్రాళ్ళండీ. ఇంకా డాక్టర్లున్నారు. ఇంజనీర్లున్నారు. హాయిగా ఉద్యోగాలు చేసుకోక ఈ పనులేమిటండీ" అని చిరాకుపడ్డాడంట. కొంచెం మందు ఎక్కువయ్యాక మొత్తంగా చాలా విషయాలు చెప్పాడు.

"పైనుంచి స్ట్రిక్ట్ ఆర్డర్స్. కనిపించిన వాడిని కనిపించినట్లు కాల్చిపారేయమని. మాదే ముందండీ పైనవాళ్ళు ఏంచెబితే అది చేస్తాం. ఎంతమంది చాకులాంటి కుర్రాళ్ళండి... వాళ్లను చూస్తే ముద్దుపెట్టుకోవాలనిపించే పిల్లలు. ఇంకా ఆ బుగ్గలు పాలుకారుతుంటాయి. చెట్లకు కట్టి కాలుస్తుంటే భయంకరంగా అరుస్తారు. ఎవరికి పుట్టారో ఏమిటో... వారి బతుకులు అడవుల్లో కడతేరిపోవాలని

రానున్నాయి. అంతే''

"అణి చెయ్యాల్లేండి. అలాంటి వారిమీద ఎలాంటి జాలిచూపకూడదు. అయినా మను మల్ని చంపటం, ప్రాంసరీనోట్లు చించటం... వీళ్ళ బాబుగాడి సొత్తనుకుంటున్నారు'' అన్నాడు షావుకారు కోపంగా.

"ఏమోగానీ మా పోలీసులే రాక్షసులు అనుకున్నాం. కానీవాళ్ళు మాకంటే రాక్షసులండీ బాబు. చంపివెళ్ళిపోరు. ఆ తలవేలాడదీస్తున్నారు''

షావుకారి కళ్ళలో ఎందుకో భయం తొలగి చూసింది. అయితే చాలాకొద్దిసేపే. తిరిగి ఆయన నవ్వుతూ అన్నాడు...

"కసి... ద్వేషం... లేకపోతే అంత ఘోరంగా ఎలాచేస్తారు''

"ఏమైనా వాళ్ళు కూడా పద్ధతులు మార్చుకోవాలి లెండి'' అన్నాడు అతను. షావుకారికి ఎవరు పద్ధతులు మార్చుకోవాలో అర్థంకాలేదు.

"వాళ్ళు చంపివెళ్ళిన మనుమల్ని అయ్యో పాపం అన్నవాడులేడు. ఎందుకంత ఛీకొట్టించుకోవాలి. చెప్పండి. సొంతం మూలుగుల్తో సహా పీల్చాలనుకుంటే ఎలా? ఒక్కోడుంటాడు. కనీసం మా ముఖాన టీకూడా పొయ్యడు. అలాంటోల్లని నరికితే మాత్రం పాపం ఏమిటండి?'' అన్నాడు తను నిషాలో.

చాలాసేపు పార్టీ జరిగింది. వెంకట్రామయ్యగారు కొంచెంసేపుండి వెళ్ళిపోయారు. వెళ్ళేముందు చెప్పాడింకోసారి.

"నేను మన మినిస్టరుగారితో మాట్లాడతాను. మీరేం తొందరపడకండి. ఓ వేళ మీకంటే ముందుగా మాకు కనిపిస్తే మేమే మీకు కబురుచేస్తాం''

అలాగేనంటూ తలూపాడు. ఆ తర్వాత రాంబాబు నాన్నను తీసుకొచ్చాడు. ఆయనకు రాంబాబు గురించి చెప్పారు. అంతావిన్నాక ఆయన కొంచెంసేపు మాట్లాడకుండా కూర్చున్నాడు.

"ఆఖరికి వెధవ డబ్బు కోసం మనుమల్ని చంపటానికి తయారయ్యాడన్నమాట. ఇదిగో ఇన్‌స్పెక్టర్‌గారూ... వాడ్నేం చేసుకుంటారో మీ ఇష్టం. అడ్నికనలేదా అనొచ్చుమీరు. ఆడ్నికన్నాంగానీ అడి రాతను కనలేదండి. అయినా ప్రాణం అన్నాక ఎవడిదైనా ప్రాణమే. ఆ విషయం వాడికీ తెలియాలి'' అనేసి లేచివచ్చాడు.

"నేను చెప్పాను కదా. ఆయనంతే పట్టుబట్టాడంటే వదలడు'' పోలీసులు పాలెం నుండి వెళ్ళిపోయారు. వెళ్ళేముందు షావుకారినుండి హామీ పొంది వెళ్లారు.

"మీరు రాంబాబునేమీ చేయొద్దు. మీ అందరినీ సంతృప్తిపెట్టే పూచీనాది. ఆ గ్రామానికి పోలీసులు వచ్చిన రెండురోజుల తర్వాత ఆరుబయట నిద్రబోతున్న ఓ యువకుడిని ఎవరో మెల్లగా తట్టిలేపుతున్నట్లనిపించింది. గాఢాంధకారంకాదు గానీ... చీకటిగానే ఉంది... ఆ యువకుడు ఉలిక్కిపడి లేచాడు.

"అరవకు నేను రాంబాబుని'' అన్నాడతను.

"ఎవరూ...'' అన్నాడా యువకుడు ఆశ్చర్యంగా.

"నేను రాంబాబుని''

"నువ్వా?''

"పెద్దగా అరవకు మీ వద్ద కొట్టు ఖాళీగా ఉందా?''

"ఉంది. అక్కడెలా ఉంటావ్? ఉక్కపోయదూ...''

"పొద్దున్నే ఎవరూ అటురారుగా. ఏంపనిలేదుగా''

ఎవరూ రారులే''

"రారులే అంటేకాదు. వస్తే కష్టం''

"అనలేమిటి ఇలా మాట్లాడుతున్నావ్?''

"నీకు అన్ని విషయాలూ చెబుతాను. ఆగదికి తాళంవేసి ఉందా?''

"లేదనుకుంటా. ఏంచేయమంటావ్?''

"నాకు ఆకలిగా ఉందిరా. తినటానికేమైనా ఉందా?''

"అన్నం ఉంటుందిరా. అయినా ఉదయం అమ్మావాళ్ళకు అనుమానం వస్తుందేమో''

"అలా అయితే ఓ గ్లాసుడు మజ్జిగ తీసుకుని అక్కడకురా'' అంటూ చీకట్లో నడుచు





కుంటూ వెళ్ళిపోయాడు. అతను మజ్జిగ కాకుండా అరటికాయలు దొరికితే తీసుకువెళ్ళి అందించాడు. ఆబగా తింటుంటే అన్నాడు.

"ఎన్ని రోజులైంది భోంచేసి"

"రెండురోజులు. కనీసం మంచినీళ్ళు కూడా దొరకలేదు"

"అసలు ఇన్ని సంవత్సరాలుగా ఏమైపోయావ్?"

"అదంతా పెద్దకథ... ఇప్పుడు చెప్పటం కుదరదు. నన్ను రెండు రోజుల పాటు ఈ కొట్టుగదిలో దాయాలి"

"అదిసరే... రెండు రోజులక్రితం పోలీసులు వచ్చారు"

"రాంబాబు మౌనంగా ఉండిపోయాడు"

"అసలిదంతా ఏమిటిరా? ఆ గడ్డం ఏమిటి? ఆ జుట్టుపెంచటం ఏమిటి? ఇప్పటికీ నిన్ను నేను గుర్తుపట్టలేకపోతున్నాను"

"రాంబాబు ఆ చీకట్లో నవ్వాడు"

"ఈ దేశంలో విప్లవంరావాలి?"

"ఎలావస్తుంది?"

"దున్నేవాడికి భూమి రావటం ద్వారా?"

"అదెలా వస్తుంది?"

"భూములు ఎవరి చేతుల్లో ఉన్నాయో వారిని ఖతం చేయ్యాలి"

"మీకూ భూములున్నాయిగా"

"మేం భూస్వాములంకాదు"

"ఈ ఊరు కూడా అందుకే వచ్చావా?"

"కాదు. పోలీసులు నాకోసం వేటాడుతున్నారు"

"ఎందుకు?"

"నన్ను కొన్ని కేసుల్లో ఇరికించారు?"

"అంటే నువ్వేం చేయలేదన్న మాట"

"రాంబాబు మౌనంగా ఉండిపోయాడు.

"ఇప్పుడేం చేయదలుచుకున్నావ్...." సూటిగా అడిగాడు.

"రేపు మాట్లాడుదాం"

"సరే" అంటూ ఆ కుర్రాడు తిరిగి వచ్చి పడుకున్నాడు.

ఆ తర్వాత ఎవరికీ అనుమానం కలగనిరీతిలో భోజనం చేరవేశాడు. ఆ తర్వాత అతను సుదీర్ఘంగా మాట్లాడాడు.

"అసలు నువ్వు ఈ ఊరు వొదిలిపెట్టి ఎక్కడికో పారిపోవటమేమిటి? మేమందరమూ మీనాన్న మీద అలిగి వెళ్ళావనుకున్నాం. ఇప్పుడొచ్చేమో విప్లవానికి అంటున్నావు. నీ ఊరిలో నువ్వు తెచ్చే విప్లవం ఏమిటో ముందు చెప్పు"

"అలా మాట్లాడుతావేమిటి?"

"అవునురా. మన షావుకారుకో వంద ఎకరాలున్నాయి. ఇంకా వ్యాపారాలు చాలా ఉన్నాయి. మరి అయన్ని ఏమీ ఎందుకనవు"

"అది నిర్ణయించాల్సింది నేనుకాదు"

"మరెవరు?"

"పార్టీ... పార్టీ ఏం చెబితే అది చేయటమే మా పని"

"మీ పార్టీ నాయకుడిది ఏ ఊరు"

"అది రహస్యం. నాకే తెలియదు"

"ఇదేదో గ్యాంగ్‌లో పని చేస్తున్నట్లుంది"

"అదినీ అజ్ఞానం"

" అదే ఈ ఊరును బాగుచెయ్యలేని నువ్వు సాధించేవిప్లవం ఏమిటి?"

"ఈ ఊరిని ఏం బాగుచేయాలంటావ్?"

"నీకు తెలియదా? నిజంగా నీకు తెలియదా?"

రాంబాబు మాట్లాడకుండా చూస్తున్నాడు.

"మన ఊరికి రోడ్డు లేదు. ఎందుకు లేదో ఆలోచిస్తే చాలాకారణాలు దొరుకుతాయి. నువ్వు మన ఊరి రోడ్డుతోనే విప్లవం ప్రారంభించాల్సింది"

"పిచ్చివాడా... ఈ రోడ్లది ఓ సమస్యేకాదు. ముందు విప్లవం విజయవంతం అవ్వాలి. అంటే భూమి సమస్య పరిష్కారంకావాలి. భూమి సమస్య పరిష్కరించబడితే ఈ రోడ్డుదో సమస్యకాదు. అంతేకాదు ఈ రోడ్లన్నీ ఇలానే ఉండాలి. అన్నీ బాగుండటం శత్రువుకి ఉపయోగిస్తుంది. విప్లవకారుల్నికాపాడేది అడవులూ, ఇలాంటి రోడ్లే"

"అంటే విప్లవం వచ్చేదాకా పాలెం రోడ్డు

ఇంతేనన్నమాట. అదే నిజమైతే ఈ పాలానికి రోడ్డు ఎప్పుడూరాదు''

"ఎందుకని?''

"ఈ దేశంలో విప్లవం విజయవంతం కాదు. కాబట్టి''

★ ★ ★

ఆ కుర్రాడు ఆ మాటెందుకు అన్నాడో తెలియదు. రాంబాబు విప్లవం నుండి సరాసరి 'పాలెం' తిరిగి వచ్చాడు. తన గురించి పోలీసులు తీవ్రంగా వెతుకుతున్నారని తెలుసు. కనపడితే కాల్చి అవతల పారేస్తారని అంతకంటే బాగా తెలుసు. అందుకే ముందుగా తన మిత్రుడి దగ్గరకు వచ్చి పరిస్థితిని అంచనా వేసుకున్నాడు. వెంకట్రామయ్యగారి దగ్గరకి ఓ రాయబారం పంపించాడు. అయితే తనే ఊరు వచ్చినట్లు మాత్రం తెలియచేయవద్దని చెప్పాడు.

షావుకారుగారూ, వెంకట్రామయ్యగారూ మాట్లాడుకున్నాక పోలీసుల సలహా అడిగారు. ముందు తను అరెస్టుకావాలని వారు సూచించారు. రంగం సిద్ధం అయింది. తిరిగి పోలీసులు జీపులు షావుకారి ఇంటిముందు ఆగాయి. అక్కడో గొప్పపార్టీ జరిగింది. రాంబాబు కూడా ఆ పార్టీలో పాల్గొన్నాడు. అందులోనే తన అ నుభవాలు కూడా చెప్పాడని అంటుంటారు. ఆ తర్వాత జీపులోనే రాంబాబు వెళ్ళిపోయాడు.

వెళ్ళేముందుషావుకారు చెప్పాడంట... "వెధవకి నాలుగు తగిలించండి'' అని

రాంబాబుకు నాలుగే తగిలించారో, నలభై తగిలించారో తెలియదు గానీ ఆ తర్వాత కొంతమంది మాత్రం సఫాఅయిపోయారని గిట్టని వారు చెప్పుకుంటారు. అసలు రాంబాబు పోలీసులకు దొరికిపోవటం, లొంగిపోవటం అంటూ జరగలేదనీ, కొందరు ఇచ్చిన సమాచారంవల్ల ఇదంతా జరిగిందనే ప్రచారం కూడా ఉంది.

చాలాకాలం రాంబాబు కేసు నడిచింది. చివరికి నిర్దోషిగా బయటపడ్డాడు. అప్పటికే చాలావయసు అయిపోయింది.

కొంతకాలం పాటు ఈ హీరో రాంబాబు కుర్రాళ్ళని చుట్టూ తిప్పుకొని ఊళ్లోని కమ్యూనిస్టు రాంబాబుని తిట్టడం మొదలు పెట్టాడు. ఈ దేశంలో విప్లవం నాశనమవటానికి కారణం ఆ రాంబాబుగాడి పార్టీయేనని తెగేసి చెప్పాడు.

కొంతకాలం అలా కాలక్షేపం చేసిన తర్వాత ఆ చుట్టూ చేరిన వారు ప్రశ్నించటం మొదలు పెట్టాక క్రమంగా వారందరూ రాంబాబుకి దూరంగా జరిగిపోయారు.

అప్పుడు రాంబాబుకి వెంకట్రామయ్యగారు కనిపించేరు. ఆయనకు గీతను వివరించటం తెలుసు. అందులో శ్లోకాలు తెలుసు. గాంధీ సిద్ధాంతాలు తెలుసు. విప్లవరాంబాబు సిద్ధాంతాలు తెలుసు. అందుకే రాంబాబు ఆయన్ని ఆశ్రయించాడు. ఆయన తేజస్సు నుండి ప్రభవించిన భావామృతం అద్భుతంగా తోచింది, నేను నమ్మనంటే నమ్మనన్నాను. కానీ చూశాక నమ్మక తప్పలేదు.

రాంబాబు ఇప్పుడు 'గీత'ను ఆయుధంగా ధరించాడు.కలియుగాంతాన, పాపం పెరిగిపోయి, ధర్మం నశించిన తరుణాన రానున్న భగవంతుడికోసం ఎదురు చూస్తున్నాడు. ఆయన ధరించే ఖడ్గం... ఈ సమాజాన్ని సమూలంగా ప్రక్షాళనం చేస్తుందని బల్లగుద్ది మరీ చెబుతున్నాడు.

వెంకట్రామయ్యగారు చిద్విలాసంగా నవ్వుతూనే ఉన్నారు. వయసుపండి పాలెంలోని వృద్ధులు నేలరాలుతున్నారు...

'పాలెం రోడ్డు' సమస్య యదాతథంగా ఉంది!

మాలపల్లి గురించి మాట్లాడుకోవాలంటే నిజానికి పాలెం ప్రధానభాగం అదే. వీరు లేందే అక్కడ ప్రజలకి క్షణం గడవదు. అక్కడ భూమి పులకించాలన్నా... అందులో నాటిన విత్తనాలు మొలకెత్తాలన్నా వీరి అవసరం తప్పనిసరి. వీళ్ళకేం ఆస్తులు లేవు. అహంలేదు. పనిచేస్తే తప్ప బతుకులేదు. అలాంటి వారికి తమ రోడ్డు విషయంలో ఎలాంటి అభిప్రాయాలున్నాయో చూడాలి.

చాలామంది దృష్టికి ఇదో సమస్య అనిపించదు. వారికి ఇది ఆలోచించేంత సమస్యగా కూడా తెలీదు. అంతగా జీవనంలో





కూరుకుపోయారు. చాలామందికి రైతు కుటుంబాల్తో పెనవేసుకుపోవటం ఉంది. సంవత్సరానికి ఇన్ని బస్తాలు ఇచ్చి, రెండు జతలబట్టలు కుట్టించి, అన్నంపెట్టి కమతగాళ్ళగా కుదుర్చుకునే పద్ధతి అక్కడ ఉంది. చాలాకొద్దిమంది మాత్రం నెలజీతాల పద్ధతిలో కుదురుతారు. ఈ కమతగాళ్ళ విషయంలో పిల్లలకో పద్ధతి... పెద్దవారికో పద్ధతి ఉంటుంది. అలా చేరినవారికి తమ ఇంటితో సంబంధం ఉండదు. రాత్రీ పగలూ తమ యజమాని ఇంటిలో పని చేయటమే. చిన్న పిల్లల్ని మాత్రం ఇంటి పనులకు అట్టిపెట్టుకుంటారు. దొడ్డి ఊడవటం, గేదెల్ని కడుక్కురావటం. అన్నం వండటం నుండి అంట్లు తోమే దాకా అన్ని పనులూ వాళ్ళు చేస్తారు. కొద్దిగా ఎక్కువ పొలం ఉన్నవాళ్ళు వ్యవసాయం పనులకే కొంతమందిని పెట్టుకుంటారు.

'ఉగాపౌర్ణమి'కి ఈ కమతగాళ్ళు ఒప్పందాలు కుదుర్చుకుంటారు. అన్నీనోటి ఒప్పందాలే. ఒక్కో కమతగాడు తన చిన్నతనం నుండి ఒకే కుటుంబంలో ఉండిపోయిన సందర్భాలున్నాయి. అలానే కొంతమంది సంవత్సరానికోసారి మారిపోతుంటారు. ఇదో ఏర్పాటు. మిగతావారు మాత్రం పనులకు వెళ్తారు. అక్కడివారికి ఏదో ఒక పని ఉంటూనే ఉంటుంది. అంతగా ఏమీ పనుల్లేకపోయినా ఏ కంప నరుక్కురావటమో మరో పనో ఉంటుంది. వారిపిల్లలు చదువుకోవటానికి ముందుకురారు.

కనీస చదువులు చదివినవారు చాలా తక్కువమంది. వారిలో కూడా ఎంత తక్కువ అయినా భూములున్నవారున్నారు. అలాంటి వారిని పాలెం రైతులు మిగతా వారి మీదగౌరవంగా చూస్తారు కూడా. వీళ్ళంతా ఇంకా చీకటి ఉండగానే లేస్తారు. పొలం పనులకి వెళ్ళాలంటే ముందు అన్నాలు వండుకోవాలి. ఆ పనుల్లో ఉంటారు. సాయంకాలం పొలం నుండి వచ్చాక తిరిగి అన్నాలు వండుకోవాలి.

ఉదయమంతా పనులు చేసి అలసిపోతుంటారేమో చాలా త్వరగా భోజనాలు పూర్తి చేసి నిద్రపోతుంటారు. వారిలో చాలామంది ముందే తిండి గింజలు కొలిపించుకుంటారు. అప్పుడు నిర్ణయించిన ధరకే ఆ తర్వాత కాలంలో పని చెయ్యాలి. ఇందులో అన్యాయం గురించి కూడా వాళ్ళేం ఆలోచించరు. తమను నాలుగు మాటలన్నా కూడా అడిగినప్పుడు ఎంతో కొంత ఇచ్చి ఆదుకుంటున్నారనే కృతజ్ఞత ఉంది.

వీళ్ళలో కొంతమంది రిక్షాలు తొక్కుకుని బతుకుతారు. ఇంకో విశేషమేమిటంటే 'పాలెం' నుండి రిక్షాకు కొంత ధర ఉంది. మనిషికి నాలుగనో మూడురూపాయలనో ఇస్తారు. బయటివాళ్ళ దగ్గర కూడా చాలాకాలం పాటు అలానే తీసుకునేవారు. తర్వాత్తర్వాత వారిలో కొద్దిపాటి మార్పు వచ్చింది. ఒకరే వెళ్ళాల్సివస్తే పదిరూపాయలు తీసుకుంటారు. మరికొందరు కలిస్తే తగ్గించుకుంటారు. ఎప్పుడూ రిక్షాలు తొక్కటమే వృత్తిగా పెట్టుకున్నవాళ్ళులేరు. వర్షాకాలం వస్తే అసలు కుదరనే కుదరదు. పైగా అది ముమ్మరంగా పనుల సీజన్ కావటంతో ఆ అవసరమూరాదు.

ఓ రకంగా వాళ్ళు ఎంత తీసుకున్నా నయమే అనిపిస్తుంది. అయిదుమైళ్ళు పైబడి వారు తొక్కాలి. అందులోనూ ఎత్తువల్లాల రోడ్డు. నలుగురైదుగురిని కూర్చోపెట్టుకొని మెరక ఎక్కించాలంటే సామాన్యంకాదు. ఆ రోడ్లు నానా ఛెండాలంగా ఉంటాయి కాబట్టి ఆ రిక్షాలు కూడా త్వరగానే పాడయిపోతాయి. మామూలుగా పాలెం కూలీలు చద్దన్నం తింటే నేగాని పనులకు వెళ్ళరు. కాఫీలూ, టీలూ తాగటం అంటూ ఉండదు. ఈ నడుమే వాళ్ళు కూడా మెల్లమెల్లగా వాటికి అలవాటుపడుతున్నారు.

అంతదూరం రిక్షాలాక్కువచ్చాక వారికి ఆకలవుతుంది. అక్కడ హొటల్లో ఇచ్చే ఇడ్లీలు గానీ, దోసెలుగానీ వారికే మాత్రం ఆనవు. అయినా ఏదో ఒకటి తినాలి. ఆ రకంగా వారి శ్రమంతా ఆ హొటళ్ళకి వెళ్తుంది. కొంత భాగం సారాయిషాపుకు వెళ్తుంది. బేరాలు లేకపోతే ఆకలి ఇంకా ఎక్కువవుతుంది. ఎదురుగా సినిమా బొమ్మలు రమ్మని ఆహ్వానిస్తుంటాయి. రిక్షాను పెట్టుకోవటానికి థియేటర్ వారికి కొంత చెల్లించుకొని మరీ వెళ్ళాలి. అందుకే ఆడాళ్ళు గొణుగుతుంటారు—



'నువ్వు రిక్షా తొక్కి సంపాదించేది నీకూ, ఆ రిక్షాకి సరిపోతే చాలు' అంటూ. ఈ లెక్కలన్నీ చూసుకుంటే పాలెంలో ఎంతో కొంతవచ్చినా ఆ పనికే వెళ్ళటం నయం అనుకొని మానుకునే వారున్నారు. చాలాకొద్దిమంది జాగ్రత్తగా ఉంటారు. ఎంత జాగ్రత్తగా ఉన్నా వారికి ఏదో ఒక అంతరాయం వస్తూనే ఉంటుంది. వారితో పోలిస్తే... పట్నంలో రిక్షావాళ్ళు ఎక్కువ సంపాదిస్తున్నట్లుగా కనిపిస్తారు. అయిదుమైళ్ళ



దూరం వాళ్ళు తిరిగితే కనీసం మూడురెట్లు ఎక్కువ సంపాదిస్తారు. పైగా ఈ రోడ్లు బాగుంటాయి. రిక్షాలు కూడా టాపులేనివి. ఇద్ద రినిమించి ఎక్కువమందిని కూర్చోబెట్టుకోరు. ఇవన్నీ చూసి కొంతమంది పట్నంలో బాగా బతకొచ్చనే ఆశతో పాలెం నుండి వలస వెళ్ళటం కూడా ఉంది.

వారికి అక్కడకు వెళ్ళాకగానీ అనుభవం రాలేదు. అక్కడ చాలా రిక్షాలున్నాయి. చాలా మంది రిక్షాలవారున్నారు. వారు కూడా కాఫీలూ, టీలూ తాగుతారు. కుర్రవాళ్ళయితే వేగంగా తొక్కగలుగుతారు. నాలుగు రూపాయలు చూడగలుగుతారు. మిగతావారికి ఆ పోటీలో బేరాలు మెల్లగానే దొరుకుతాయి. అక్కడ రిక్షా ఎక్కేవారు అన్ని రిక్షాలూ ఎక్కరు. ఆ రిక్షా బాగుండాలి. తొక్కేవారు కూడా బలంగా కనిపించాలి. తమని చివరిక్షణంలో రైలు దగ్గరకో, బస్ దగ్గరికో వేగంగా చేర్చగలగాలి. ఇంతచేసి సంపాదించినా ఆ ఆకర్షణలన్నింటి నుండి బయటపడి ఇంటికి వెళ్ళేసరికి మిగిలేది స్వల్పమే. కాగా ఎవరయ్యా బాగుపడుతున్నారంటే... రిక్షా యజమానులు. వారికొచ్చే అద్దెలే రిక్షాల్ని పెడుతుంటాయి.

అయినా కూడా షావుకారు చెబుతుంటాడు...

"ఒరేయ్... ఈ ఊరికి రోడ్డొచ్చిందనుకోండిరా మీ కడుపులమీద కొట్టినట్లే. బర్రుబర్రున సిటీ బస్సులు తిరుగుతుంటాయి. అప్పుడు మీ రిక్షా ఎక్కేవారుండరు. బస్సు వచ్చేదాకా ఆగి అదే ఎక్కుతారు. అంతేకాదు బస్ ఛార్జీకంటే ఎక్కువ ఇవ్వటానికి ఎవరూ అంగీకరించరు. మహాఅయితే ఇంకో రూపాయిస్తారు. అది మీకేం గిడుతుందో చెప్పండి" అంటూ.

అదంతా నిజమేనని వారంగీకరిస్తారు. వారి కళ్ళముందు కొత్తవి వచ్చి పాత వాటిని పూర్తిగా వెనక్కి నెట్టడం జరుగుతున్నదే. రోడ్డు వేయటం జరిగితే బయటినుండి కూలీలు వస్తారు. ముందు తాము చేసే పనులన్నింటినీ మెషిన్లే చేస్తాయి. ఇప్పటికే ట్రాక్టర్లతో పొలాలు దున్నించుకుంటున్నారు. అయినా పాలెంకు రోడ్డు వస్తే తమకేం వొరుగుతుంది. మాలపల్లికి రోడ్డురాదుగదా... రోడ్డు వస్తే ఏమైనా లాభాలుంటే అవన్నీ అనుభవించేది రైతులే. తమకెప్పుడూ మిగిలేది కూలే. అంతేకాదు వారిలో కొంతమందికి రోడ్డు రావటంతో తమ ఆడాళ్ళు కూడా ఎక్కడ చెడిపోతారోననే భయం ఉంది.

అయినా వాళ్ళకు మొత్తంమీద బతుకు గడుస్తోంది. గ్రామంలో మోతుబర్లుగానీ, ఇతరులుగానీ తమని బాగానే చూస్తున్నారు. మరి వారందరికీ అవసరంలేని రోడ్డు తమకి మాత్రం ఎందుకు?

రోడ్డు వేస్తే వచ్చే లాభాలు తమకే వస్తాయని వారికి తెలియదు. కొద్దిపాటి వడ్లు కొలిచి, సంవత్సరం పాటు పనిచేయించుకోవటం కుదరదనీ, తాము కూడా కూలీ రేట్లు సాధించుకోవచ్చుననీ, అవసరమైతే వేరే చోట్లకు సులువుగానే పనులకు పోవచ్చనీ తెలియదు. తెలిసినా పట్టించుకోరు. జీవితం ఏదో రకంగా కొనసాగుతుంది.

అలాంటి జీవనంలో మార్పు రావాలంటే ఓ కుదుపురావాలి. అప్పుడు మాత్రమే ఆలోచించగలుగుతారు. ఇంకే మాత్రం ఉపేక్షిస్తే కుదురదనుకున్నపుడు మాత్రమే ముందుకు కదలటం చాలామందిలో ఉన్న లక్షణమే.

పాలెంలో ఇంకా ఇతర వృత్తులవారున్నారు. వారిలో చాకలీ, మంగలి కూడా సంవత్సరానికి ఇన్నివడ్లు అని కొలిపించుకుంటారు. వారు చేస్తున్న క్రాపులు ఈ కాలం వారికి నచ్చటంలేదనేది వేరే విషయం. ఇంతకాలం ఓ ఏర్పాటుకు వారందరూ అలవాటు పడిపోయారు. తాము గొప్పగా జీవించలేకపోవచ్చు. కానీ కనీస జీవితం ఉంది. ఇది కోల్పోగలమనే ఊహనే వారు భరించలేరు. అందుకే రోడ్డు విషయంలో వీరందరికీ చాలా భయాలు.

'పాలెంరోడ్డు' వెనుక ఇన్ని అంశాలున్నాయి. ఇంతమంది వ్యక్తులున్నారు. వారి భయాలున్నాయి. వారి స్వార్థం ఉంది. వారి అమాయకత్వం ఉంది. అంతదాకా ఎందుకు హనుమంతరావు వున్నాడు. తను చదువుకుంటున్న రోజుల్లో 'రాజనాలు పండించే రైతుకు భోజనానికి' లేదంటూ రాశాడు. నేను అతన్ని అడిగాను.

"హనుమంతరావూ మళ్ళీ కవిత్వం రాస్తు





న్నావా?'' అని.

''ఏ కవిత్వం?'' అంటూ కంగారుపడ్డారు.

''అప్పట్లో మన స్కూలు మ్యాగజైన్‌లో నువ్వు రాసిన కవిత్వం నాకింకా గుర్తుంది. అందులోని కొన్ని పదాలు నా పెదవుల మీదుంటాయి. ఆ తర్వాత ఎందుకు రాయలేదు?''

''అది ఏదో ఉత్సాహంలో రాశాను. అందులోనూ అది పూర్తిగా నేను రాసింది కూడా కాదు. మా మేస్టారొకాయన ఉండేవారు. ఆయనా నేనూ కలిసి రాశాం'' అన్నాడు. హనుమంతరావుకు కొద్దో గొప్పో అవగాహన ఉంది. తను విషయాల్ని వివరించగలడు. మరితను ఎందుకని మౌనంగా ఉండిపోయాడు. ఈ పాలెంలో ఎవరైనా అంతేనా? నాకిలా అనుకోవటానికి ఇబ్బందికరంగా ఉంది. ఎవరో మత్తు మందుచల్లినట్లుగా ఎవరికి వారు తమతమ జీవితంలో కూరుకుపోవటం ఇక్కడ కనిపిస్తుంది. కనీసం ఈ గ్రామంలోకి ఏ రాజకీయాలు బలంగా ప్రవేశించకపోవటం కూడా ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

హనుమంతరావు అంటాడు...

''నిజమే మేం ఈ ఊర్లో పుట్టి పెరిగాం. చిన్నతనం నుండి మా పెద్దలని చూస్తున్నాం. వారి భావాలన్నీ మాలో జీర్ణం అయిపోయినట్లున్నాయి. అంతదాకా ఎందుకు నాకు వెంకట్రామయ్య గారంటే గౌరవం ఉంది. ఆ రాంబాబుగారేం చేస్తాడో చెప్పు. ఆయన బయటకు చెప్పుకోకపోయినా ఆయన పరిస్థితి బాగుండలేదు. ఇంకా చాలామంది కేవలం తమ కులం చూసుకొని సంతృప్తి పడతారు. ఎవరికేదైనా ఆలోచనవస్తే చాలు. వెంటనే దానిమీద నీళ్ళు పోస్తారు. ఇంకొంచెం ముందుకు వెళ్తే... కులానికి వ్యతిరేకంగా చేస్తున్నామంటారు. కానీ అది షావుకారి లాంటివారికి వ్యతిరేకం అనుకోరు. నీకు తెలుసా... షావుకారు మొదట్నుండీ షావుకారేం కాదు. వాళ్లగురించి మా ఊరి ముసలివారు చెబుతుంటారు. అంతదాకా ఎందుకు. మా చిన్న తనం నుండి మేం చూసినప్పటికీ ఇప్పటికీ షావుకారు ఆస్తులు చాలా పెరిగాయి. షావుకార్ని చూసి ఆయన కులంవారు చాలా మంది గర్వపడతారు. ఆయన తన కులం వారిని చూసి గర్వపడడు. కనీసం జాలికూడా పడడు. కానీ తన పనులన్నీ ఆ పేరు మీదే చేయించుకుంటాడు. ఇవన్నీ అందరికీ తెలుసు. అయినా ఎవరూ మాట్లాడటం లేదు. మేమూ అలానే అయ్యాం. నాకు పెళ్లయింది. అప్పటినుంచి బతుకు భయం పట్టుకుంది. పిల్లలు పుట్టుకువచ్చారు. ఇప్పుడు ఏంచేయాలన్నా వారే గుర్తొస్తారు. ముందునేను ఏదో ఒకటి చేసి ఈ కుటుంబాన్ని పోషించుకోవాలి. అందులోనే నాకు తీరటంలేదు. నాకు చాలా ఆశ్చర్యం కలుగుతుంటుంది. కనీసం పేపర్ చదివే స్థితిలో కూడా నేను లేను ఎప్పుడైనా రేడియో పెట్టుకొని ఆ వార్తలు వింటుంటే ఒక్కసారిగా మనం చదువుకున్న రోజులు గుర్తొస్తాయి. ఒక్కో పాట వింటూంటే... మనం చదువుకున్న బడీ... అక్కడి మాస్టార్లూ... మన స్నేహితులూ... ఆడపిల్లలూ అందరూ గుర్తొస్తారు. కొంచెంసేపు ఈ ప్రపంచాన్ని నేను మరిచిపోతాను. నా పిల్లల్ని నేను దగ్గరకు తీసుకుంటాను. ఒక్కోసారి అనిపిస్తుంది. వీళ్ళు కూడా జీవించటంకోసమే మాలానే అయిపోతుంటారా అని.

నిజం చెబుతున్నాను. ఇక్కడ మాకు రెండు జీవితాలు లేవు. ఒకటే జీవితం. అది కూడా భౌతికమైనది. మానసిక ప్రపంచంలేదు. మంచి వినోదం లేదు. నీకు చాలా వింతగా అనిపించవచ్చుగానీ భోజనం విషయంలో మాత్రం ఇక్కడ చాలామంది ముందుంటారు. ఇక్కడి జోకులన్నీ వాటిచుట్టూనే. ఈ కుర్రాళ్ళు అలానే తయారవుతున్నారు. వీళ్ళు పుస్తకాలు చదవరు. ప్రపంచంలో ఏం జరుగుతుందో వీరికి అవసరంలేదు. ఈ ప్రపంచంలో అడుగడుగునా అందాలున్నాయంటే నవ్వుతారు. వీళ్లకు అందంవద్దు. మంచి ఆనందం వద్దు. మంచి సాహిత్యం వద్దు. నువ్వు ఈ ఊరి ఇళ్లలోకి తొంగిచూడు. ఏదో మూల పుస్తకాలు దొరుకుతాయి. అవి బూతుపుస్తకాలో, డిటెక్టివ్ పుస్తకాలో అయి ఉంటాయి.

మరి వినోదం అనేది వీరికి అవసరం లేదా అనవచ్చు. వీరి ఆనందంకూడా వికృతంగానే ఉంటుంది. వీరి పేకాట నువ్వు గమనించావంటే ఆ తెలివి తేటలకు ఆశ్చర్యపోతావు.

ఇక్కడ యువతరం అంతా నీరుకారిపోతుంది. అయినా ఎవరికీ బాధ కలగటంలేదు. ఇదో సమస్య అని ఎవరూ అనుకోవటంలేదు.

కానీ సుధీర్ ఒకటి మాత్రం నిజం. వీరి కంటికి కనిపించటంలేదుగానీ పెను ఉప్పెనలు విరుచుకుపడుతున్నాయి. వీళ్ళింకా చెట్లు కాలటం లేదనుకొంటారు. కానీ మంటలు మొదలయ్యాయి. అవన్నీ నాల్కలు చాచుకుంటూ ముందుకొస్తున్నాయ్. వీటిని కొంతవరకు ఊహిస్తున్నా, అంచనా వేయగలుగుతున్న వారందరూ కూడా అందుకు భిన్నంగా ఉండలేకపోతున్నారు.

మరి ఎవరికీ పట్టకపోతే ఈ సమాజం ఏంకావాలి. ఇది ఇంకా పతనం కావలసిందేనా? తలచుకుంటే భయాలు. రాత్రులు కరుగుతుంటాయి. తెగించి ముందుకు అడుగులేద్దామన్నా ఎటుచూసినా నిరాశ. ముందే జీవనపోరాటం చావు దెబ్బ తీస్తోంది. దానిపై రోకటిపోటులా ఇది. ఇదంతా ఓ విషవలయం. దీనికి పరిష్కారమంటూ ఉందా? ఏమో... నాకు అలాంటి నమ్మకం క్రమక్రమంగా దూరం అవుతోంది.

ఇది నాలోపమే. నా బలహీనతే. ఒకప్పుడు నేనుకూడా పాడుకునే వాడ్ని రేపు మనది నిజం నిజం అంటూ. ఇప్పుడు నా గొంతు పెగలటంలేదు. ఇదివరకు రాసుకునేవాడ్ని ఒక వీరుడు మరణిస్తే ప్రభవింతురు వేనవేలని. అసలిప్పుడు వీరులు పుట్టడంలేదు. . ఉన్న వీరులంతా రాలిపోతున్నారు. ఇప్పుడొచ్చే వారంతా సిన్మాల హీరోలే. ఇంకా అర్థంకావటంలేదా?

ఒక్కో కులానికి ఒక్కో మొగుడు. వీళ్లంతా కులాలకు నాయకత్వాలు వహిస్తున్నారు. ఈ యువకులంతా వారెనకపడుతున్నారు. ఈ పెద్దవాళ్ళూ అలా తయారయ్యారు. ఇప్పుడు రాజకీయాలు రౌడీల పాలయ్యాయి. వారందరికీ గౌరవాలు లభిస్తున్నాయి. వారే మహాత్ములవుతున్నారు. ఈ సమయంలో ఎవరెన్ని చెప్పినా నాకు మాత్రం నిరాశగాఉంది.

నువ్వంటావ్... నువ్వేం చేస్తున్నావని? నేనేం చెయ్యటంలేదు. ఆ ముక్క మొదటే చెప్పాను. నేనేం చెయ్యకపోతే ఇవన్నీ చూస్తున్నా. సిగ్గుతో చితికిపోతున్నా. భోరున దుఃఖిస్తున్నా!.. అప్పును సుధీర్ మనకిప్పుడు మిగిలింది కన్నీళ్ళే"

నిజమే. హనుమంతరావుకు మొదటి నుండి కొన్ని విషయాలపట్ల కొన్ని అభిప్రాయాలున్నాయి. అవన్నీ నమ్మకాల మీద ఆధారపడినవికాదు. వాస్తవాల మీదే ఆధారపడినవి అనుకున్నాడు తను. తనుదూరం నుండి చూసి తన నమ్మకాల్ని ప్రేమించాడు. అనుభూతి చెందాడు. అదంతా స్వచ్ఛంగా ఉంటుందనుకున్నాడు. అసలు అందులో ఏ మార్పునూ ఊహించలేదు.

ఏది సమగ్రమని? ఏది శాశ్వతమని? ఏది మార్పుకు లోనవలేదని? ఇవన్నీ జీర్ణించుకోవటం అంత సులభం కాదు. అందులోనూ మనిషిలో రెండు కోణాలుంటాయి. ఓ వయసులో కొంత కొంత అవగాహనవచ్చాక ఏదో చేయాలనే తపన ఉంటుంది. కొద్దిపాటి స్పృహ ఉంటుంది. అది అసమగ్రంగానే ఉంటుంది. అందరూ పరిస్థితుల్ని ఎదిరించి ముందుకు పోలేరు.



ఒకటి మాత్రం వాస్తవం.

ఈ ప్రపంచం గురించి నిజంగా ఆవేదన చెందేవారెవరైనా సరే.... తీరిగ్గా బూతులు తిడుతూ కూర్చోరు. కనిపించిన వారందరినీ విమర్శించటం, ప్రతి విలువనూ ద్వేషించటంలో గొప్పతనం లేదు. ఒకటి నిర్మించటం కష్టం. అది చాలా కష్టాల్తో కూడుకుని ఉంటుంది. ఈ ప్రపంచంలో తాము నిర్మించేదేదీ లేనివారికి మిగిలేదేమిటి? అహంభావం.

వాస్తవాన్ని చూడటానికి అంగీకరించని, విచక్షణ చూపని, పరిమితుల్ని అర్థం చేసుకోని





వారు గతాన్నంతా కీర్తించగలరు. లేదా గతాన్ని మొత్తం తిరస్కరించగలరు. ఆ ధోరణిగల వారిద్దరూ ఒకే చోటుకి చేరతారు...

ఎందుకిదంతా... నాలోనూ ఏమిటీ మథనం. ఇదంతా పాలెం గురించేనా? వారే నా రాబోయే మార్పుల్ని ఊహించుకొని భయపడుతున్నది.

కాదు. ప్రతిచోటా ఇదే కథ.... ఇంకా దారుణమైన పరిస్థితులు. అంతకంతకూ పతనానికి తీసుకుపోవటం... దీనికంటూ పరిష్కారమార్గముందా? లేదా హనుమంతరావు చెప్పిన విధంగా అంతా నిరాశేనా?

★ ★ ★

మొత్తం మీద పాలెం రావటంలో నేను ఏం చేయాలనుకున్నానో అది కొంతవరకు సఫలం అయింది. ఓ రకంగా నా పరిశీలనలో ఆర్థికపరమైన అంశాలు తక్కువగా వచ్చి ఉంటాయి. ఆచార వ్యవహారాలూ, జీవన విధానానికి చెంది నేను నా పరిశీలనకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చి ఉండవచ్చు.

కొంచెంసేపు నేను వాటినలా పక్క నుంచి చెప్పాల్సి వస్తే ఉన్నవారంతా ఇప్పుడు తమకున్న ఆర్థిక సంబంధాల్లో ఎలాంటి మార్పులకూ అంగీకరించటం లేదు. ఒక్క ఆస్తులు పెరిగేంతమేరకు తప్పితే.

మరోవర్గం తమకంటూ కొద్దిమేర ఆస్తులున్నా... ఏదో ఒకనాడు తమ పరిస్థితి తారుమారై ఇంకా కిందికి దిగజారగలం అనే ఆలోచనలో లేరు. వారి దృష్టి ఎప్పుడూ పైపైకే ఉంది.

ఇంక ఎలాంటి ఆస్తులు లేని వర్గం ఉంది..

ఇంతమంది ఓ చోట సహజీవనం చెయ్యటం పాలెం వింత కావచ్చు. అంటే ఎలాంటి ఘర్షణలూ లేకుండా ఇన్ని వర్గాలున్నప్పుడు ఘర్షణ లేకుండా ఎలా ఉంటుంది? ఎప్పుడో హనుమంతరావు రాసిన కవిత్వం గుర్తుకువచ్చింది. అందులో రైతు దుస్థితిని గురించిన ఆవేదన ఉంది. అది తను రాసింది కాకపోవచ్చు. అయినా పాలెంనో... పాలెం చుట్టు పక్కల వాతావరణాన్నో ప్రతిబింబిస్తోంది అని.

అంటే ఘర్షణలు కూడా అదృశ్యంగా ఉండి ఉండాలి. అవి ఎంతగా అణిచి పెట్టుకున్నా అణగదొక్క బడుతున్నా పాలెంలో చోటు చేసుకొని ఉంటాయి. వాటిని గుర్తించాలి.

నేను మొత్తం మీద పాలెం గురించి స్థూలంగా రాసినా అది పెద్దనోట్స్ అయింది. నన్ను గమనిస్తున్న అక్కకు ఇదంతా ఆశ్చర్యంగా ఉంది. అయినా ముందే అడగలేదు... అలా మౌనంగా ఉండటం ఇంక చాతకాలేదేమో నన్ను అడిగేసింది.

"ఏంటిరా... నువ్వు వచ్చిందగ్గర్నుండి ఏం చేస్తున్నావో నాకు అర్థం కావటంలేదు. మా ఊరు ఒక్కసారి రారా అంటే నీకు ఇదివరకు తీరిక ఉండేది కాదు. సరే చాలా రోజులకి వచ్చావు అనుకుంటే ఇప్పుడు మాట్లాడటానికే తీరిక ఉండటంలేదు. అసలు నువ్వు చేస్తుందేమిటో నాకు చెప్పు" అంటూ కూర్చుంది.

"ఏం లేదక్కా మీ ఊరి మీద నేను థీసిస్ రాయాలనుకుంటున్నాను?"

"ఎందుకురా? అయినా నీకేం వయసు తక్కువొచ్చిందనుకుంటున్నావా? ఈ పాటికి పెళ్ళి చేసుకొని ఉంటే పిల్లలు బడిలోకి పోతుండేవారు. నీ చిన్నప్పటి నుండి అంతేరా? ఇలాంటి పిచ్చిపనులే చేస్తావు?"

"నేను నా చిన్నతనంలో పిచ్చిపనులు చేసి ఉంటానేమోగానీ, ఇది మాత్రం పిచ్చిపని కాదక్కా?"

"కాకపోతే ఏంటిరా. పాలెం గురించి నువ్వు రాయటం ఏమిటి? ఇది ఎందులో పేరు పొందిందని?నాకు కూడా కొంచెం తెలుసులేరా. నేనూ కొంచెం చదువుకున్నా. ఫలానా ఊరిలో మంచిగుడి ఉందనో, లేదా ఇంకా ఏదైనా విశేషముందనో రాస్తారు. ఇక్కడ ఎలాంటి విశేషమూ లేదు. అలాంటప్పుడు నువ్వీ ఊరు గురించి రాసేదేంటి?"

"అంటే నీ ఉద్దేశం ప్రకారం గుళ్ళూ, గోపురాలుంటేనే రాయాలి. మహానుభావులు పుట్టిన లేక పెరిగిన ప్రాంతాల గురించే రాయాలి. అంతేనా... అయినా అక్కా ఈ ఊరికి ప్రత్యేకత లేదని ఎలా అనుకుంటున్నావ్? అంతదాకా ఎందుకు ఈ ఊరికి ఎలాంటి ప్రత్యేకతలేదని మన అమ్మతో అనిపించు. నేను ఒప్పుకుంటా. మీ ఊరివాళ్ళు భోంచేసిన

విధంగా మేం భోంచేయగలమా? మీ ఊరి కున్న సంప్రదాయాలు మాకున్నాయా?'' అన్నాను. ''ఒరేయ్ వెధవ జోకులాపు. నాకెందుకో నీ మీద అనుమానంగా ఉంది?'' అంది సీరియస్‌గా

''ఏమిటంట'' అన్నాను.

''ఇంతకాలమైంది. పెళ్ళి చేసుకుంటానని అనవు. ఆదేంటిరా అంటే ఉద్యోగం చేయాలంటావు. అందుకు ప్రయత్నం చేస్తేనే కదా వస్తాయి. అలాంటిదేం లేదు. అంటే నీకు ఉద్యోగం చేసే ఆలోచన లేదన్నమాట. పైగా ఇప్పుడు ఏమిటేమిటో మాట్లాడుతున్నావు. నాకు నిజం చెప్పరా. నీ ఆలోచన ఏమిటో చెప్పు. నేనేం మీ బావకు చెప్పనులేరా?'' అంది.

నాకు నవ్వొచ్చింది. ''చూడమ్మా మీవారంటే నాకు భయం ఏమీ లేదు. ఏదో పెద్దాయన చిన్నప్పటి నుండి ఆయన చూస్తుండగా పెరిగాను. ఆయన నన్ను తిట్టాడు. కొట్టాడు. ఈ రోజుకీ ఆయన ముందు నిలబడి మాట్లాడాలంటే బెరుగ్గా ఉంటుంది. ఇదంతా ఆయనంటే భయంతోకాదు. ఆయన్ను నాతో మాట్లాడమని చెప్పు. నేనెలా మాట్లాడుతానో చూడు''

''అలా అయితే మరింకేం చెయ్యదలుచుకున్నావ్. రాజకీయాల్లోకి దిగుతున్నావు కదూ... అంతేనా'' అంది.

''అబ్బే అలాంటిదేం లేదక్కా... ఓ వేళ రాజకీయాల్లోకి దిగాననుకో. అప్పుడు నన్ను చూసి నువ్వేమనుకుంటావక్కా''

అక్క నాకేసి దిగ్భ్రాంతితో చూసింది. ఆ కళ్ళలో ప్రేమా, ఆశ్చర్యమూ, చిన్ననాటి అక్కలోని కాంతీ నేను గమనించాను.

''ఎందుకురా... రాజకీయాల్లోకి అవి కూడు పెడతాయా?''

''రాజకీయాలు కూడు పెట్టటానికోసం కాదక్కా. అయినా కూడు లేని వారి కడుపులు కొట్టుకుతినేవేగా నేటి రాజకీయాలు. నేను వాటి గురించి మాట్లాడటం లేదు''

''అంటే... అంటే...'' అంటూ ఆగిపోయింది.

చాలాసేపటి తర్వాత అంది.

''నీ ఇష్టంరా. నువ్వేం చేసినా నాకు నచ్చుతావు. నిన్నిలా చెయ్యమని నేను చెప్పాలనుకోవటంలేదు. నీ వయసు వారందరూ పెళ్ళిళ్ళు చేసుకొని ఉద్యోగాల్లో, వ్యాపారాల్లో చేసుకుంటున్నారు. వారందరినీ చూస్తున్నప్పుడు ఇదేంటి వీడు ఎటూ కాకుండా పోతున్నాడనిపిస్తుంది. ఇప్పుడు నాకూ అనిపిస్తోంది. నేను కన్న కలలన్నీ ఏమైపోయాయి? ఎంత సాధారణంగా బతుకుతున్నాను? ఎంత భయపడి బతుకుతున్నాను. భయం అనేకంటే మనకెందుకులే అనే నిర్లిప్తత. ఈ ఊర్లో ఆడవాళ్ళు చాలా భయంకరమైన అభిప్రాయాల్తో ఉన్నారు. వారిలో ఇతరులపట్ల అభిమానం లేదను. కానీ ఒకరి వెనకాల ఒకరు మంచిగా మాట్లాడుకోరు. ఇదంతా సరయిందికాదని నాకు చెప్పాలని ఉంటుంది. కానీ వీరు మారరు. వీళ్ళతో మన కెందుకులే అనిపిస్తుంది. వారేం చెప్పినా మౌనంగా వింటాను. విన్నట్లు నటిస్తాను. అయినా నా గురించి మంచిగా చెప్పుకుంటారని నేననుకోవటం లేదు. వారేం చెప్పుకున్నా నేను లెక్కచేయను. అదలా ఉంచు... వారు మాట్లాడే విషయాల్లో తప్పని తెలిసినవే, నేను అంగీకరించలేనివే ఉన్నా నేను ఎందుకు చెప్పలేకపోతున్నాను. ఖచ్చితంగా భయపడికాదు.

అంతగా పోట్లాడాల్సివస్తే వారికంటే పెద్ద గొంతుకతో నేను పోట్లాడగలను. మరెందుకు నాలో ఈ మార్పు వచ్చింది? ఎప్పటి నుంచి వచ్చింది. బహుశా నా పెళ్ళితో ఆరంభమైందనుకుంటాను.

నేను మీ బావంటే భయపడుతున్నానా? లేదు నాకెలాంటి భయం లేదు. అవసరమైతే ఆయన్ని ఎదిరించగలను. ఆయన్నే కాదు ఈ ప్రపంచాన్నే ఎదిరించి బతగ్గలననే విశ్వాసం నాకుంది. నా పెళ్ళి అయ్యాక నాలో చిత్రమైన మార్పు వచ్చింది. అసలీ పెళ్ళి ఎందుకు? బతకటం కోసమేనా? పిల్లల్ని కనటంకోసమేనా? వారి కోసం ఆరాటపడటం కోసమేనా? నాకిదంతా చాలా అసహ్యంగా అనిపించింది. నాన్న ప్రేమింకా నాకు గుర్తుంది. అమ్మకు ఎంత ఇష్టం లేకపోయినా నా స్వేచ్ఛను అరికట్టలేకపోయింది. అప్పటి స్వేచ్ఛ ఎందుకని




నువ్వు అడగొచ్చు. నిజంగా ఆ స్వేచ్ఛ నా కోసం. నేను గొంతెత్తి పాడుకున్నాను. గంతులేస్తూ ఆడుకున్నాను. వానల్లో హాయిగా తడిసి ముద్దయ్యాను. ఇవన్నీ ఎందుకంటే ఏం చెప్పను? ఇవన్నీ వద్దంటే ఏం చెప్పను?

ఇలాంటి అనుభూతి ఏ వయసులో అయితేనేం... ఇలాంటివన్నీ పెద్దాళ్ళం అయినంత మాత్రాన వద్దా? మీ బావకు కొన్ని అభిప్రాయాలున్నాయి. ఆయన అమ్మకు కొన్ని ఉన్నాయి. ఆయన నాన్నకు కొన్ని. మరి నాకూ ఉంటాయి కదా. మనుషులన్నాక ఒకరి నొకరు గౌరవించుకోవాలి. మనం ఇతరుల్లో ఆమోదించలేనివి అనేకం ఉంటాయి. అంతమాత్రాన అందరినీ దూరం చేసుకోలేం.

పెళ్ళి అంటే కొన్ని కట్టుబాట్లనీ, మనం కొన్ని పరిమితుల్లో బతకాలని అర్థం అయింది. నాకప్పుడు ఎదిరించాలనిపించలేదు. నాకేం కావాలో నాకు స్పష్టంగా తెలియదు. నేను కోరుకునేవి చాలా చిన్న అంశాలు. అవి అభిరుచులకి చెందినవి. అవేం ప్రమాదకరమైనవి కాదు. అయినా అలాంటివి కూడా నిషేధాలు. నేను వానలో తడవటం కోసం నా భర్తకు దూరంగా జరుగుతున్నానంటే ఎలా ఉంటుంది? ఎవరి దాకానో ఎందుకు నేనే అలా ఎవరైనా చేస్తే అర్థం చేసుకోలేకపోవచ్చు.

మరి వానలో తడవటానికి కూడా లేని ఈ బతుకు ఎందుకు? తినటం కోసమేనా? చిన్నతనం నుండి తింటూనే ఉన్నాం కదా... మరి పెళ్ళి అయ్యాక కొత్తగా వచ్చిందేమిటి? పురుషుడి గురించి తెలియటం. పిల్లలు పుట్టుకురావటం... నేనేం చేయలేకపోయానో అవి వారు చేస్తుంటే చూడాలనుకోనా? నాలోనూ కొత్త ఆలోచన లొస్తాయా?

ధగధగలాడే చీరలు... మెడనిండా నగలు... పెరుగుతున్న పొలాలు... ఇంట్లో రకరకాల వస్తువులు... ఇవేనా కావల్సింది. వీటి మీద నాకెప్పుడూ ప్రేమేలేదు. ఇంతకు మించిన మహత్తరమైన గమ్యం లేదెందుకు అంటే అర్థంచేసుకోవచ్చు. నా పిల్లలు నా దగ్గర లేరు. వాళ్ళెక్కడో చదువుకుంటున్నారు.

ఎందుకని ఈ వయసు నుండే వారు నాకు దూరంగా ఉండాలి.

వారు పెద్ద చదువులు చదివి ఏం చెయ్యాలి. ఉద్యోగాలేనా? వ్యాపారాలేనా? ఇంకా ఇంకా సంపాదించటాలేనా? అందుకోసమే అయితే వారిని నా నుండి దూరం చెయ్యటం ఎందుకు? ఇప్పుడు మీ బావగారు చేస్తుంది అదేగా. ఆయన నిద్రాహారాలు మాని సంపాదించేదంతా పిల్లల కోసమేగా... వారిని ఇప్పట్నుంచే చదువుల పేరుతో నిర్బంధించటం ఎందుకు?

అక్క ఇలా మాట్లాడుతుందేమిటా అనుకుంటున్నావా? ఒకటి గుర్తుంచుకో. ఈ ఊరిలో ఎవరినైనా స్వేచ్ఛగా మాట్లడమను. ఎవరి భావాలు ఏమిటో తెలుసుకోవటానికి ప్రయత్నం చెయ్యి. ప్రతిదీ అద్భుతం అనిపిస్తుంది. చాలా సంవత్సరాల తర్వాత మాట్లాడుతున్నాను. అందులోనూ సాంప్రదాయ గృహిణి పాత్రకు ఇవతలగా వచ్చి మాట్లాడుతున్నాను.

ఆలోచించటం, ఎదిరించటం, త్యాగం చెయ్యటం, ధైర్యం కలిగి ఉండటం ఇవన్నీ ప్రత్యేకంగా కనిపించవచ్చు. ప్రత్యేకమైనవే. కానీ ఇవన్నీ జీవితంలో భాగం కావాలి. ఈ లక్షణాలన్నీ ఎప్పటికప్పుడు పదును బెట్టుకోవాలి. లేకపోతే ఏమౌతుంది. అవన్నీ మనలో అడుగంటటం ఆరంభిస్తాయి. ఏదో ఒకనాటికి సొంతం మృగ్యం అవుతాయి.

వాన ఎప్పుడు వస్తుంది. ఏ సంవత్సరానికో రెండు మూడు నెలలు మాత్రం కురుస్తుంది. అది కూడా నాకు ఆహ్లాదకరమైన వాన చినుకులు చాలా అరుదుగా వస్తాయి. అవి నన్ను తడిపి వెళ్ళలేదనే బాధ నాకు ఉంటుంది. ఆ దృశ్యమూ నా బాల్యం గుర్తొచ్చి నా మీద నాకే జాలికలగవచ్చు.

కానీ ఆ రకమైన స్వేచ్ఛ కంటే ముందు కడుపుకు తిండి ఉండాలి. ఈ ఆరాటం అంతా దానికోసమే కదా. నాకు తింటానికి లేకపోతే నేనేం చేసేదాన్నో నాకు తెలియదు. మరి అలాంటివారంతా ఏం చేస్తున్నారు? ఎందుకు ఊరుకుంటున్నారు. ఇవన్నీ ఆలోచించుకుంటే నాకు నవ్వు వస్తుంది.

నేనిలా అవటానికి కారణం నాకేం కావాలో నాకు తెలియకపోవటం... వారికీ అంతే అను




కుంటాను. ఏ పనిలోనైనా మనకు ప్రావీణ్యం రావాలంటే... అది మనం ఎంత శ్రమ చేస్తున్నాం అనే దాని మీద ఆధారపడి ఉంటుంది. ఎదిరించటమూ అలాంటిదే... ఎంత దారుణంగా మనం బతికేస్తున్నామంటే...

మన పనులు మనం చెయ్యలేం... ఎవరో చేసి పెట్టాలి. మన ఆలోచనలూ అంతే. మన కోసం ఎవరో ఆలోచించాలి. మనకోసం ఎవరో ఎదిరించాలి. మనకోసం ఎవరో త్యాగం చెయ్యాలి. ఇవన్నీ మనకు మనం సాధించుకోవాలని తెలుసు. అర్థమవుతూనే ఉంది. కానీ మనం వాటన్నింటికీ దూరంగా జరిగిపోతున్నాం.

చిన్న చిన్న వాటినే అంగీకరించని ఈ ప్రపంచంలోకి నువ్వు రాజకీయాలు తీసుకొని వస్తానంటున్నావు. మరి నువ్వేం కావాలని కోరుకుంటున్నావో నాకు తెలియదు. నీ రాజకీయాలు ఎవరి కోసమో కూడా నాకు తెలియదు.

కానీ నాకు ఒకటనిపిస్తుంది. పని తప్పితే మరో ప్రపంచం లేని వారికి ఆలోచన కష్టమే. అలాంటి వారి కోసమే నువ్వు రాజకీయాల్లోకి వస్తానంటే నేను అర్థం చేసుకుంటాను. నీలాంటి వారు చాలా మంది వచ్చారు. మరెందుకని ఇలానే ఉందిదంతా... ఏమో నేను ముందే చెప్పాగా... నేనింకా ఆలోచించలేదు. అది చెప్పాల్సింది నువ్వు. నువ్వేం చేసినా నాకు సంతోషమే. కానీ ఏం చేయకుండా ఉండటమే నాకు నచ్చదు'' అంది అక్క.

అక్క జీవితంలో మొదటిసారిగా నాతో ఇంత దీర్ఘంగా ఇప్పుడే మాట్లాడిందనుకుంటాను. ఆమె ఏం చెప్పిందో, ఏం చెప్పలేదో కూడా నేను చెప్పలేనంతగా చెప్పింది. ఇవే మాటలు కాషాయ వస్త్రాలు ధరించి చెబితే తన్మయత్వంతో వింటారు. కానీ అవి జోకొట్టడానికి. ఆలోచించటానికి కాదు. అక్క తనకు అందుబాటులో ఉన్న పుస్తకాలకు మించి ఏమీ చదవలేదు. అయినా ఇంత సూటిగా, ఇంత అద్భుతంగా ఎలా చెప్పగలిగింది. జీవితానుభవమేనా?

నేను నా జీవితాన్ని ఎలా రూపొందించుకోవాలనే విషయంలో స్పష్టమైన ఆలోచనల్తో లేను. రాజకీయాల్లోకి రావటం అనే అంశం కూడా సరదాగా అన్నాను. అంతగా అయితే ''ఏడ్చావులేరా?'' అంటుందేమో అనుకున్నా. కానీ ఇంత సీరియస్‌గా చెబుతుందని అనుకోలేదు.

ఆమెలో ఎందుకింత భావావేశం వచ్చిందో నేను చెప్పలేను. తను అన్నట్లుగా ఈ గ్రామంలోఉన్న ప్రతి మనిషినీ కదిలించగలిగితే ఇలాంటివెన్నో వినవచ్చు. ఈ అనుభవాలన్నింటినీ సమన్వయం చేసే ఓ సిద్ధాంతం ఉంటే... ఆ వెలుగులో ఓ బాట కనిపిస్తుందనుకుంటాను...

అక్క మాటలు నెమరు వేసుకుంటూ నిద్రపోయాను... నాకు నిద్రపోయేముందు, నేనింకా ఈ ప్రపంచం గురించి బాగా తెలుసుకోవాలనే ఆసక్తి కలిగిననాడు... నన్ను చూసి ముచ్చటపడి నా మావయ్య రాసిన మాటలు గుర్తొచ్చాయి. ఆయన ఈ మాటల్ని ఇంగ్లీష్‌లో రాశాడు. అవి కూడా ఎవరో ప్రముఖులు చెప్పిన కొటేషన్ అయి ఉంటుంది. అది ఇలా ఉంటుంది.

''బావి తనంతటాను భూమి లోతుల్లోకి దిగదు

అది శ్రమతో చేయవలసిన కర్తవ్యం కాబట్టి''

అక్క కూడా ఆ విషయాన్నే మరోసారి చెప్పిందనుకుంటాను.

★ ★ ★

నేను నిద్రలేచాను...

అక్క టీ అందించింది మౌనంగా. నేను చిరునవ్వుతో అందుకున్నాను. ఎందుకో అక్కకేసి చూడాలంటే ధైర్యం చాలలేదు. బహుశా నేను ఆమెను తక్కువ అంచనావేశాననే భావం నాలో ఏదోమూల ఉండి ఉంటుంది.

''ఏంటిరా తలొంచుకు తాగుతున్నావే. పంచదార సరిపోయిందా?'' అంది. అప్పుడు తలెత్తాను ''సరిపోయింది'' అంటూ.

అప్పుడు అక్క ఎంత మామూలుగా ఉందంటే... మా నడుమ సంభాషణ జరిగింది... అందులో తను ఆవేశంగా మాట్లాడిందనటానికి ఎలాంటి దాఖలాలు లేనంతగా. మేమలా కూర్చుని ఉండగానే కృష్ణ

మూర్తిగారు రావటం జరిగింది. నేను హను మంతరావుతో కూర్చోవటం ఆరంభించాక... కృష్ణమూర్తిగారిని కలుసుకోవటం కుదరలేదు.

"మీ బావ రాలేదంటయ్యా" అన్నాడు.

"లేదు" అన్నాను.

"అయితే ఈసారి పనిపూర్తిచేసుకొనిగాని రాడనుకుంటూనే" అని తనలో తాను అనుకొని

"ఇక్కడే ఉంది బొత్తిగా నల్ల పూసవైపోయావయ్యా" అన్నాడు.

"ఎక్కడండీ... మీరే కనపడటంలేదు. అసలు ఆ పొలం పండుతా అనాలేగానీ నెలకో పంట తీస్తారనుకుంటా" అన్నాను.

"ఆ... పండినయన్నీ పురులు కట్టించి పోస్తున్నాంగా. మన ఆరాటమేనయ్యా... ఏదైనా నోటి దగ్గరకొచ్చినాక లెక్క" అన్నాడు. కొంచెం సేపటి తర్వాత తనే మొదలు పెట్టాడు.

"మీ బావది మహాగట్టి బుర్రయ్యా... మాదే వుంది చెప్పు... ఇదిగో ఎన్ని సంవత్సరాలు వ్యవసాయం చేసినా ఎకరాకి ఆ పాతిక మించవు"

"మరి ఈయన మాత్రం అంతకంటె ఎక్కువ ఏం పండించాడుంట"

"ఏం పండించటం ఏమిటయ్యా సామి. ఆ బెజవాడలో తక్కువ సంపాయించాడా?"

"మరి ఆ సంపాదన వదులుకొని ఇక్కడి కెందుకంట రావటం?"

"ఆయనంత తెలివి తక్కువవాడు కాదులే వయ్యా... తనకు సరిపోయినంత సంపాయించుకున్నాడు. ఇక్కడి కొచ్చాడు. ఇక్కడేం ఖాళీగా కూర్చోడు" అన్నాడు. మొత్తంమీద ఆయనేదో చెప్పాలనుకుంటున్నాడని పించింది. మా బావ ఏం చేయబోతున్నాడో మాకు తెలియదు. మేమయితే అడగం. ఆయన కూడా చెప్పడు. కృష్ణమూర్తిగార్కి చెప్పి ఉంటాడా అనేది సందేహం. చెప్పకపోయినా అవులిస్తే పేగులు లెక్కపెడతాడు.

"ఎంత చేసినా మా అయితే ఇంకో నాలుగు బస్తాలు పండిస్తాడు- అంతేగా" అన్నా

"అది కాదులేవయ్యా"

"ఏదికాదు... ఈమాత్రం భాగ్యానికి ఈ ఊరు రావాలా? అందుట్లో మీ ఊరికి గ్రాండ్ ట్రంక్ రోడ్ కూడా ఉందిగదా" అన్నాను.

"వోయబ్బో. చాలా దాకుందే వ్యవహారం. నీపాటి తెలియదనుకోవాకయ్యా... ఆ బెజవాడలో నాలుగు డబ్బులు సంపాయించుకోవచ్చు నేమోగానీ... ఇంకంటాక్సులోల్లకి, సేల్స్‌టాక్స్ లోల్లకి దండాలెట్టొద్దంటయ్యా. అడ్డమయిన పతోడు డబ్బులు గుంజుకోవటానికి తయారైవస్తారు. అందుకే ఇక్కడికొస్తే అలాంటి పీడుండదు. అసలు నీకు తెలియదేమో అలాంటి చోట్ల యాపారాలు చేయటమంటే మాటలు కాదు. ఓ మొగుడు కాదు వాళ్ళకి. రౌడీ మామూలి వ్వాలి. ఎలక్షను పండివ్వాలా.. పోనీ ఇయన్నీ చేసి నాలుగు డబ్బులు వెనకేశారే అనుకో. ఏ గొడవలో జరుగుతాయి. ఆ రౌడీ నా కొడుకులు బద్దలు చేసుకొని తీసుకుపోతారు"

"పోలీసులున్నారుగా?"

"ఏందయ్యా మాట్లాడితే పోలీసులు పోలీసులు అంటావు. ఆళ్ళేం చేత్తారు. అన్నీ అయిపోయినాక వెనకాలొస్తారు. అందుకే మీ బావయ్య తెలివితేటలు కలవాడయ్యా అంటున్నా. ఇప్పుడు పట్నాల్లో వ్యాపారాలు చేసుకునేది కనపడటంలా. అందుకే ఇక్కడి కొచ్చాడు ఇక్కడయితే ఎవడి సమస్యా ఉండదు గదా"

నేనేదో తిరిగి కృష్ణమూర్తి తన ధోరణిలో మాట్లాడుతున్నాడులే అనుకున్నాగానీ... కొత్త విషయాలు చెబుతున్నాడు. పట్టణ సంబంధాల నుండి, పల్లెలకు వస్తున్నాడు బావ. ఇంతకు ముందు షావుకారు 'పాలెం' నుండి కొంత భాగాన్ని పట్టణానికి తరలించాడ న్నది చూసిందే...

నాకు ఇప్పుడు ఓ దృశ్యం కనిపిస్తోంది... ముందసలు కృష్ణమూర్తి నుండి ఇంకా వివరాలు రాబట్టాలి.

"అది సరేనండి. ఇంతకూ బావ ఏం చేయాలనుకుంటున్నాడు?"

"చాలా పెద్ద ప్లానులో ఉన్నాడు. నేను మొన్నటి దాకా మా షావుకారే తెలివిగల వాడనుకున్నానయ్యా... అసలు పట్నం లీలలు తలుచుకుంటే చాలా ఆశ్చర్యంగా ఉంది. ఆయనకి వందెకరాలుంటే ఏందయ్యా... అందులో పదేళ్ళు పండే పంటమీది ఆదాయా





# సరియైన ధరలో సర్వోత్తమమైన షాంపూకోసం వెదకడం ఇక్కడతో మొదలై...

| బ్రాండు | *ధర (రూ.) | |
|---|---|---|
| లాక్మే | 25.00 | (పన్నులన్నిటితో సహా) |
| సన్‌సిల్క్ | 23.10 | (స్థానిక పన్నులు అదనం) |
| హేలో | 22.00 | (స్థానిక పన్నులు అదనం) |
| వెల్‌వెట్ | 13.50 | (పన్నులన్నిటితో సహా) |

*బొంబాయిలో మే 21. '90 తారీకునాడు 100 మి. లీ. ధర

# ...ఇక్కడ పూర్తయిపోయింది.

సాషే కేవలం 1 రూపాయలో







కేవలం యీ మాత్రపు ధరలోనే మీ యింట్లో వాళ్ళు పొందగలుగుతారు అందమైన, సుతిమెత్తని, పొందికగా అమరే జుట్టు. మీ జుట్టు పోషణకోసం వెల్‌వెట్ ఎగ్ కండీషనర్ షాంపూ మరియు పొడుగైన, నల్లని జుట్టుకోసం వెల్‌వెట్ బ్లాక్ కండీషనర్ షాంపూ

## వెల్‌వెట్ యొక్క మెరుపు: కేవలం సగం ధరలో

## డిస్ట్రిబ్యూటర్లు: గోద్రెజ్ సోప్స్ లిమిటెడ్

90/pc/185-II

న్ని సంవత్సరంలో తీస్తాడు మీ బావ. నేను షావుకార్ని మించినోడు లేడనుకున్నా... ఈ ఊరికి ఇంకోడొచ్చాడయ్యా'' అన్నాడు.

''ఇంతకూ విషయం చెప్పకుండా మిగతా విషయాల్లోకి వెళ్తున్నారు మీరు''

''మీ బావ ఇక్కడ రొయ్యల చెరువులు తవ్వించాలనుకుంటున్నాడు''

''రొయ్యల చెరువులా?''

''మరేంటనుకున్నావ్... రొయ్యల చెరువులే. అయి కూడా తన డబ్బుల్తో తవ్వించడు. గవర్నమెంటు నుండి లోన్ తీసుకుంటాడు. అంతేనా ఆ తవ్వించిన మట్టి అమ్ముకుంటే చాలు... పెద్ద పెద్ద గట్లు వేస్తాడంట. ఆటిమీద కొబ్బరిచెట్లు నాటిస్తాడు... అయన్నీ పెద్దయితే ఎంత ఆదాయమో చూడు. ఆ పనుల మీదే తిరుగుతున్నాడు''

''మరి మీ ఊరి రోడ్డు గురించి చెప్పావు కదా'' అన్నా

''అవునయ్యా చెప్పాను. మరివ్వన్నీ గొడవలుగా ఉన్నాయి. అవన్నీ నీకు అర్థంకావులే. నేను పోతన్నా'' అంటూ లేచి వెళ్ళిపోయాడు.

నాకిప్పుడు చాలా స్పష్టంగా విషయాలు అర్థమవుతున్నాయి. ఇప్పుడు నిజంగానే 'పాలెం' ఓ మలుపు దగ్గరకొచ్చింది.

బావవాళ్ళు పెద్దగా ఉన్నావాళ్ళేం కాదు. మధ్యతరగతి రైతులు. బావని మాత్రం వాళ్ళ నాన్న చదివించాడు. ఆయనకు మొదటి నుండి ఉద్యోగం చేయాలని లేదు. అప్పటికే దేశంలో నిరుద్యోగం ఉంది. అయితే కొన్ని రంగాల మీద ఎవరికీ దృష్టిలేదు. అలాంటి చోట ఉద్యోగాలు లభిస్తున్నాయి. అయినా కొంత ప్రయత్నం చేసుకోగలిగే వారికి ఉద్యోగాలు దొరుకుతున్న రోజులివి. అయినా కూడా బావ అటు చూడలేదు.

ఎవరికీ ఇష్టం లేకపోయినా మెల్లగా వ్యాపారంలోకి ప్రవేశించాడు. అంచెలంచెలుగా పైకి వచ్చాడు. కృష్ణమూర్తి చెప్పినట్లుగా అధికారులు పీడించటంవలన మాత్రమే ఇక్కడకు వచ్చాడనుకోవటం సరయింది కాదు. అధికారులు చిన్నస్థాయి వ్యాపారులను భయపెట్టగలరే





మొగానీ ఓ దశ దాటినవారిని ఏమీ చేయలేరు.

అసలు రెండుపక్కలా కూడా దీన్ని సహకారం అనుకుంటారు. తమ సంపదలు పెరగాలంటే అధికారులు సహకరించటం తప్పనిసరి. అలాగే అధికారులకు నగరాలు చాలా చాలా కోర్కెల్ని రగిలిస్తుంటాయి. ఆ ప్రలోభాల్ని తట్టుకోవాలంటే వ్యాపారుల దగ్గర్నుండి రాబట్టుకోవాలి. ఈ కార్యక్రమం ఇప్పట్లో పూర్తికాదు. ఇది కొన్ని వందల సంవత్సరాలపాటు కొనసాగాల్సిందే. ఇంక పట్నంలో రౌడీల గురించి. వీరి ఇబ్బంది ఉన్నది కూడా వాస్తవమే. ఇది కూడా చిన్నవారికే. ఇలాంటి బృందాల్ని సృష్టించేదే వ్యాపారవర్గం తమ తమ వ్యాపార వ్యవహారాలు సజావుగా జరగాలన్నా తమ రంగంలోని పోటీని ఎదుర్కోవాలన్నా తమ కంటూ అలాంటి బృందం ఉండాలి. అందుకే వాటిని తమ అవసరాల్లో భాగంగానే పోషిస్తారు. అలాంటి వాటిల్లో కొందరు పైకి వచ్చి స్వంత వ్యక్తిత్వాన్ని ప్రదర్శించవచ్చు. అది వేరే విషయం.

ఈ బృందాలకు కులం రంగు పూస్తారు. అప్పుడుగానీ వీటిమీద ఆరాధన పెరగదు. అయినా కూడా ఓ వ్యక్తి తమ అవసరాలకు అతీతంగా ఎదిగినా, తమకు అడ్డు తగులుతున్నా తమకు ప్రమాదకరంగా మారుతున్నా ఇంకేమాత్రం సహించలేరు. అలాంటప్పుడు చాలా చిత్రమైన పరిణామాలు జరుగుతుంటాయి. అంతవరకూ ప్రత్యర్థులుగా ఉన్న వర్గాలు ఏకం అవుతాయి. అంతమాత్రాన వాటి విభేదాలు అంతం అయిపోతాయని కాదు.

కొత్త వాతావరణంలో గ్రామీణ మోతుబరులంత మొరటుదనం ఉండదు. వారు అభిప్రాయబేధాల్ని అవి ఎంత తీవ్రమైనవన్నా పక్కనబెట్టి, ఏకం కాగలరు. ఇక్కడ వారికి కావలసింది ప్రయోజనం మాత్రమే. తమతమ ప్రయోజనాలకు మాత్రమే సృష్టించినవాటిని తమకు వ్యతిరేకంగా ఎదగనివ్వరు. వాటిని నాశనం చేస్తారు. తిరిగి ఎవరి పోటీ ప్రపంచంలోకి వారు వెళ్తారు.

కొత్త బృందాల సృష్టి జరుగుతుంటుంది. అవలా మేకులా రూపాందేంత వరకూ సాగు

తుంది. కాబట్టి దౌర్జన్యం సమస్య కూడా అంద రిదీ కాదు. వ్యాపారాల్లో రానిబాకీలు అనే ఖాతా ఉంటుంది. అలాగే వ్యాపార నిర్వహణ ఖర్చు లు అనే అంశం ఉంటుంది. ఇలాంటివన్నీ వాటిల్లోకి చేరిపోతాయి.

కృష్ణమూర్తిగారికి ఇలాంటివన్నీ అర్థంకావు. అర్థంకావంటే తను వాటికి దూరంగా ఉన్నా డు. దూరం నుండి చూస్తున్నప్పుడు కొన్ని వికృతమైనవి అందంగా కనపడతాయి. కొన్ని అందమైనవి వికృతంగా కనిపిస్తాయి.

సమాజంలో ఇలా దౌర్జన్యకర బృందాల చరిత్ర అంతా డబ్బున్నవర్గాల నడుమ కొ ట్లాటే. అది కనిపించకుండా ఉండటానికి మాత్రమే కులాల రంగూ, మతాల రంగూ పులుముతారు. దాంతో కొందరు ప్రజలు వాటి లోకి ఆకర్షింపబడతారు. పత్రికలు వాటికి ప్రా ధాన్యం ఇస్తాయి. ఇవన్నీ కూడా ప్రజా ఉద్యమా లుగా చిత్రించబడతాయ్... ఈ పరిణామం కూడా ఎంతోకాలం ఉండదు.

ఇలాంటి విషయాలు కృష్ణమూర్తిగారికి అర్థంకాకపోవటంలో ఆశ్చర్యం లేదు. కానీ రాంబాబులకు అర్థంకావాలి. రాంబాబులకు అర్థం కావాలంటే వారిని ఆ దిశగా వినియో గించుకోవాలి. అంటే రాంబాబు చేసే సమీకర ణల కంటే... ఇంకో రాంబాబు వెళ్ళి ఎవడ్నో నరకటం కంటే ముందు వారు సామాజిక సంబంధాలను అర్థంచేసుకోవటం ముఖ్యం.

సామాజిక సమస్యలను అర్థం చేసుకోకుండా ముందుకు వెళ్తే ఆ అడుగులు సరిగా పడవు. ఇక్కడ ఇంకో చిన్నసమస్య ఉంది. అన్ని సమస్యల గురించి అర్థంచేసుకున్నాకే ఆచర ణలోకి దిగాలా అనేది. ఇవి రెండూ కొంచెం భిన్నమైనవి కూడా. ఓ విషయం మనకు పూర్తిగా అర్థం అయేంత వరకూ రంగంలోకి దిగనంటూ కూర్చుంటే ఈ జీవితం చాలదు. ఏ విషయమూ పూర్తిగా అర్థంకాదు. అలాగే కొత్తకొత్త ధర్మాలు తెలుస్తుంటాయి. వాటిని పట్టుకొని ముందుకు వెళ్తుంటేనే, తప్పులు చేస్తున్నా ఏదో ఒక రోజు మన గమ్యాన్ని చేరవచ్చు అలా అని చెప్పి ఓ విషయాన్ని ఏమీ అర్థంచేసుకోకుండా ముందుకు వెళ్తే గుడ్డి వాడి వెదుకులాటలా ఉంటుంది. వాళ్ళు ముందుకు వెళ్ళటం అంటూ ఉండదు. ఉన్న చోటులోనే ఉండి తాము ఓ గిరిలో కదులుతు న్నారు. కాబట్టి ముందుకు వెళ్తున్నామనే భ్ర మలో ఉండటం జరుగుతుంది.

కృష్ణమూర్తికి సామాజికంగా జరుగుతున్న ఈ మార్పుల్లో అంతకంతకూ బలపడుతున్న వర్గాలు ఈ పరిణామాల్ని కూడా తమకు అను కూలంగా మార్చుకోవటంలో ఎంత ముందుంటారో తెలుసుకుంటే నిజంగానే షాక్ తింటాడు.

'ఇన్సూరెన్స్' కంపెనీలు ఇలాంటివారి ప్ర యోజనాలకు ఏర్పడినట్లు చెప్పకపోయినా వారికే ఉపయోగపడతాయి. అందుకే గోడౌన్లు తగలబడిపోతుంటాయి. మరికొన్ని చిత్రాలు జరుగుతుంటాయి. మామూలు వ్యాపారులు 'ఇన్సూరెన్స్' అవసరాన్ని తెలుసుకోరు అనుకో వటం కంటే చాలామందికి అందుకోసం డబ్బు చెల్లించటం వృధాగా కనపడుతుంది. ఊహించని అవాంతరాలు వచ్చినప్పుడు కుప్పకూలిపోతారు. అవి మనుషులు కల్పించే వికావచ్చు లేదా ప్రకృతి కలిగించేవి కావచ్చు.

బావ ఎంత సంపాదించాడో నాకు తెలియ దుగానీ, తను చిన్న వ్యాపారేం కాదు. అలా అని చెప్పి పెద్దవ్యాపారి కూడా కాదు. అయ నలో కొన్ని లక్షణాలున్నాయి. ఆధునిక ప్ర పంచంలో వస్తున్న మార్పుల్ని ఆయన అర్థంచేసుకోగలిగాడు. ఆయన కొత్తకొత్త వ్యాపా రాల్లోకి చొచ్చుకుపోగలడు. అవి నిర్వహించ గల సామర్థ్యం కూడా ఉంది. అయినా కూడా ఆయనలో కొంచెం బద్ధకం ఉంది. అన్నింటినీ ఇతరులమీద వదిలి పర్యవేక్షించటం సామా న్యం కాదు. అందుకు శ్రమించాలి. ఆ రకమైన శ్రమపడటానికి ఆయన ముందుకురాలేదు. నగరజీవితం కూడా ఆయనకు నచ్చి ఉండక పోవచ్చు. అందుకే తిరిగి తన స్వంత ఊరు రావటం... బావ స్వంత ఊరు వస్తున్నాడే గానీ... తన్తోపాటు ఓ సంచలనాన్ని తీసుకువస్తు న్నాడని అక్కడివారికి అప్పుడు తెలిసిఉండ దు.

పెట్టుబడిదారీ సంబంధాలు గ్రామాల్లోకి, వ్యవసాయరంగంలోకి కూడా వేగంగానే చొచ్చు

కువస్తాయి. చొరబడటమే కష్టం. అందులోనూ అవి పాత సంబంధాల కంటే మెరుగ్గా ఉంటాయి. నాజూగ్గా ఉంటాయి. ఇంతకు ముందు పొలెంలో ట్రాక్టరు లాంటి వాటిని వినియోగించటం జరిగింది. అయితే అవి వ్యవసాయరంగంలోకి చొచ్చుకు వొచ్చి చాలా కాలమైంది. వాటి ఫలితాలు అనుభవించటం కూడా జరిగిపోయింది. ఇప్పుడలా కాదు. పెను మార్పులకు పునాదులు పడుతున్నాయి. పొలెంలో పండించే ప్రధాన పంట వరి, రెండో పంటగా పిల్లిపెసర, మినుములు, వేరుశనగ లాంటివి. అలాంటిచోట బావ చెరువులు తవ్విస్తున్నాడు.

"బంగారం లాంటి పొలాన్ని చేపలచెరువులు తవ్వించటం ఏమిటిరా? ఎప్పుడూలేంది వింటున్నాం" అన్నారు వెనకటితరం వారు.

అసలు వారికి ఇదంతా సజావుగా జరుగుతుందనే నమ్మకం లేదు. తప్పకుండా బావ చేతులు కాల్చుకుంటాడనుకుంటున్నారు వాళ్ళు. కానీ అందరూ అలా అనుకోవడం లేదు. బావమీద వారికి బాగా గురి. బెజవాడ లాంటిచోట వ్యాపారం చేసిన వ్యక్తికి ఇదేమంత కష్టంకాదని వాళ్ళ అభిప్రాయం.

'మన పొలాలు పొలాలనుకుంటున్నాం గానీ ఒక్కసారి మనంపడే కష్టానికీ వచ్చే ఆదాయానికి లెక్కలుకడితే ఎవడూ వ్యవసాయం చేయడు. అయినా ఏరోజు సరైన ధర వచ్చింది. మిగతావాళ్ళు కొంతనయం. మనూరిది మరీ అన్యాయం కదా... పండించుకున్నాం కదా అమ్ముకునే దిక్కులేదు. పైసా చేతిలో లేకుండా వ్యాపారం చేసేవాడి దయకావాలి మనకి. అయినా ఇంతకాలం ఏదైనా చేద్దాం అనుకుంటే ఈ ముసలాళ్ళు కుదరనిస్తారా? ఇప్పుడుచూడు ఆయన చేద్దామనుకుంటున్నాడంటే చేస్తాడు. స్వయంగా సంపాయించేడు. ఏమైనా చేయగలడు. మనం ఇంకా వాళ్ళ దగ్గర నుండి తీసుకుంటున్నాం కాబట్టి ఇట్టా ఉన్నాం"

"అది నర్లే! చెరువులు తవ్వించినవాళ్ళు ఇంకా చాలామందున్నారు గదా! అందరికీ అది కలసిరాలా... దేనికైనా రాసి ఉండాలి"

"ప్రతిదానికీ ఈ కబుర్లు చెప్పకండయ్యా- ఏంటి రాసుండేది... ఇప్పుడు మనందరం కలిస్తే రోడ్డు వేసుకోలేమా? దీనిగ్గూడా ఒకరి ముఖం మీదరాయాలా? అసలు ఏదోరకంగా రోజులు వెలమార్చటానికి అలవాటుపడ్డాం. అసలీ ఊరు ఎట్టా తయారైందంటే మనకి ఏమైనా చేసే ధైర్యంలేదు. ఇంకోడు ఏదైనా చేస్తుంటే చూడలేం".

"ఇంతకీ ఏంటంట నువ్వనేది"

"ఏంటా? ఆయన ముఖంమీద బాగానే రాశాడ్లే. లేకపోతే నరసింహయ్యకి ఎంత పొలం ఉందని, ఆయన కొడుకేగా సంపాదించేడు"

"ఎవడుకాదన్నాడు. నేనేదో మాటవరసకి చెప్పాను"

"అదికాదయ్యా... ఆయనకి తెలియదా... చెరువులు తవ్వించాలంటే ఇంతకుముందు ఎక్కడా చూడకుండానే ఉన్నాడంటావా? మనం ఊరికే కూర్చుని నీతులు చెబితేకాదు"

ఆపక్కనాయనకి కూడా కోపం వచ్చి-

"ఎందరో భూమ్మీద ఆగడం లేదు. అంతదిగా ఉంటే... నువ్వుకూడా నీచేలో చెరువులు తవ్వించు"

"తవ్విస్తానేమో... చెరువులే తవ్విస్తానో... ఇంకేమైనా చేస్తానో... ఆరోజొస్తే ఏదీ ఆగదు"

అలలు... అలలుగా పొలెంలో చర్చలు మొదలయ్యాయి. ఇంతకాలం జరుగుతున్న చర్చలకు ఇవి భిన్నమైనవి. వారిలో ఇంకోరకం అనుమానాల్ని కూడా కొందరు మోసుకొచ్చారు."

"చెరువులు తవ్వితే ఆ పక్కపొలాలిక పండవంటున్నారు. మరిదీని గురించి ఏమిటి"

"ఎందుకు పండవంట?"

"మరా చెరువుల్లో ఎప్పుడూ నీళ్ళుంటే ఆపక్కభూమి ఆరేదెలా?"

"అలాంటప్పుడు ఆ పొలం వాళ్ళు కూడా చెరువులు తీసుకుంటే సరి"

"ఇంకానయం- ఈ ఊర్లో ఇంక పంటలు పండించకుండా అన్నిచేలూ తవ్వించేయమన్నావు కాదు"




"తవ్విస్తే ఏమౌతుందంట. మన ఊర్లో వరి పండనంత మాత్రాన దేశానికి ప్రమాదం వొచ్చేస్తుందేమిటి?"

"మరి అందరూ ఇలానే అనుకుంటే తింటానికే ఉండదు"

"అలాగా నీకు తెలియదు కాబోలు. ఇప్పుడు అందరూ వరే పండించటం లేదు. ఏది లాభం వస్తుందనుకుంటే ఆ పంటలే వేస్తున్నారు. ఈ దేశంలో వరిపంట ఎవరూ పండిచక పోతే ఇంకోదేశం నుంచి తెప్పించుకుంటారు. ఇప్పుడు ఈ చేపలూ, రొయ్యలు పెంచితే మనమే తింటామా. ఐసులోపెట్టి పంపిస్తే జపానులో తింటారు. అమెరికాలో తింటారు. ఇదివరకటిదాకా కప్పలు బెకబెకలాడుతుండేవి. కప్పల్ని చంపితే అప్పలు చస్తారని అనేవాళ్ళం. మరిప్పుడు కప్పలు బెకబెకలాడవే. మరాటినన్నిటినీ పట్టేసుకొని చైనాకు పంపించెయ్యాలా. మరాళ్ళు కప్పలు తింటారు. ఆళ్ళేకాదు మన షావుకారిగారబ్బాయి పెద్దపెద్ద హొటేళ్ళలో తిన్నాడు. ఇంకా చైనాలో పాములు తింటారంట. నువ్వూ నేను వరన్నం తిన్నావని దేశమంతా అదే తింటారనుకోవాకు. ఏది దొరికితే అది తినాలమరి.

"ఈడి కబుర్లన్నీ ఇంతేరా... యితండవాదం"

"నాదా... నాదికాదు.. నీది. నీకు తెలుసో తెలియదో రైత్వారీ పద్ధతులు, పద్ధతులంటూ నీకంటే అరుపులు అరిచినోళ్ళు వ్యవసాయాలు చెయ్యటంలా... ఓసారి గుంటూరెల్లు. బెజవాడెల్లూ. ఇంకా టౌన్లు దేనికైనా ఎల్లిరా. బంగారంలాంటి పొలాలే అయన్నీ. అక్కడ పంటలు పండించటంలా. ఇళ్ళస్థలాలు చేసి అమ్ముకున్నారు. ఇంకా అమ్ముకుంటున్నారు. ఎందుకంట? అమ్ముకొంటే లక్షలొస్తున్నాయి కాబట్టి అమ్ముకుంటారు. పండిస్తే లక్షలురావు కాబట్టి అమ్ముకుంటున్నారు. మరి అమెరికావాడేం చేస్తాడోతెల్సా... గోధుమలు ఏట్లో కలుపుతాడు..."

"అమెరికాలో ఏర్లుంటాయా?"

"అంతేలే... నీకు తెలిసిందంతే. మరాడెందుకలా చేస్తున్నాడు. పిచ్చెక్కి చేస్తున్నాడా? అది జనానికి పనికిరాకుండా పోయిందని చేస్తున్నాడా? ధరలు పడిపోయినాయని చేస్తున్నాడు. అంచేత ఎవడికి డబ్బొచ్చే పనులు ఆళ్ళు చేసుకుంటారు. నీ చేలల్లోకి నీళ్ళురుకుతున్నాయంటే నువ్వు చెరువులు తీయాల. నావల్ల కాదంటే ఆయనకు అమ్మేసుకోవాల. అదీకుదరదంటే రెండెకరాలు ఖాళీగా ఉంచేయమని పోట్లాడాలి. అంతేగానీ చెరువులే తియ్యద్దంటే ఆయనూరుకుంటాడా?" ఆ తర్వాత ఏం మాట్లాడాలో తెలియలా...

ఆరకంగా గ్రామంలో రెండురకాలుగా చీలారు. వారు రెండురకాలుగా ఆలోచిస్తున్నారు. ఇదివరకు కులంపేరుతో ఉన్న ఐక్యత మబ్బు తెరలా విడిపోయింది. ఇప్పుడు వారు అన్నీ ప్రశ్నించటం ఆరభించారు.

బావ కొన్ని సంవత్సరాల జీవితంలో తన పాత పద్ధతులు వదిలించుకున్నాడు.కొన్ని కొత్త అలవాట్లను చేసుకున్నాడనేది వేరే విషయం. షావుకారుకు ఎంతగా పట్నంతో పరిచయమున్నా అతని పద్ధతులన్నీ పాతవి. ఆ అహంకారం కూలివారినే కాదు బాధపెట్టేది, ఏదో స్థాయిలో అందరూ అలాంటివి అనుభవించినవారే. ఆయనవల్లనేకాదు. ఆయనలాంటి మరికొందరు పెద్ద రైతుల నుండీ కూడా బావకు ఇప్పుడు కావలసింది పద్ధతులు కాదు. తను అనుకున్నది సాధించాలి. అందుకు ఇప్పుడున్న వాతావరణం బద్దలు కావాలి. అప్పుడే తను ముందుకు వెళ్తాడు. చాలామంది జీవితాలకు కూడా 'పాలెం'లో పరిస్థితులు ఇబ్బందికరంగా ఉన్నాయి. అయినా వాటిని ఎలానో భరిస్తున్నారు. ఇప్పుడు జరుగుతున్న పరిణామాల్లో వారికి కొత్త ఆలోచనలు వస్తున్నాయి.

అదో వెల్లువ... ఆ వెల్లువ ప్రారంభం అయిందంటే... పాతకు చెందిన మంచివి కూడా కొట్టుకుపోవటం తథ్యం.

అందుకే ఓ తరం అక్కడివారిని ఎంతగా వారిస్తున్నా... వారిలో సంఘర్షణ చెలరేగింది. ఇంతకాలం ఎలా బతికాం? ఎందుకిలా బతకాల్సివచ్చింది? ఎందుకంత భయపడవలసి వచ్చింది? తమకంటే వెనకబడినవారు ఎందుకు ముందుకు వెళ్ళారు. తామెందుకు





వెనకబడి ఉండాల్సి వచ్చింది? చుట్టుపక్కల వారందరూ తమను తేలిగ్గా చూడటానికి కారణం ఏమిటి? ఇందులో ఎవరిపాత్ర ఎంత? ఇప్పుడేమిటి చెయ్యటం? ఇంకా ఇలానే ఉండాలా? మరేం చెయ్యాలి? ఎక్కడ నుండి ప్రారంభించాలి? ఎటువైపు వెళ్ళాలి?

ఇదే ఘర్షణ... తిరిగి వారందరూ ఎవరో వ్యక్తులకోసం చూస్తారు. కొంతకాలంపాటు వారి ప్రభావంలో ఉంటారు. అది బావ కావచ్చు మరొకరు కావచ్చు. అక్క చెప్పిన విషయంలో నాకో విషయం దొరికింది.

రాంబాబు ఎక్కడినుండి వచ్చాడు? మరో రాంబాబు ఎక్కడినుండి వచ్చాడు. లేదు ఎవరికోసం నాయకత్వం వహించాలనుకున్నారు. ఎవరికోసం వారు పనిచేయదలుచుకున్నారో వారి నుండే ఎందుకు రావటంలేదు. రాంబాబు అట్టడుగున ఉన్న జనంకోసం పనిచేయటానికి ముందుకురాకూడదని కాదు నా ఉద్దేశం. కానీ బాధలుపడుతున్నవారినుండీ, అణిచివేతకు గురయినవారినుండీ నాయకత్వం రావాలి. ఎంతెక్కువగా వస్తే అంత మంచిది. అప్పుడే ఓ నూతన నిర్మాణం వేగంగా జరుగుతుంది. లేకపోతే 'పాలెం'లో పరిణామాల్లానే ఉంటుంది. ఇప్పుడు నాకు కృష్ణమూర్తి ఆందోళనలోని పార్శ్వం అర్థమైంది. ఈ ఊర్లో రానున్నకాలంలో సంచలనాత్మకమైన మార్పులు రాబోతున్నాయి. అంతవరకు మాత్రం నేను చెప్పగలను.

ఇంకోరకంగా 'పాలెం'కు చెంది మరో కోణాన్ని నేను గమనించాను... బయటకు వచ్చి చూస్తే ఎటుచూసినా పచ్చటి పొలాలు... పెద్ద పెద్ద చెట్లు... కాలువలు పారుతూ చేసే వింత శబ్దాలు... గాలి పులకరించిపోతూ పాడే పాట... చిగురిస్తున్న మామిడిచెట్లు... ఈ గ్రామంలోనే ఇంకా అమాయకత్వంవదలని వారు... కొత్తవారిపట్ల అభిమానంతోనూ, వింతగానూ చూస్తూ నిశ్శబ్దంగా పలకరించే కళ్ళు... ఆ దేహాలన్నీ ఎండకు కమిలిపోవటం... సాయంకాలం గుంపులు గుంపులుగా పక్షులు ఎగరటం... తాటిచెట్ల నడుమనుండి అస్తమిస్తున్న సూర్యుడు... ఉదయాన్నే మంచుకురిసిన పొలాలు... ఒక్కసారిగా భూమిని తన్మయత్వంతో చుంబించాలని... ఆ మట్టి వాసనను శరీరమంతా నింపుకోవాలనే ఆరాటం... పొలాల్లో శ్రమిస్తున్న స్త్రీ పురుషుల్ని చూస్తుంటే అనుభూతి... ఇక్కడ శ్రమైక జీవనసౌందర్యం ఉంది. ఇక్కడ అందం ఉంది. ఇక్కడ జీవితం ఉంది. అది ఆ రెండురోజుల్లోను నన్నెంతగా కదిలించిందంటే... ఇక్కడ ఎవరి బతుకువారు బతుకుతున్నారు. వీళ్ళంతా తమ జంతువుల్ని ప్రేమిస్తున్నారు. ఈ భూమిని ప్రేమిస్తున్నారు. చెట్లని ప్రేమిస్తున్నారు. ఈ గాలిని ప్రేమిస్తున్నారు. వీరందరికీ జీవితం అనుభూతితోనే గడిచిపోతుందనుకుంటా... ఒరకంగా ఎవరో మంత్రించినట్లుగా ఉదయం లేస్తారు. పనులకుపోతారు. శ్రమచేస్తారు. అరుచుకుంటారు. నవ్వుకుంటారు. నిద్రపోతారు. తిరిగి లేస్తారు...

జీవితానికి ఇంతకంటే ఏంకావాలి... నా ఆలోచనలకు నాకే నవ్వొచ్చింది. మనిషిలో పరస్పర విరుద్ధమైన కోణాలు ఎన్ని ఉంటాయి! అవును అలా ఉండాలేమో... లేకపోతే 'పాలెం'నేకాదు దేన్నీ అర్థంచేసుకోలేం. మనిషిని గురించి తెలుసుకోవాలన్నా సమాజం గురించి తెలుసుకోవాలన్నా అదేమార్గం. ఏ భాగాన్నీ అతిగా ప్రేమించకూడదు. పూర్తిగా తిరస్కరించకూడదు...

నేను ఊహించని సంఘటన మరొకటి జరిగింది. అది మరణం! ఎవరో మరణించారు. వయసు కూడా ఎక్కువే. క్షణాల్లో ఊరంతా తెలిసింది. అందరూ వచ్చి చూస్తున్నారు. కొన్ని కళ్ళలో భయం... జాలి... మరికొందరు ఓ పక్కగా చేరి మాట్లాడుకుంటున్నారు. ఆడవాళ్ళు మాత్రం కొంగును మూతికి అడ్డంగా పెట్టుకొని చూస్తున్నారు. ఓ పక్క నుండి ఎవరి పనులు వారు చేస్తున్నారు. ఒకరిద్దరు మాత్రం దుఃఖిస్తున్నారు. ఎవరో చేతులు పట్టుకుంటే నడిచివచ్చిన వృద్ధులు... ముసలమ్మలు... బోసినోటితో ఏదో చెబుతున్నారు. వారి కళ్ళలో నీళ్లు లేవు.

మృత్యువు వారికి కొత్తకాకపోవచ్చు. వారి ముందునుండే వారి పెద్దలూ, కొందరు పిల్లలుకూడా నిష్క్రమించి ఉండొచ్చు. తాము కూడా ఈ ప్రపంచంనుండి త్వరలో

నిష్క్రమించగలమనే విషయం వారు జీర్ణించుకొని ఉండవచ్చు. జరిగిందానికి భయంగానీ... బాధగానీ... జరగబోయేదానికి వెరుపుగానీ కనిపించలేదు. ఆయన్ను గురించిన అనుభవాలగురించి చెప్పుకుంటున్నారు. అక్కడ రోడ్డు లేకపోవటం ఎంత సహజంగా భావించారో మరణాన్ని అంతే సహజంగా భావిస్తున్నట్లుగా కనిపించింది...

నాకు నవ్వు తెప్పించిన సంఘటన వారు మాట్లాడుకొన్నదిచనిపోయిన మనిషి ఆహారపు అలవాట్లగురించి... ఓ పక్క వంట ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఆయనకు కూడా అరకోళ్ళు ఇష్టమంట. నాకేం జరుగుతోందో తలుచుకుంటే మతిపోయింది.

ఆ ఊరి బ్రాహ్మణుడు మంత్రాలు చదువుతున్నాడు. తుదిప్రయాణానికి సన్నాహాలు జరుగుతున్నాయి. ఎవరెవరో ఏడుస్తున్నారు. మరోవైపున అరకోళ్ళ కోసమూ, పూర్తి కోళ్ళకోసమూ వేట ఆరంభమైంది.

ఎవరెవరో ఏమిటేమిటో చెబుతున్నారు. ఆ చనిపోయినాయన అబ్బాయి ఏం చెప్తే అది చేస్తున్నాడు. మరి కొద్దిసేపట్లో వారందరూ స్మశానానికి నడిచారు. నేనుమాత్రం వెళ్ళలేదు. రెండుగంటల తర్వాత తిరిగివచ్చారు. ఉదయం మరణిస్తే సాయంకాలం నాలుగు గంటలయింది అన్ని కార్యక్రమాలు పూర్తయ్యేసరికి... అప్పటికే చాలా ఆకలిగా ఉన్నారేమో... భోజనాలు ప్రారంభం అయ్యాయి. చనిపోయినవారికి ఇష్టమైనవాటిని తింటే వారి ఆత్మకు శాంతి కలుగుతుందంట. ఎన్నికోళ్ళు తెగాయో నాకయితే తెలియదు. అందరూ కబుర్లు చెప్పుకుంటూ భోంచేస్తున్నారు. అందులోనూ 'బావగార్కి వడ్డించు' అనీ 'మావగార్కి ఇంకొంచెం వెయ్యి' అనీ... తినండయ్యా బతికినన్నాళ్ళూ ఆయన్ని పీక్కుతిన్నారుగా. ఇదే ఆఖరిసారి' అనీ...

వాళ్ళలా మాట్లాడుకోవటం నాకెందుకో నచ్చలేదు. అసలు నాకు భోజనమే చేయాలనిపించలేదు. కోడిమాంసం అంటే నాకూ ఇష్టమే. కానీ ఇప్పుడా కూరకేసి చూడలేకపోతున్నాను. నాపక్కన కృష్ణమూర్తి కూర్చున్నాడు.

"ఏం తిండయ్యాబాబు... ఇలా తింటే మేం ఇంక పొద్దున్నేలేచి పొలాలకు కాదు వెళ్ళేది. ఆచారిగారి దగ్గరికి..."

ఎవరో అరుస్తున్నారు... 'ఒరేయ్... కొంచెం చూసి వడ్డించండి... వెనకాల ఇంకా జనం ఉన్నారు. ముందా పనాళ్ళకి నాలుగు ముక్కల ట్టిపెట్టండి. రోజూ తినేదేగా..." అంటూ ఇంకేదో గొణిగాడు... నాకు దగ్గర్లో ఉన్న ఇద్దరు కుర్రాళ్ళు చెవిలో చెప్పుకొని నవ్వుకుంటున్నారు.

"ఏంటిరా గుసగుసలు... మాక్కూడా చెప్పండి" అన్నారెవరో.

"ఏంలేదు. ఆతర్వాత ఛాన్స్ పెద మావయ్యదంట"

భోంచేస్తున్నవారంతా ఓమూలన సీరియస్‌గా తింటున్న ఓ ముసలాయన్ని చూశారు. ఆతర్వాత బిగ్గరగా నవ్వారు...

"అయితే ఏంటంట?" అన్నాడాయన నవ్వాపుకుంటూ...

"ఏంలేదు మరి పెద్దమావ కిష్టం అయిన పనులు మనం చేయాలికదా?"

"అవును"

"మరారోజు అందరమూ తలో బుడ్డి ఏసుకొని... భోగండాన్ని చూడాల" అన్నాడు...

అరకోళ్ళు అరిగిపోయేంతవరకూ నవ్వారు పడీ పడీ...

"వోరేధవా" అంటూ ఆ ముసలాయన కూడా నవ్వాడు.



బావవచ్చాడు.

ఇంక ఆయనకు కనిపించి 'వెళ్తున్నా'నని,

చెప్పటమే మిగిలివుంది. ప్రస్తుతం పాలెం విడిచివెళ్ళాను. ఎందుకో సంవత్సరానికోసారైనా ఇక్కడికి రావాలనే నిర్ణయానికి వచ్చాను. బావ మామూలుగానే తన పనుల్లో తానున్నాడు. ఇంక నేనే ఆయనముందుకెళ్ళాను.

"ఏంటిరా?" అన్నాడు.

"నేను బయలుదేరాలనుకుంటున్నా" అన్నాను.

"వెళ్దువుగానీ ఉండు. అక్కడికి వెళ్ళి ఏంచేస్తావ్?" అన్నాడు.

నేనేం మాట్లాడలేదు. తిరిగి తనే అన్నాడు-

"రేపు కొంతమంది ఆఫీసర్లొస్తున్నారు. పార్టీ చేస్తున్నాం. అదయ్యాక వెళ్దువుగానిలే" ఇంక మాట్లాడడానికేంలేదు.

మరుసటిరోజు పార్టీ నిజంగానే చాలా బాగా ఏర్పాటుచేశాడు. అవన్నీ అక్కకాదు చేసింది. వాటిని వండటానికి ప్రత్యేకంగా మనిషిని తెప్పించాడు. చేపలూ, రొయ్యలూ, సముద్రం పీతలూ, కోళ్ళూ, ఇంకా వీటితోనే రకరకాల వేపుళ్ళూ, పులుసులూ తయారుచేయించారు. జీడిపప్పు వేయించి కారం జల్లించారు. నేను అప్పుడప్పుడూ మిత్రుల్తో కలసి బార్‌కు వెళ్తుంటాను. కాబట్టి ఇవన్నీ పరిచయమే.

అచ్చగా అలాంటి కిచెన్‌లా తయారైంది. ఆరోజంతా... అవివండటమే కాదు వాటిని బార్‌లోలానే డెకరేట్‌చేసి ప్లేట్లలో పంపించాడు. ఇంకా సీసాలకు కొదవేలేదు. సాయంకాలం ఆరుగంటలకు ఆరంభమైన కార్యక్రమం అలాసాగుతూనే ఉంది. దాంతోపాటు పేకాడుతూ కూర్చున్నారు. ఊర్లోవారికి ఇక్కడేదో జరుగుతోందని తెలుసు.

ఈ ఘుమఘుమలు ఊరంతా వ్యాపించి ఉంటాయి. కృష్ణమూర్తిగారు మాత్రం వచ్చాడు. చిన్నమావగారికి మాత్రం టిఫిన్‌లో తీసి పంపించింది అక్క... తను అవన్నీ నాకు అందిస్తూ అంది...

"అమ్మకూడా ఉంటే బాగుండేదికదూ"

"అమ్మేకాదు పిల్లలు కూడా ఉంటే బాగుండేది" అన్నాను. వంటకాలు చాలాబాగున్నాయి. ఉదయం లేవగానే ఆ రుచుల గురించి కృష్ణమూర్తి పాలెంలో ఎంతగా ప్రచారంచెయ్యగలడో ఊహించుకుంటే నవ్వొచ్చింది. మొత్తంమీద తను ఓసారి వచ్చి అన్నాడు...

"ఏంటయ్యాబాబు... పుల్లలు గుచ్చి పెట్టాదేంటయ్యా? ఈడెవడో మాయలపకీరులా ఉన్నాడే" అంటూ వంటమనిషి గురించి ఆశ్చర్యపోయాడు. ఆతర్వాత...

"ఇయన్నీ తెప్పిస్తుంటే ఎందుకిన్ని మిగిలిపోతాయనుకున్నా... అయ్యా మా ఊరోళ్ళు చాలా నయం... రొయ్యలూ మిగలవు. జీడిపప్పూ మిగలదు" అన్నాడు... అంతలోనే బావ పిలిస్తే వెళ్ళిపోయాడు.

"కృష్ణమూర్తిగారు కొంచెం పుచ్చుకున్నట్లుందే" అంది అక్క.

"ఏంటి ఇదికూడా ఉందా?" అన్నాను.

"ఎందుకుండదు... అయితే ఆయనగారు ఎప్పుడూ తాగడనుకుంటాను" అంది.

"మరి బావ కూడా..." అన్నాను.

"అనుమానం ఎందుకు... మరి వాళ్ళతోపాటు కూర్చున్నాక తప్పుతుందా. అయినా వ్యాపారంలోకి దిగాక అన్నిలక్షణాలూ వస్తాయి" అంది.

ఇంతవరకూ ఈ విషయం నాకు తెలియదు. అయితే నాకు అనుమానంగా ఉండేది. అంతలోనే తాగడనుకుంటానే అనిపించేది... వాళ్ళందరికీ కూడా ఈ పార్టీ అద్భుతం అనిపించింది. వాస్తవానికి చెరువులు తవ్వించటానికి లోన్‌కోసం ప్రయత్నంచేస్తున్నాడు బావ. ఆయన ఎక్కడ వాటిని తవ్వాలనుకుంటున్నాడో... అది లాభసాటిగా ఉంటుందో ఉండదో. మరేవిషయం వారు చూడనూలేదు. ఆలోచించనూలేదు. తను ఓ మూడులక్షల వరకూ అడుగుదామన్నాడుగానీ ఆయన ఏమీ అడగకముందే అయిదులక్షల రూపాయలకు రికమండ్‌చేసి వెళ్ళారు. బావ పడుకొని సాయంకాలందాకా నిద్రపోయాడు. లేచాక స్నానంచేశాడు... నేనెన్నడూ ఊహించని విధంగా ఆయన చాలాసేపు నాతో మాట్లాడాడు.

"రా, రా కూర్చో" అంటూ నన్ను ఎదురుగా కూర్చోబెట్టుకున్నాడు. తను సిగరెట్టు తాగుతా

డు. వెలిగించాక చెప్పటం ప్రారంభించాడు.

"ఏంలేదురా...చెరువులు తవ్వించాలనుకుంటున్నాను. పెద్ద గట్లుకూడా పెట్టించి కొబ్బరి మొక్కలుకూడా వేయించాలనుకుంటున్నాను. నాటు మొక్కలయితే కాపు కొంచెం ఆలస్యం అవుతుందేమో... అయితే ఎభైసంవత్సరాలదాకా కాస్తూనే ఉంటాయి. హైబ్రీడ్ అయితే వెంటనే కాపుకొస్తాయి. ఎక్కువగా కూడా దిగుబడివస్తుంది. అయితే అయిదారు సంవత్సరాల తర్వాత వాటిపని అయిపోతుంది. అందుకే చూస్తున్నా... ఇంకా చుట్టూ సరివిచెట్లు నాటాలా, సుబాబులా అని ఆలోచిస్తున్నా... సుబాబులయితే పెద్దగా నీళ్ళు అవసరంలేదంటున్నారు. అదే యూకలిప్టస్ అయితే నీళ్ళు ఎక్కువ తీసుకుంటుందని అంటున్నారు. ఆలోచించి చూడాలి. నేను లోన్ కోసం కూడా చూడాలనుకోవటం లేదు. ముందు పనిప్రారంభం చేస్తాను. ఆతర్వాత వస్తుంది. పనయితే పూర్తయింది గదా. నాకింకో ఆలోచనకూడా ఉంది.

అసలు ఓ బుల్డోజరులాంటిది తెచ్చేస్తే తక్కువలో పనైపోతుంది... పైగా తక్కువలో కూడా అవుతుందని చూస్తున్నాను. అయితే గవర్నమెంట్ దగ్గర అద్దెకు తెచ్చుకోవచ్చుగాని ఇక్కడకు చేర్చటం ఎలా అనే సమస్యవుంది. ఈ రోడ్డు బాగుండలేదు. ఏ పెద్ద లారీమీదో తేవాలనుకున్నా... అసలు ఇక్కడకు చేర్చటం కష్టమే. పోనీ ఈ కష్టాలెలాగో పడదాంలే అనుకుంటే ఇంకో సమస్య ఉంది.

అసలు చెరువులు తీయాలంటేనే ఇక్కడ చాలామందికి ఇబ్బందిగా ఉంది. ఆ ఇబ్బంది కూడా చెరువులు తీస్తున్నానని కాదు. నేను తియ్యటం... మరి ఈ ఊరిసంగతి నీకు తెలియదు. నేను ఇక్కడే తిరిగాను. మానాన్న వంటిమీద చొక్కాకూడా ఉండేదికాదు. ఎర్రటి ఎండలో పనిచేస్తుండేవాడు. నేనంటే మాత్రం చాలా ప్రేమగాఉండేవాడు. నామీద ఎందుకో ఆయనకి బాగా నమ్మకం కూడా ఉండేది" అంటూ ఆగాడు.

"మాకప్పుడు బాగా డబ్బు ఉండేదికాదు. మేం చాలా ఇబ్బందిగానే గడిపాం. మాకు డబ్బులేదనే బాధకన్నా... అది కొంతమంది పదే పదే గుర్తుచేయటం నాకు బాధగా ఉండేది. మా ఊర్లో అప్పుడూ, ఇప్పుడూ కూడా డబ్బున్నవారినే గౌరవిస్తారు. నేను చాలా చిన్నతనంలోనే డబ్బు సంపాదించాలని నిర్ణయానికొచ్చాను సరే. నేను ఎక్కడ ఆరంభమయ్యానో, ఎలా సంపాదించానో అదంతా వేరే విషయం. ముఖ్యంగా చెప్పుకోవలసివస్తే నేను మీనాన్నను చెప్పుకోవాలి. నేను ఈ రోజున ఎంత సంపాదించాననేదికాదు. నాకంటూ పెట్టుబడిగా మీదగ్గర డబ్బే తీసుకున్నాను. అదెంత తక్కువైనాకావచ్చు. సరే కొంత సంపాదించాను. రకరకాల పరిస్థితులకు అలవాటుపడ్డానను కో... ఇప్పుడు నువ్వు అహంకారమనుకో. ఇంకోటనుకో. నాకుమాత్రం ఏ ఊర్లో అయితే మేం ఇబ్బందులు పడ్డామో ఆ ఊర్లోనే తలెత్తుకు తిరగాలనిపించింది.

ఇంకా ఖచ్చితంగా చెప్పనా... షావుగారికి మించిన గౌరవం ఈ ఊర్లో ఎవరికీలేదు. దాన్ని దెబ్బకొట్టాలి. ఆశ్చర్యపోకు. దానికోసం ఆయనంత సంపాదించాలనేం లేదు. అసలు ఆయనేం సంపాయించాడురా. ఆయన తాతలు సంపాయించిస్తే ఖర్చుపెట్టాడు. కాకపోతే ఈయన దాన్ని పెంచకపోయినా ఆదాయంమాత్రం తిన్నాడు. ఈయన కొడుకు ఇప్పుడు ఊడ్చేస్తున్నాడనుకో. ఇలాంటి చోటికొచ్చి నేను చెరువులు తవ్విస్తున్నానంటే వారికి కడుపు మండుతుంది. అందుకే నేనుకూడా తొందరపడదలుచుకోలా. ఇదిగో ఈ ఊరు ఇట్టాగే ఉంటే ఇంకో వందసంవత్సరాలకికూడా బాగుపడదు. మా షావుకారు నా చిన్నప్పుడు షావుకారు. ఇప్పుడు కాదు ఈయన్నిమించిన షావుకార్లు చాలామంది వచ్చారు. నేను డబ్బు సంపాదించటం చాలా కష్టం అనుకున్నారా... ఇప్పుడు నువ్వు కొంతమందిని చూస్తే క్షణాల్లో ఎట్టాపైకొస్తున్నారో తెలుస్తుంది. రాత్రికి రాత్రి ఓ షిప్పులో నుండి సరుకు తెచ్చుకుంటే ఆడు మొనగాడు. దొంగబంగారం... ఫారిన్ వస్తువులంటూ దిగావనుకో. కోట్లు... ఇదంతా సిన్మాల్లో నేకాదు. అసలిదంతా ఎటుపోతుందో ఎవడికీ అర్థంకాటంలా... మరి దేశమంతా అలా పోతుంటే మాజనానికి రోడ్డు అవసరంలా.

కానీ నాకుమాత్రం రోడ్డుకావాలి. ఈ ఊర్లో





ఎవరేమనుకున్నా రోడ్డు వేయిస్తా. నేను స్వయంగా వేయిస్తా. బుల్డోజర్ తెప్పించి చెరువులు తీయించొచ్చుగానీ వీళ్ళందరూ జనాన్ని రెచ్చగొట్టే ప్రమాదం ఉంది. చూశారా మీచేతచేయించుకోవచ్చుకదా. ఆ డబ్బులు మీకివ్వొచ్చు కదా. అసలు అవి పొలాలుగా ఉంటే కొంత మందికి సంవత్సరం పొడుగునా పనిదొరికేది... ఇప్పుడు ఏ నలుగుర్నో పెట్టుకుంటాడని. మనం ఈ ఊర్లోబతకాలనుకుంటున్నాం కాబట్టి అందరితోనూ తగాదాపడకూడదు. అదసలు మన విధానంకాదు.

సరే...దాంతోపాటే చావిడేసి గేదెల్ని పెట్టుకోవచ్చు. ఇంకా గొర్రెల పెంపకంగురించి కూడా ఆలోచిస్తున్నా... మన జనాభాకు తలకాయుందిగాని అందులో మెదడు లేదురా. గొల్లలుమాత్రమే గొర్రెలు పెంచుతారనుకుంటారు. ఏదో ఓ మందవెనకాల గెడకర్రతో బయలుదేరి అడ్డంవచ్చిన చెట్ల ఆకులు దూసిపోస్తార్లే అనుకుంటారు. అసలు ఆ ఆదాయంగురించి తెలిస్తే ఉద్యోగాలకోసం ఎవడూ పోడు. పెద్ద పెద్ద షెడ్లువేసి విదేశాల్లో పెంచుతున్నారు. ఎన్ని పెంచితే ఏమిటి? మాంసం చాల్తుందా? రెండెకరాల్లో వాటిమేతనేసి పెంచితే ఎంత ఆదాయమనీ... సరే ఇలాంటివే చాలా ఆలోచనలున్నాయి. ఇవన్నీ ఒక్కసారిగా వచ్చేయికావు. మెల్లమెల్లగా చేసుకోవాల్సినవి. అసలు నా అంచనా ప్రకారం ఇంకా నాలుగైదు సంవత్సరాల్లో ఈ చుట్టుపక్కల చాలా చెరువులు వస్తాయి. అందుకే ఈ ఊర్లోనే ఫీడింగ్ మిల్ ఒకటి తెరవాలనుకుంటున్నా... ముందు మనకి చౌకలో అవుతుంది. చుట్టుపక్కలవారు కూడా దూరం వెళ్ళకుండా సరిపోతుంది. మరివ్వన్నీ కావాలంటే ట్రాన్స్‌పోర్ట్ బాగా ఉండాలి. వర్షాకాలం అంతా దైవాధీనం సర్వీసంటే కుదరదు. అసలిప్పుడు వర్షాకాలంలోనే వర్షం కురవటంలేదుగా... దానికి ఎప్పుడు గుర్తొస్తే అప్పుడు కురవటం మొదలయింది. ఇవన్నీ జరగాలంటే అనేక ఇబ్బందులున్నాయి. అందులో కొన్ని చిన్నవున్నాయి. ఇంకొన్ని పెద్దవున్నాయి. ప్రస్తుతం నాకార్యక్రమం ఇది... మరి నువ్వేమో ఆ చదువు పూర్తిచేశావ్. ఏంచేయాలనుకుంటున్నావో నాకు తెలియదు. ఇప్పుడు నిన్నెందుకు పిలిచి ఇదంతా చెప్పాల్సి వచ్చిందంటే ఇంతకాలం నువ్వు చిన్నపిల్లాడివి. కొంచెం కోప్పడుతుండాలి అనుకునేవాడిని.

రామ రానూ నువ్వు నా దగ్గరికి వచ్చి మాట్లాడటమే కష్టమవుతూ వచ్చింది. ఇప్పటికైనా అలాంటిది పోగొట్టాలనిపించింది. నీకేమైనా సలహా అవసరమైతే నన్నడుగు. ఏంచేయాలో నిర్ణయించుకో. ఇంకా ఎక్కువ కాలం ఇలా కాలక్షేపం చేస్తూ కూర్చోకు'' అన్నాడు.

నేను నవ్వుతూ తలూపాను. ఆ తర్వాత మాట్లాడానికేమీ లేనట్లు బావ మౌనంగా ఉన్నాడు. మరికొద్దిసేపు చూసి నేనే లేచి వచ్చాను. అక్క దగ్గరకు వెళ్లి రేపు వెళ్తునానని చెప్పాను.

''ఏంటిరా... ఇంకా రెండు రోజులుండకూడదూ.. నువ్వు వచ్చాక అదో రకంగా ఉంది. నువ్వు కూడా బాగా అలవాటైపోయావు'' అంది.

''ఇంకా నయం. ఇంకా ఒక్కరోజు చూస్తేచాలు. అమ్మ పరిగెత్తు కొచ్చేస్తుంది. ఇప్పటికే పాలెంలో ఏదో ప్రళయం జరుగుతుందనుకుంటూ ఉంటుంది'' అన్నాను.

''అయితే రేపు బండి కట్టించమంటావా?'' అంది.

''ఎందుకూ నేను హాయిగా నడిచివెళ్తాను'' అన్నాను.

''ఎలారా? సూట్‌కేసు చాలా బరువుగా ఉంటుంది కదా'' అంది.

''అంటే నువ్వు కూడా ఏమైనా చేసిస్తావా? వద్దక్కా... అంతగా అయితే నేను గుంటూరులో దిగి ఏమైనా కొనుక్కుని వెళ్తాను''

''ఏడ్చావులేరా. షాపులో కొనుక్కువెళ్లేది నేను చేసేదీ ఒకటెలా అవుతుంది. అయినా స్త్రీ గురించి నీకేం తెలుసు. ఓ వయసువరకూ తన పిల్లలకోసం కడుపు మాడ్చుకుంటుంది తల్లి.

వాళ్ళు పెద్దయినాక తనకేంకావాలో తెలుసుకొని తనలానే ఆదరిస్తారనుకుంటుంది. ఓ రకంగా ఎవరైనా ఆ వయసులో పిల్లలైపోతారు. తినాలని ఉంటుంది పైకి చెప్పరు. ఇవన్నీ మనం అర్థం చేసుకోవాలి'' అంది.



"అయితే ఏమంటావ్... అవన్నీ బండిమీద పెట్టి పంపిస్తానంటావా?"

"లేదురా. ఆ అడ్డరోడ్డు దాకా అయినా మన రాముడితో పంపిస్తా"

"సరే నీ ఇష్టం. నేను మాత్రం నడిచివెళ్తా" అన్నాను.

ఆ రాత్రి నిద్రపోయేముందు వెళ్లి హనుమంతరావుకూ, కృష్ణమూర్తిగార్కి చెప్పివచ్చాను. హనుమంతరావు మాత్రం "మళ్లా ఎప్పుడు" అన్నాడు... "వస్తాను ఎప్పుడో తప్పకుండా వస్తాను... అంతేకాదు ఎప్పటికైనా 'పాలెం' కొత్తరోడ్లు మీద నడవటం కోసమైనా రావాలనుకుంటున్నాను" అని చెప్పాను.

హనుమంతరావు నవ్వుతూ నన్ను తన హృదయానికి హత్తుకొన్నాడు.

కృష్ణమూర్తిగారు మాత్రం అన్నాడు "నిన్ను రమ్మని చెప్పటం లేదయ్యా... నువ్వు తప్పకుండా వస్తావని నాకు తెలుసు"

నేను వచ్చిన దగ్గర నుండి జరిగిన సంఘటనలన్నీ వరసగా కళ్లముందు కదులుతుండగా నాకెప్పుడు నిద్రపట్టిందో తెలియదు.

★ ★ ★

రాముడు ముందుకు నడుస్తున్నాడు. నేను తన వెనగ్గా వెళ్తున్నాను. పాలెం వచ్చేటప్పుడు నేను ఒంటరిగా వచ్చాను. ఇప్పుడు నాతోపాటు కొంతదూరం రాముడు కూడా వస్తున్నాడు. నా బరువులో కొంత భాగం తను భరిస్తున్నాడు.

నేను వచ్చిన కార్యక్రమం పూర్తయింది. నేను తయారు చేసుకున్న నోట్స్ నుండి కొన్ని పాయింట్లు తయారు చేసుకోవాలి చేసుకుంటాను. అది వేరే విషయం. ఇకనుండి నా కర్తవ్యం ఏమిటి? నన్ను తన సంస్థలోకి రమ్మని ఆహ్వానించిన వ్యక్తి గుర్తుకువచ్చాడు. అతను కూడా ఇలాంటి కార్యక్రమాన్నే నాకు అప్పచెప్పాలనుకున్నాడు. ఆయనకు ఈ విషయంలో ఎందుకంత శ్రద్ధ కలిగింది. అసలు ఆ సంస్థకు విదేశాలు ఎందుకు నిధులిస్తున్నాయి. అవి అందిస్తున్న సంస్థ లేమిటి? వారికి ఇలాంటి వెనకబడిన దేశాలమీద అక్కడ గ్రామీణ ప్రాంతాల మీద ఎందుకు ప్రేమ పుట్టుకొచ్చింది?

నా కెందుకో వెంకట్రామయ్యగారూ, షావుకారూ, మరికొంతమంది మోతుబరులూ గుర్తొచ్చారు. ఒకానొక ఊరికి రోడ్డు రాకపోవటం వెనక వీరందరి ప్రత్యక్ష, పరోక్ష హస్తం ఉంది. తాత్వికత ఉంది. ఇవి కూడా అలాంటివే అనుకుంటాను. నేను వీటి గురించి చదివిన వ్యాసం గుర్తొచ్చింది.

భారతదేశం మొత్తం మీద ఈ రకమైన సంస్థలు పుట్టగొడుగుల్లా ఉన్నాయి. ప్రతి సంవత్సరమూ కోట్లాది రూపాయల ధనం ఈ సంస్థలకు వస్తోంది. ఇవన్నీ సామాజిక జీవితంలో ఓ భాగం కావటానికి ప్రయత్నం చేస్తున్నాయి. ఈ సంస్థల ముసుగులో గూఢచారి కార్యక్రమాల నిర్వహించటం ఓ ఎత్తయితే వీటిని స్థాపించటం వెనకాల ఓ సిద్ధాంతం ఉంది. అవి ఎవరైతే పీడింపబడుతున్నారో వారంతా ఓ చోటికి రాకుండా ఉండటం. ఓ పార్టీ నాయకత్వాన్ని ఆహ్వానించకపోవటమూ. తమ సమస్యలన్నీ ఈ సంస్థలు పరిష్కరించగలవు. తాము నిమిత్తమాత్రులం అని భ్రమ కలిగించటం...

ఎంత చక్కని పోలిక... చరిత్రలో ప్రతికొత్త మార్పునూ అడ్డుకోవటానికి రక్తం పారించారు. ఇప్పుడు పద్ధతులు మారుతున్నాయి. వీటిని చాలా జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. మనకేం కావాలో మనకు తెలియనంతకాలం ఇలాంటి భ్రమల్లో బతుకుతాం. అంతేకాదు ఎవరు నాయకత్వం వహించాలో వారు ముందుకు రానంతకాలం ఇతరులు రంగం మీదకు వస్తుంటారు. అందుకే నేను అలాంటి సంస్థల్లోకి వెళ్లాలనుకోవటంలేదు.

మరేమిటి చెయ్యటం... ఉద్యోగమా... ఆ తర్వాత వివాహమా... పిల్లల్ని కనటమా... డబ్బు లెక్కచూసుకోవటమా ఇవన్నీనా? నాకు అక్క చెప్పిన మాటలు గుర్తొస్తున్నాయి. జీవితాన్ని మరీ అంత నిస్సారంగానూ, ఏ ఆశయం లేకుండా గడపటమా? అది నావల్లకాదు. నా కంటికి రాంబాబులు కనిపిస్తున్నారు. అలాగే హనుమంతరావు కనిపిస్తున్నాడు. హనుమంతరావుకున్న భయాలు నాకూ ఉన్నాయి. ఇప్పుడు పరిస్థితులు చాలా నిరాశాజనకంగా ఉన్నాయి. అలా అని మౌనంగా ఎంతకాలం





కూర్చోవటం?

ఇప్పుడు నాకు రోడ్డు విషయంలో ఓ అవగాహన వచ్చింది. 'పాలెం'కి రోడ్డు అవసరం మా బావకూ అవసరమే. మా బావకు ఎందుకు అవసరమో ఆయనే చెప్పాడు. ఆయననలా ఉంచుతాను. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే తనకు రోడ్డు అవసరం కాబట్టి ఏంచేయాలో తనకు తెలును. బహుశా ఆయన ఆచరణకు కూడా పూనుకోవచ్చు... ఇక్కడ 'పాలెం'కి రోడ్డు కావాలి. అందుకు అందులోని వారే నాయకత్వం వహించాలి. అందుకు అవసరమైన ప్రేరణనూ నేనూ అందించవచ్చు...

నేనిప్పుడు నా భవిష్యత్ కార్యక్రమం గురించి ఆలోచిస్తున్నాను. నదులన్నీ సముద్రంలో కలిసినట్లుగా ఆలోచనలన్నీ రోడ్డు చుట్టూ తిరుగుతూ రోడ్డు దగ్గరే కలుస్తున్నాయి. అంతమవుతున్నాయి. రోడ్డంటే విజ్ఞాన సర్వస్వం... రోడ్డంటే రేపటి స్వప్నం... రోడ్డంటే మరో ప్రపంచం... నాకీ సమయంలో పాలెం నుండి నడిచివెళ్లిన వెంకటరావు మాస్టారు గుర్తొస్తున్నారు. ఆయన ఇదే రోడ్డు మీద నడుస్తున్నప్పుడు ఎలాంటి అనుభూతి పొందాడా? ఏయే ఆవేదనలు చెందాడా? అని ఊహించే ప్రయత్నం చేస్తున్నాను. వెళ్తూ... ఆయనన్న మాటలు గుర్తు తెచ్చుకోవటానికి ప్రయత్నం చేస్తున్నాను.

ఊరు మొత్తం మాలపల్లి తరిమితే... వాళ్లు సైతం భయపడితే... ఆయన ధైర్యం గుర్తొస్తూంది. ఇంతసేపూ నా దృష్టిలో రాంబాబులున్నారు. హనుమంతరావు ఆక్రోశం ఉంది. వీరందరి నడుమ ఉన్న మాస్టారిని గుర్తుపెట్టుకోలేకపోయాను. ఇది నా లోపమే...

ఇప్పుడు వెంకటరావు మాస్టారు ఏంచేస్తూ ఉండివుంటారు? ఏ విద్యార్థులకో పాఠాలు చెబుతుండి ఉంటారు. ఏ గ్రామంలోనో అక్కడి పరిస్థితులు అధ్యయనం చేస్తుంటారు. ఆయా సమస్యల్ని గుర్తించాక, ఆ గ్రామ ప్రజల్తో గుర్తింపచేస్తుంటారు. అదో ఘర్షణ. అందులో ఆయన వ్యక్తిగత విజయాలూ, వైఫల్యాలు ఉండవు. అన్నీ అందరివే. నేను నడుస్తున్నాను... రాముడు వెనక్కి తిరిగి చూస్తున్నాడు.





నేను చాలా మెల్లిగానే నడుస్తున్నాను...

ఇంతకూ రోడ్లు ఎలా నిర్మిస్తారు?... ఈ మాటకు ఎవరైనా చాలా సులభంగా చెబుతారు. నేను నా చిన్నప్పుడు రోడ్లు వేస్తుంటే చూశాను. అందరికీ తెలిసిన విషయమే అయినా మరోసారి గుర్తు చేస్తాను...

"అక్కడ రోడ్డనేది ఉండదు. ఉన్నా వానకీ, వరదకీ కొట్టుకుపోయి ఉంటుంది... రాళ్లు రాళ్లుగా... గుంటలు గుంటలుగా ఉంటుంది. చాలాకాలం జనం ఆ రోడ్డును తిట్టుకుంటూనే నడుస్తుంటారు. ఎప్పటికో ఆ రోడ్డు గురించి ఎవరో ఆలోచిస్తారు. లేదా ఆందోళన చేస్తారు. అప్పుడు రోడ్డు వేయటానికి అంగీకరిస్తారు. ఎవరో కంట్రాక్టరు క్వారీల దగ్గరకెళ్తాడు... అక్కడ పెద్దకొండల్ని బద్దలు చేస్తున్న మనుషులు కనిపిస్తారు. వారు రోడ్డు కోసం కొండని బద్దలు చేస్తారు. రోడ్డుమీద పరచటానికి కంకర గుట్టలు తోల్తారు. ఇంకా చిన్న చిన్న కంకర తోలతారు... రోడ్డును ముందు శుభ్రం చేస్తారు. దానిమీద రాళ్లు పరుస్తారు. ఎండలు మండుతుంటాయి. రోడ్డుకి అడ్డంగా తారు డబ్బాలుంచి పక్క నుంచి నడువమంటారు... తళతళలాడే తారు కరుగుతుంటుంది...

రోడ్డు రోలర్ ఆ కంకరని సమం చేస్తుంటుంది. ఇంకా ఖాళీల్లో 'చూర' పోస్తారు. 'మిక్స్' చేసిన కంకరపోస్తారు... తిరిగి రోడ్డు రోలరు తిరుగుతుంది... అలా రోడ్డయిపోతుంది. అంతే పైకి చూస్తే అంతే. నేను మాట్లాడుతున్నది రోడ్డు నిర్మాణం గురించే.

దీని వెనక ఎంతమంది వ్యక్తులు కావాలి. ఎన్నిరకాల వస్తువులు కావాలి. ఎంత శ్రమ కావాలి. అంతకుమించి ఎంత 'కళ' కావాలి. నిజమే రోడ్డును నిర్మించటం అనేది కూడా కళే. నా కిప్పుడు నిరాశ కలగటంలేదు. అంతేకాదు 'హనుమంతరావు'లాంటి వారందరిని కూడా మెల్లగా ఈ నిర్మాణంలోకి తీసుకురావచ్చుననే ఆశ కలుగుతుంది. అంతేకాదు రాంబాబు లాంటివారికి అధ్యయనం చేయటాన్ని నేర్పి అతన్ని కార్యరంగంలోకి దూకించవచ్చునని పిస్తోంది. పాలెం రోడ్డు అంతం కావస్తోంది. అప్పటికే రాముడు వెళ్లి నిలబడి చూస్తున్నాడు నా కోసం. నేను వెళ్లాక... నవ్వుతూ చూశాడు.

జేబులో నుండి పదిరూపాయలు తీసి

అందించాను. తను సిగ్గుపడ్డాడు తీసుకోవటా నికి. "ఫర్వాలేదు తీసుకో" అంటే అప్పుడు తీసుకున్నాడు. ఇంకా బస్సు రాలేదు. నేను దూరంగా దుమ్ము కనిపిస్తుందేమోనని చూశా ను. బస్సు రావటానికి అది కూడా ఓ గుర్తుకదా. అలాంటిదేం లేదు. నేను రాముడితో చెప్పాను.

"రాముడూ... పాలెం రోడ్డు వేస్తే అందులో నువ్వు కూడా భాగం పంచుకోవాలి" నాకేసి తను ఆశ్చర్యంగా చూశాడు.

"అవును. పాలెంలో మీరందరూ కలిసి రోడ్డు వేయించుకోవాలి. ఇదిగో కనీసం ఇలాంటి రోడ్డయినా ఉండాలి. ఇది కూడా మంచి రోడ్డు కాదు. వానొస్తే ఈ బస్‌లు కూడా తిరుగుతాయనే నమ్మకం లేదుకదా. ముందు ఈ అడ్డరోడ్డు నుండి మీరంటూ రోడ్డు నిర్మించు కుంటే ఆ తర్వాత ఈ రోడ్డును తారు రోడ్డుగా మార్చుకోవటానికి అందరూ ముందుకొస్తారు. ఈ చుట్టుపక్కల గ్రామాల్లో పిల్లలందరికీ అప్పుడే చాలా సమస్యలు తీరతాయి. ఈ గ్రామాల్లోకి డాక్టర్లొస్తారు. బస్సులొస్తాయి. అందు కే మీ ఊరికి కూడా రోడ్డు కావాలి. ఏమంటావ్? మీ ఊరికి రోడ్డు అవసరమా? లేదా చెప్పు.. అన్నాను తిరిగి. రాముడు సిగ్గుపడ్డాడు.

"చెప్పు రాముడూ... మీ కృష్ణమూర్తిగారు ఏవంటాడంటే మాకసలు రోడ్డే అవసరంలేదు. ఈ ఊర్లో ఎవర్నడిగినా అదే చెబుతారు అన్నా డు. ఇదంతా నిజమేనా? నీక్కూడా రోడ్డు అవసరం లేదా? నీకు నిజంగా రోడ్డు అవసరం లేకపోతే వద్దని చెప్పు. నేనేం అనుకోను. ఊరికే తెలుసుకోవటంకోసం అడుగుతున్నానంతే" అన్నాను.

రాముడు నవ్వుతూ చూస్తున్నాడేగానీ మాట్లా డటంలేదు. నేను బలవంతం చెయ్యలేదు. బస్సు అప్పుడే వచ్చేటట్లు లేదు. నేను తిరిగి రాముడ్ని 'ఏం సినిమాలు చూశావని?' అడిగా ను. అప్పుడు చెప్పటం మొదలుపెట్టాడు. తను చూసిన కొద్ది సినిమాల గురించేకాక తను విన్నవాటిని గురించికూడా. అలా చెబుతున్న ప్పుడు ఆ కళ్లలో ఎంతో ఆనందం కని పించింది. అలా చాలా విషయాలమీద తను చెబుతుంటే నేను వింటుండిపోయాను. ,

తను చెబుతూ కూడా చుట్టూ చూస్తున్నాడు. ఆకస్మాత్తుగా 'బస్సు బాబుగారు' అన్నాడు. దూరంగా దుమ్ములేపుకుంటూవస్తున్న బస్ కనిపించింది.

'మళ్ళ ఎప్పుడొస్తారు బాబు' అన్నాడు. ఆ కళ్లలో నేను తిరిగి మరోసారి రావాలనే కోర్కెను నేను గమనించాను.

"నేను రావటంకాదు. ఏదైనా పనివస్తే గుంటూరు రా" అన్నాను నవ్వుతూ తలూపా డు.

బస్సు దగ్గర కొచ్చింది.

"మీరు మళ్ళీ రండి" అన్నాడు సూట్‌కేస్ అందిస్తూ. నేను బస్ ఎక్కి కిటికీ పక్క కూర్చోబో తుంటే 'దుమ్ము బాబుగోరు' అన్నాడు.

"వెళ్లొస్తా" అన్నాను.

తలూపాడు. బస్సు కదిలింది... తనేం అను కున్నాడోగానీ పరిగెత్తుకుంటూ వచ్చి చెప్పాడు.

"మాకూ రోడ్డు కావాలిబాబూ"

అమ్మ నన్ను చూసి కోపంగా అన్నట్లంది.

"ఎన్ని రోజులైందిరా నువ్వు వెళ్లి. అయినా ముందు చెప్పొచ్చుకదా. లెటర్ రాసి పడేద్దాం అంటే ఎన్నిరోజులకి చేరుతుందో తెలియదు. ఈ లోగా ఏరోజుకారోజు నువ్వు వచ్చేస్తావని చూస్తున్నా. అందులో నువ్వేమో అదీ ఇదీ అంటూ వెళ్లావ్... అది సరే ఏంగొడవలు లేకుండా వచ్చావా?" అంది.

"గొడవలెందుకు జరుగుతాయమ్మా. నేను అక్కను చూడటానికి వెళ్లాను. మళ్ళీ మళ్ళీ వెళ్లం కాబట్టి నాలుగురోజులు ఉన్నా . నేను వెళ్లాక బావపనిమీద ఊరెళ్లాడు. నేను వచ్చే దాకా ఉండమనంటే ఉండిపోయాను" అన్నా ను.

"అక్క ఏంచేస్తోంది" అంటూ ప్రశ్నలు మొదలుపెట్టింది నవ్వుతూ. నేను అమ్మకోసం అక్క తయారుచేసినవి ఇచ్చాను. ముందు నేను వేడి వేడి నీళ్లతో స్నానం చెయ్యాలి. అందుకే అమ్మను బతిమాలుకున్నాను. కొంచెం వేడినీళ్లు కావాలని. ఆమె ఒక్కో వివరం అడిగితెలుసుకొంది. సలసల కాగేట్లు నీళ్లు వేడెక్కాక అమ్మే నాకు తలంటింది. అంటుతూ కూడా ఏదో చెబుతూనే ఉంది. తను

టవల్ తెచ్చి... తలకొద్దిగా తుడిచి... గట్టిగా తుడుచుకో అంది.

అమ్మకు నేనేం చేయాలనుకుంటున్నానో చెప్పలేదు. నేనేం చేసినా ఆమె ఏమీ అనుకోదు. ముందు కొంచెం భయపడుతుంది. నేను పక్కన కూర్చుని వివరిస్తే తను అర్థం చేసుకోగలదు. అయితే నేను ఆకస్మాత్తుగా అలాంటి నిర్ణయం ప్రకటించి ఆమెను విస్మయానికి గురిచేయదలుచుకోలేదు.

నాలో ఇంకా చాలా అనుమానాలున్నాయి. అవి కొన్ని ప్రాథమికమైనవే. ముందువాటి గురించి తెలుసుకోవాలి. నిజానికి నేను చదివిన పుస్తకాలు చాలా తక్కువ. అందుకే నేను కొంతకాలంపాటు పూర్తిగా చదవటంలోనే మునిగిపోవాలనుకుంటున్నాను. నేను ఏదైనా చేసే ముందు ముందు నాకేం కావాలో నేను తెలుసుకోవాలి. ఆ తర్వాత ఎవరికోసం నేనా నిర్ణయం తీసుకుంటున్నానో స్పష్టం కావాలి. ఇదంతా ఎందుకోసం అనేది ఇంక చెప్పవలసిన అవసరం లేదు.

ఒకప్పుడు మానవుడికి గమ్యం అనేది ఊహ... కానీ ఈ వంద సంవత్సరాలలోనూ అది వాస్తవం కూడా అయింది. పాత రోడ్లమీద నడుస్తూనే కొత్త బాటలు వేసుకున్నారు. కానీ రోడ్డు వేయటంతోనే ఆగదు. నిరంతరం దాన్ని కాపాడాలి. వానలకీ, వరదలకీ, పెరుగుతున్న రద్దీకీ రోడ్లు దెబ్బతింటాయి. అంతేకాదు రోడ్ల నిర్మాణంలోనే అనేక అవకతవకలుంటాయి. ఇంకా కొత్త కొత్త సమస్యలు అనేకం పుట్టుకొస్తున్నాయి. ఇటీవల పరిణామం అది. నాకు వీటన్నింటిని చూస్తే గమ్యం మీద నమ్మకం సడలిపోవటంలేదు.

కానీ నేను తెలుసుకుంది స్వల్పం. అది కూడా పుస్తకాల నుండి వచ్చిన జ్ఞానం. నేనింకా రంగంలోకి రాలేదు. ఆచరణలో కూడా పాలు పంచుకుంటేనే ఖచ్చితమైన అంచనాల దాపుల్లోకి రాగలనుకుంటాను. నాకు తెలిసిన పెద్దలు చాలామంది ఉన్నారు. వారందరూ ఎప్పటి నుండో ఈ ప్రయాణంలో ఉన్నవారే. నాకున్న అనుమానాలన్నింటినీ వారి ముందుంచి సమాధానాలు పొందాలని నిర్ణయించుకున్నాను. ఆ తర్వాతే నేను ఏంచేసినా...

అలాంటి నిర్ణయానికి రావటం ఆలస్యం ఇంక నేను ఆలస్యం చేయలేదు. కార్యక్రమంలోకి దిగిపోయాను. రోజులు గడిచిపోతున్నాయి... నేను గుంటూరులో ఉండటంకూడా తక్కువైంది. చిత్రమేమిటంటే అక్కవాళ్ల నుండి అమ్మనూ నన్నూ... బయలుదేరిరమ్మని కబురు వచ్చింది. అయితే నాకున్న పనులవల్ల నేను వెళ్లలేకపోయాను. అమ్మను మాత్రమే పంపించాను. ఇంతకూ ఈ కబురు రావటానికి కారణం బావ 'చెరువుల' నిర్మాణం ఆరంభించటం!

★ ★ ★

అమ్మ పాలెం నుండి తిరిగి వచ్చింది. అక్కడి విశేషాల గురించి చాలా వివరంగా చెప్పింది. చెరువుల ప్రారంభంనాడు బావ చాలా హంగామా చేశాడు. రకరకాల వాహనాల్లో చాలా మంది అధికారులు వచ్చారట వారందరితోపాటు పత్రికా విలేకరులు కూడా వచ్చారు. అక్కడ చిన్న సభలాంటిది ఏర్పాటు చేశారు. సరే ఈ విషయాలన్నీ పత్రికల్లో కూడా వచ్చాయి. ఇంకో ముఖ్యమైన విషయం ఏమిటంటే బావ ఈ సభకి ఎం.ఎల్.ఎ గారిని ఆహ్వానించటం. ఆయనా అధికారులూ మాట్లాడ్తూ... చాలా విషయాలు చెప్పారు.

"బావలాంటివారు చాలామంది కావాలనీ, వ్యవసాయంలో గానీ, మరో విషయంలో గానీ పాత పద్ధతుల్లో కూర్చుంటామంటే కుదరదనీ చెప్పారు. కొత్త కొత్త ప్రయోగాలు చేయాలనీ, ఈ రోజు మారుమూలనున్న ఈ 'పాలెం'లోని చెరువుల్లో పెరిగే రొయ్యలుగానీ చేపలుగానీ ఈ గ్రామంవారు మాత్రమే తినరనీ, విదేశాలకు ఎగుమతులు చేస్తారు. అలాగే ఇతర రాష్ట్రాలకు పంపిస్తారు. విశాల దృక్పథం అంటే అదే. విదేశీమారకం లభిస్తుంది వీటిద్వారా. అంటే దేశం ముందుకువెళ్లాలంటే కొంత ఆలోచనలున్న వారు ముందుకు రావాలి అని కొందరు చెబితే, మరికొందరు అధికారులు ఇలాంటి విషయాలపట్ల కొత్తలో అపోహలుంటాయని... కాలక్రమంలో అవన్నీ తేలిపోతాయని... ఇలాంటి పనులకు ముందుకొచ్చిన వారికి అవసరమైన సహాయం అందచేయటానికి తా





ము ఎప్పుడూ సిద్ధంగా ఉంటామని తెలియచేశారు. ఆ వేదిక మీద వెంకట్రామయ్య గారు కూడా కూర్చున్నారు. ఆయన కూడా క్లుప్తంగా మాట్లాడటం జరిగింది...

అందులోనే ఎవరో మాట్లాడుతూ...

'ఇంతకాలం ఈ బెల్టు మొత్తంలోనే రోడ్ల నిర్మాణం విషయంలో నిర్లక్ష్యం చేశారు. ఎప్పటికప్పుడు ఎన్నికలకోసం రావటమేగానీ అది చేస్తాం... ఇది చేస్తామంటూ చెప్పటమేగానీ ఏంచేసిందీ కనిపించటంలేదు. మరిమేం ఓట్లేస్తున్నాం... అవసరమైతే చందాలిస్తున్నాం. మరి మాకు మాత్రం ఏ పనులు జరగటంలా. మీరన్నారు విదేశీమారకం వస్తుందని. ఇలాంటివి ఇంకా కొంతమంది చెయ్యాలంటే ముందు ఏదున్నా లేకపోయినా తారు రోడ్డుండాలి. వానకురిస్తే ఏమవుతుందో తెలీని చోటులోకొచ్చి ఈయన సాహసం చేస్తున్నాడు. ఆయనకు వ్యాపారం చెయ్యటం చేతకాక ఇక్కడకు రాలేదు. ఇక్కడ పెట్టే ప్రతిపైసా ఏ నగరాల్లోనో పెడితే పదింతలు చేతికొస్తుందని నాకు తెలియదుగానీ... ఈ బెల్టు ఇలానే ఉంటే మాత్రం ఇంకో చెరువు తవ్వటం ఉండదు. ఇన్ని రోజులూ ఎందుకీ ప్రాంతం ఇంత వెనకబడుంది? మీ అందరికీ తెలును. నేనా వివరాల్లోకిపోను గానీ అలాంటి వారందరికీ నేను చెప్పేదేమిటంటే ఇంకా ఇలానే ఉంటుందని అనుకోకండి. ఇలానే ఉండాలని మాత్రం శాసించాలనుకోకండి'' అనో హెచ్చరిక సైతం చేశాడు.

ఎవరి ముఖాలు మాడిపోయాయో, ఎవరికి సంతోషం పెల్లుబికిందో, ఎవరెవరిలో ఆలోచనా తరంగాలు ఉవ్వెత్తున ఎగసిపడ్డాయో తెలియదు. మొత్తం మీద ఇలాంటి పరిణామం తప్పనిసరి అన్నంతగా అక్కడ వ్యవహారాలు జరిగాయి. ఊర్లో అందరికీ భోజనాలు ఏర్పాటు చేశారు. అందులో ఎన్ని వేటలు తెగాయోగానీ కూలీ జనమంతా తృప్తిగా భోజనం చేశారు. ఆ చుట్టుపక్కల గ్రామాల్లో కూడా వింతగా... గొప్పగా చెప్పుకున్నారు. ఎంత ఖర్చయిందో... ఏం జరిగిందోగాని బావ కోర్కెలు రెండూ నెరవేరాయి.

ఇది జరిగాక ఆ ఊరివారు కేవలం 'బావ'ను గురించే మాట్లాడుకోవటం మొదలుపెట్టారు... చెరువులు తీయించటం చకచక జరిగిపోయింది. ఏమైనా పనులన్నీ అనుకున్నంత త్వరగా జరగవు. అలా జరగాలన్నా బావ ఖాళీగా లేడు. తను పూర్తిగా చెరువుల మీద కేంద్రీకరించి ఉన్నాడు. వాటి పని అవగానే మొదలుపెట్టాడు. పాలెం యువకులు చాలా మంది బావ సలహాల కోసం వస్తున్నారు. అక్కడ ఇదివరకటిలా ఊసుపోని కబుర్లు చెప్పుకునే స్థానంలో ఏదో చేయాలన్న తపన ఆరంభమైంది.

బావ ఎవరికో సలహా ఇచ్చాడు...

'మనకీ చుట్టుపక్కల మంచి ఐస్ ఫ్యాక్టరీ లేదు. మనకి సముద్రం ఎంత దూరంలో ఉంది. మహా అయితే ఓ ముప్పై కిలోమీటర్లు. అక్కడ వారికి ఎప్పుడూ ఐస్‌కావాలి. ఇప్పుడు ఉంది అవసరాలు తీర్చటంలేదు. అందుకే టౌన్లో ఇంకో ఐస్ ఫ్యాక్టరీ పెట్టుకుంటే బాగానే ఉంటుంది''

అంతే ఓ యువకుడు అందుకోసం ప్రయత్నాలు ప్రారంభించాడు. లైసెన్స్‌ల విషయంలోగానీ మరో విషయంలోగానీ బావ అతనికి పూర్తిగా సహకరించాడు. ఆ కార్యక్రమం అలా కొనసాగుతూ ఉంది.

''మీకసలు ఏమీ చేయాలని లేదయ్యా. మీకంటే చిన్న చిన్న కుర్రాళ్లు రకరకాల పనులు చేస్తున్నారు. కొంచెం తెలివితేటలుంటే మీరేం పెట్టుబడి పెట్టనవసరంలేదు. లోన్లు తీసుకొని చిన్న చిన్న పరిశ్రమలు పెట్టుకోవచ్చు. ఈ ప్రాంతంలో ఏం పండుతాయి. వేటికి గిరాకీ ఉంది? ఏవి తక్కువగా దొరుకుతున్నాయి. ఇవన్నీ పరిశీలించాలి. అప్పుడే ఏంచేయాలో తెలుస్తుంది. ఎవరోఏదో మొదలుపెడితే అందరూ అదే చేయటం మొదలుపెడితే ఎవడూ పైకిరాడు. కొత్త కొత్త రంగాల్లోకి వెళ్లాలి. ముందు చిన్నగానే ఆరంభిస్తాం. ఎవడైనా అంతే... అసలు ఈ చుట్టుపక్కల ఎప్పుడూ కాలవపనులో, ఇంకోపనులో ఉంటాయి. మరి మీరు ఆ కాంట్రాక్ట్‌లు ఎందుకు తీసుకోకూడదు. అలాగే ఈ బెల్టులో రోడ్లు అన్నీ శాంక్షన్ అయితే... ఇంకా చిన్న చిన్న వంతెన్లూ,



కల్వర్టులూ లెక్కచూస్తే కొన్ని లక్షల రూపాయల పనులు. ఎప్పుడూ ఒకడే ఎందుకు చెయ్యాలి. మీరు కూడా రంగంలోకి దిగటమే.''

అంతే కొంతమంది జంటలు జంటలుగా ఏర్పడి కాంట్రాక్టర్లుగా తయారయిపోయేరు వారి కిప్పుడు ఎక్కడ ఏ టెండర్లు పడుతున్నాయోనని చూసుకోవటంతో సరిపోతూంది. దాంతో పాటూ కొత్త కొత్త పరిచయాలు... రాజకీయ నాయకుల్తో అవసరాలు ఏర్పడుతున్నాయి. బావ మొత్తం మీద పాలెంలో కరుడుగట్టుకున్న సంబంధాల్ని బద్దలుకొట్టడం ఆరంభించాడు. అవి ఎంత వేగంగా సాగుతున్నాయంటే... ఇంత తక్కువ కాలంలో ఇలాంటి మార్పొలొస్తాయా అనే అనుమానం కూడా కలుగుతుంది.

కూలీల విషయంలో కూడా ఇంకో మార్పు వచ్చింది. చెరువులు తవ్వుతున్నంత కాలం వారి చేతుల్లో డబ్బులు కనిపించాయి. వారిలో కూడా కొత్త ఆలోచనలు వచ్చాయి. ''ఎంత కాలం ఈ పొలం పనులకి పరిమితం కావటం. తమ కళ్లముందే తమలో కొందరు కొత్త కొత్త పనులు నేర్చుకుంటున్నారు. డ్రైవింగ్ నేర్చుకుని ట్రాక్టర్లకీ, లారీలకీ డ్రైవర్లుగా పనిచేస్తూ బాగానే సంపాదిస్తున్నారు. వాళ్లు చెబుతుంటే అర్థమవుతూంది. తమ కూలిరేట్లు చాలా తక్కువ. డబ్బులుగా తీసుకుంటేనే తమకు లాభం. అంతేగాని వడ్లు కొలిపించుకోవటంవలన తమకు చాలా నష్టాలున్నాయి. అంతేకాదు తమకు ఈ ఊర్లో ఉండి ఎక్కువ విషయాలు తెలియటం లేదుగానీ తమకోసం ప్రభుత్వం కొన్ని పనులు చేస్తోంది. కొన్ని చోట్ల పొలాలు ఇస్తున్నారు. ఇళ్ళు కట్టిస్తున్నారు. తాము ఇలానే ఉంటే ఈ జీవితంలో పైకిరావటం అంటూ ఉండదు''. కొంతమంది కుర్రాళ్లు... అందులోనూ చదువుకున్నవారు కొత్త ఆలోచనతో ముందుకు నడుస్తున్నారు. ఇంతకు ముందు కూడా ఒకరిద్దరు పనులకోసమో, ఇంకా బాగా సంపాదించాలనో బయటకు వెళ్తుండేవారు. అలాంటి వారి సంఖ్య చాలా స్వల్పం. ఇప్పుడు వారి సంఖ్య బాగా పెరిగింది. దాంతో సహజంగానే 'పాలెం'లో ఉన్నవారికి కూడా డిమాండ్ పెరిగింది. వారు 'బేరం' ఆడగగల స్థితికి వచ్చారు.

ఇలాంటి సమయంలోనే కొంతమంది బావ దగ్గరకొచ్చి మెల్లగానే ప్రశ్నించారు. ''చూశావా నువ్వు అంతంత డబ్బులు పడేసి వారిని చెరువులు తవ్వకంలో పెట్టుకున్నావు. మరి ఈ రోజు వాళ్ళకి ఈ పనులకి రావటం అంటేనే ఇష్టం ఉండటం లేదు. ముందసలు ఎంతిద్దామన్నా మనిషి దొరకటం లేదు''

''నేనిచ్చింది చాలాతక్కువే అనుకుంటున్నా. అదే ఇలాంటిపని పట్నంలో చేయించాలంటే చాలా అవుతుంది. నేనే తక్కువ ఇస్తున్నాననుకుంటే అంతకంటే తక్కువ ఇచ్చారన్నమాట. సరే ఇంతకాలం అదంతా లాభం అనుకోండి.''

''అదేంటి. నువ్వుకూడా అట్టా చెబుతావు. వ్యవసాయం ఖర్చులు ఎంత పెరిగిపోయాయి. కూలీల్ని భరించటంవల్ల కావడంలా. అసలిదంతా మానేసి ఓ పక్క కూర్చుంటే నయం అనిపిస్తోంది''

''నాకు కొంచెం లెక్కలు చెప్పవే. ఇంతకు ముందు మనిషికి కూలి ఎంతిచ్చావు? ఇప్పుడెంత ఇస్తున్నావు ఓ పక్కన రాయి. అలాగే ఎరువుల బస్తా ఇంతకు ముందు ఎంతకుకొన్నావు... ఇప్పుడెంతకి కొంటున్నావు ఇవన్నీ లెక్కలు రాసి చెప్పు. అయినా ధరలు పెరగకుండా ఎల్లకాలం అలానే ఉంటాయా. మిగతా ధరలు మాత్రం పెరగకూడదు...వడ్లు ధరలు మాత్రం పెరగాలంటే సరిపోతుందా?''

''ఆ పెరిగినయి. మా బాగా పెరిగినయి. అన్నీ పెరిగినయి. అయి తప్పితే''

''అవును మరి. వీటిగురించి ఆలోచిస్తావు గానీ వాటి గురించి నువ్వు ఆలోచించవు. ఈ ఊర్లో ఉన్నాడుగా. ఆయనకి ఇచ్చేస్తే చాలు. మరి ధర రావాలంటే నీ ధాన్యం కొంటానికి నలుగురు ముందుకు రావాలి. అప్పుడు ధర పెరుగుతుంది. ఈ ఊరికెవరొస్తారు. అందుకు గదా ఈ ఊరి రైతులంటే అలుసు. మరి మీకు ఇక్కడ అమ్ముకోవటం తప్పితే దిక్కులేదయ్యె.. ఆడు ఎన్నిరోజులకి ఇస్తున్నాడు. దానికి వడ్డీ ఎంత? ఇవన్నీ లెక్కలు చూసుకోవాలి. అంతేగాని కూలీలకు పదిరూపాయలు ఇచ్చాం అని లబలబలాడితే కాదు. నువ్విచ్చే డబ్బుతో




ఆళ్లేం మేడలు కట్టడం లేదుగా''

ఇలా ప్రతివర్గంలోనూ కొత్తకొత్త అనుభవాలు.. ఆ ఊరంతా తర్జనభర్జనలు జరుగుతున్నాయి. బావ ఇంక రోడ్డుకోసం ఎదురుచూసే స్థితిలో లేడు... అందుకే ఆయన రోడ్డు వేయటానికి నిర్ణయించుకున్నాడు. అయితే ఇందులో కూడా ఆయన చాలా తెలివిగా ప్రవర్తించాడు...

ముందు అడ్డరోడ్డునుండి తన చేలవరకు మాత్రమే రోడ్డు వేసుకుంటున్నానంటూ చెప్పాడు. అంతకుముందుదాకా అందరూ నడుస్తున్న మార్గం కాకుండా తను మరోపక్క నుండి రోడ్డు వేయటం ఆరంభించాడు. అది కూడా రోడ్డుగా ఉపయోగపడుతుంది. ముందుగా తను చేసింది రోడ్డుకిరువైపులా తవ్వించి ఆ మట్టినంతా రోడ్డుమీద పోయించాడు. ఆ తర్వాత దానిమీద కొద్దిపాటి మెటల్ పోయించాడు. మరీ కుంగిపోకుండా ఆ మెటల్‌మీద ఎర్రమన్ను తోలించి పరిపించాడు.

పాలెంలో అద్భుతం జరిగిపోయింది... రోడ్డు వచ్చేసింది... పాలెం గ్రామంలోపలకి అదింకా రాకపోవచ్చు... బావ వేయించింది పక్కా రోడ్డు కాక పోవచ్చు. కానీ ఎన్నో తరాలుగా అలా పడున్నా ఆ ప్రాంతంలో పెనుమార్పుకు పునాదిపడింది.



పాలెంకు రోడ్డుపడినా అదేమంత చెప్పుకోదగింది కాదు. ఈ రోడ్డు గతంమీద కొంచెం మెరుగు. ఇదివరకు బరువుతో రావటానికి లారీలువారు అంగీకరించేవారు కాదు. ఏ ఏక్సిల్లో విరిగిపోతే వారి తిప్పలగురించి చెప్పుకోవటానికి లేదు. అలాంటిది ఇప్పుడు కొంత మంది ధైర్యం చేస్తున్నారు. బావ మొదటిసారిగా చేపలు పట్టిస్తున్నప్పుడు నేను వెళ్లాను. ఆ దృశ్యం చాలా అద్భుతంగా ఉంది. అప్పటికే కొబ్బరిచెట్లు కొద్దిగా ఎదుగుతున్నాయి. దూరంనుండి చూడటానికి ఆ దృశ్యం చాలా అందంగా కనిపిస్తోంది. పెద్దపెద్ద వలలు తెచ్చారు. ప్రత్యేకంగా చేపలు పట్టుకోవటానికి మనుషులు వచ్చారు. అవన్నీ ఎగురుతున్నప్పుడు చూడాలాదృశ్యం.. ట్రక్కులనిండా చేపలు.. చేపలు.. అదోరకం వాసన.. ఐస్ కొడుతూ వాటిమీద చల్లుతున్నారు. అవన్నీ 'హౌరా'కు పంపిస్తున్నారు. చేపలు బాగా పెరిగాయి. ఒక్కొక్కటి రెండు కిలోలదాకా ఉండొచ్చునని పించింది. ఇంకా అంతకంటే బరువుగా కూడా ఉండవచ్చుననికూడా అనిపించింది. వాటిని మాత్రం కోయటానికి బావ అంగీకరించలేదు. ''ఈ చెరువులో పెంచిన చేపలు నేను తినను'' అన్నాడు.

ఎవరో బావకు కబురుచేశారు. ''చేపను కొనుక్కోవాలనుకుంటున్నాను. మరేం అనుకోవద్దు'' అని బావ కూడా చెప్పాడు. ''నేనేం అనుకోనుగానీ నా దగ్గర కొనేకంటే మార్కెట్లో తెప్పించుకుంటే మంచిది. ఈ చేప ఖరీదు ఏభై రూపాయలవుతుంది'' అని.

ఒక్కసారిగా ఊరంతా నిర్ఘాంతపోయింది. వారందరూ చూస్తుండగానే చేపల్ని మోసుకుని వెళ్తున్న లారీలు కనిపించాయి. వారికెందుకో తాము పండించే పంటలన్నింటికీ గిట్టుబాటు ధర రాకపోవడంతో తమవంతు పొరపాటు ఉందనేది అర్థమై ఉండాలి. మొత్తంమీద 'పాలెం'లో జరుగుతున్న దానిని చుట్టుపక్కలవారంతా పరిశీలిస్తున్నారు. ఎవరు వదిలారోగాని అక్కడిజనంలో బావ రాజకీయాల్లోకి రాబోతున్నాడనే ప్రచారం గుప్పుమంది. అప్పటిదాకా అధికార రాజకీయాలకు అలవాటుపడినవారిలో ఒక్కసారిగా వేడి పుట్టింది. ఇంతకాలం తాము అన్నింటినీ నిర్లక్ష్యం చేశారు. ముఖ్యంగా కాంగ్రెస్‌పార్టీ నాయకులకు తిరుగులేని నమ్మకం ఏమిటంటే తమను ఎవరూ కదిలించలేరు. తామేం చెబితే అది రాజ్యం. జనానికి ఆలోచించే తీరిక లేదు. అందులోనూ కాంగ్రెస్ ఈ దేశస్వాతంత్ర్య పోరా

టానికి నాయకత్వం వహించింది కాబట్టి జనంలో ఇంకా ఆ సెంటిమెంట్ ఉంది. అందుకే చాలా నింపాదిగా ఉన్నారు.

ఇలానే ఉంటే మరో కొత్త ప్రమాదం ముంచుకొచ్చినట్లే. కమ్యూనిస్టుల గురించి వారు ఆలోచించటంలేదు. వారి సభలకు ఎంత మందైనా జనం రావచ్చు. కానీ ఎన్నికల ప్పుడు వాటిని ఓట్లగా మార్చుకునే విషయంలో వారు విఫలం అవుతున్నారు. అందుకని వారి విషయంలో వెంటనే వచ్చే ప్రమాదం ఏమీ లేదు. కానీ ఇది అలా కనిపించటంలేదు. ఉన్న గ్రూపుల్లోనే సమయం చాలటంలేదు. రేపు ఎం.ఎల్.ఎ సీటుకో ఎం.పీ సీటుకో మరో పోటీదారుడ్ని ఏర్పాటుచేసుకోవటం ఎందుకు? అందులోనూ వెంకట్రామయ్యగారికి పైనుండి కిందివరకూ మంచి సంబంధాలున్నాయి. ఆయన కూడా ఎల్లకాలం అంటీముట్టనట్లు ఎందుకుండాలి.

ఆ గ్రామంవారే ఆయన్ని వత్తిడి చేయవచ్చు. లేదా తన పెద్దరికం పోతుందనుకొంటే తనే ముందుకొచ్చి ఈ సీటుకావాలంటే తప్పదు. ఏదో ఒకటి ఆయనకివ్వాల్సిందే. లేకపోతే వారందరూ ఏకం అయి వారికి మరికొందరు తోడయితే తమ పని పూర్తవుతుంది. ఎంతయినా పదవిలో ఉన్నంతకాలం వీడితో పనులు జరుగుతాయనుకున్నప్పుడే నలుగురు వస్తారు. లేకపోతే పలకరించే దిక్కుండదు. అది మంత్రులకే వర్తిస్తుంది. ముందు ఏదో ఒకటి చేయాలి.

అందులోనూ ఈ రోడ్ల గురించి ప్రతిపక్షాలు ఎక్కువగా మాట్లాడుతున్నారు. ముందీ రోడ్లు వేయాలి. అంటే హైదరాబాద్ వెళ్ళి కూర్చోవాలి. మినిస్టర్‌తో మాట్లాడి గొంతుమీద కూర్చోవాలి. ఎలా అయినా పని పూర్తిచేయించాలి. ఈ ఆలోచన రాజకీయాల్లో పైకి రావాలనుకుంటున్న ఆ పార్టీ ఇతర నాయకులకి కూడా వచ్చింది. అందుకే ఎవరి కార్యక్రమాల్లో వారు ముందుకు వెళ్లారు.

ఓ రకంగా గుంటూరు జిల్లాకు చెందిన పెద్దలకు కూడా ఈ విషయం ఆశ్చర్యం కలిగించి ఉండాలి. చూస్తుండగానే పత్రికలో ఓ ప్రకటన వెలువడింది. రోడ్ల విషయంలో పరిశీలన జరుపుతున్నారని...

నాయకులు వెనక్కి తిరిగి వచ్చాక చెప్పారు. తాము రోడ్ల విషయంలో సంబంధిత అధికారులతోనూ, మంత్రులతోనూ చర్చిస్తున్నామని. ఈ బెల్ట్ మొత్తం రోడ్లు వేయించి గ్రామగ్రామానికీ బస్సులు వేయించేదాకా విశ్రమించేది లేదని అవసరమైతే ఇందుకు ప్రపంచబ్యాంకు సహాయం తీసుకోటానికి ప్రయత్నాలు చేస్తామంటూ చెప్పారు.

విజయవాడలో నాకో మిత్రుడున్నాడు. అతనికి విజయవాడ నగరంమీద చాలా ప్రేమ ఉంది. అతని దృష్టిలో విజయవాడ తప్పితే ఇంకేదీ ఊరుకాదు. అతన్ని తీసుకొని పాలెం పక్కన టౌనుకు తీసుకువెళ్తే ఓ ఊరిగానే అంగీకరించడు. అదేవిధంగా 'పాలెం'ను ఏమంటాడో తెలియదు. ఆ పట్నంలో డిగ్రీ కాలేజి ఉంది. నాలుగయిదు సినిమా థియేటర్లున్నాయి. మెయిన్‌రోడ్ ఉంది. చిన్నచిన్న వ్యాపారాలున్నాయి. సరే హొటల్స్... కొన్ని గవర్నమెంట్ ఆఫీసులున్నాయి. అలాంటిది మా మిత్రుడికి ఓ లెక్కలోదికాదు...

చూస్తుండగానే ఆ టౌన్‌లో అనేకమార్పులు వచ్చాయి. ఇళ్లస్థలాల రేటు పెరిగింది. కొత్తకొత్త వ్యాపారాలు వచ్చాయి. కొత్త నిర్మాణాలు మొదలయ్యాయి. ఇవన్నీ చూస్తుంటే నాకే ఆశ్చర్యం కలిగింది.

కొన్నికొన్ని సందర్భాల్లో సంవత్సరాల తరబడి ఎంతప్రయత్నం చేసినా కాని పనులన్నీ కూడా మంత్రం వేసినట్లు చిటికెలో అయిపోతుంటాయి. ఇప్పుడు ఒకేవర్గానికి చెందిన వారిలో లుకలుకలు మొదలయ్యాయి. రాజకీయ పరిభాషలో చెప్పాలంటే 'ఫ్యూడల్ సంబంధాలకూ, 'పెట్టుబడిదారీ' సంబంధాలకూ నడుమ ఘర్షణ జరుగుతుంది.

★ ★ ★

ఊహించని మార్పులు వాతావరణంలో వస్తుంటాయి. ఇప్పుడు నేను చెప్పబోతుందదే. ప్రపంచమంతా వేసవి ఎండలకు తల్లడిల్లుతున్నవేళ... ఒక్కసారిగా పెనుమేఘాలు విరుచుకుపడ్డాయి. ఒక్కసారిగా వెలుగంతా మాయమైంది. అంతా చీకటి... జోరున వాన... మెరుపులూ... పిడుగులూ...




కొన్ని కొన్ని సంఘటనలు పునరావృతం అవుతాయనుకుంటాను. చాలాకాలం తర్వాత 'పాలెం'లో అలాంటిదే ఈ సంఘటన...

గర్భంతో పుట్టింటికి వచ్చిందా అమ్మాయి. ఇంకా నెలలు నిండనేలేదు. ఏడోమాసం నడుస్తోంది. అందుకే ధీమాగా అన్నారు. ఇంకా పదిరోజుల్లో ప్రసవం జరుగుతుందనుకున్నప్పుడు మాత్రమే వాళ్ళు పట్నం చేరతారు. అలాంటి కాళరాత్రిలో...

నొప్పులు ఆరంభమయ్యాయి...

ఆ అమ్మాయి గిలగిలలాడుతోంది... ఏంచేయాలో అర్థంకావటంలేదు. ఆ వానలో ఎవరో పరిగెత్తారు. ఇంకెవరో ఎడ్లను బలవంతంగా బండికి కడుతున్నారు. ఈ సమయంలో, ఈ చలిలో తమని ఎందుకు కదిలిస్తున్నారని అవి



మొరాయిస్తున్నాయి. చూస్తుండగానే టాపువేశారు. గడ్డి తడిచిపోతున్నా తెచ్చిపరిచారు. ఆ అమ్మాయి కడుపుపట్టుకొని విలవిలలాడిపోతూంది.

''ఓర్చుకోమ్మా...ఓర్చుకో' కళ్ళనుండి నీళ్ళు కారుతుండగా అంటోంది తల్లి. బాధలన్నీ ఆడవాళ్ళకే. పాము కరిచిన రోజు మేల్కొంటే ఈ దరిద్రం ఉంటుందా? ఇప్పుడు ఈ బండి ఎప్పటికి చేరుతుంది? ఈ పిల్ల ప్రసవిస్తుందా? రేపు వాళ్ళ భర్తకు ఏం సమాధానం చెప్పాలి? చెరువుదాకా రోడ్డు వచ్చినప్పుడైనా ఎవరికైనా చీమకుట్టిందా? ఇప్పుడెలా? ఏమిటి చెయ్యటం...?''

కన్నతండ్రికి తప్పదు. కన్నతల్లికి తప్పదు. ఆ ఇంటికి అంకితం అయిన పనిమనిషికీ తప్పదు. బండి నడుస్తోంది. అప్పుడే నేలంతా బురద...బురద...అయ్యో ముందుకు కదలటంలేదు... నెట్టాలి... బలవంతంగా నెట్టాలి... అయ్యయ్యో ముక్కుపచ్చలారని బిడ్డ... భగవంతుడా కాపాడు... ఎక్కడో మెరిసిన మెరుపు... అంతలోనే భయంకరంగా ఉరుము... ఏం కానుంది? ప్రళయమే రానుందా? ఈ అమ్మాయి జన్మనివ్వలేక విశ్రాంతి తీసుకుంటుందా... ''ఏవండీ... ఏవండీ'' ''మెరుపు... ఉరుము...'' ''తల్లీ...తల్లీ'' ఆ ఆక్రోశాలు మెరుపుల్లో కలుస్తున్నాయి. వారి కన్నీళ్ళు పాలెం భూమి పొరలమీద ఇంకిపోతున్నాయి...

అప్పుడు చూశాడాయన...

ఆ మెరుపుల వెలుతుర్లో ఎవరో పరిగెత్తుకొస్తున్నారు...

వారంతా యువకులు... వారి కళ్ళలో ఆరాటం ఉంది. ఆవేదన ఉంది... ఆగ్రహమూ ఉంది...

ఒక్కసారిగా బండి ముందుకు కదిలింది... ఆయన కళ్ళలో కృతజ్ఞత... అంతటితో ఆయిపోలేదు... కుర్రాళ్ళంతా ముందుకు నడుస్తున్నారు... బండిని ముందుకు నెడుతూనే ఉన్నారు. వానా, గాలీ, ఉరుములూ ఇవేమీ వారిని బాధించటంలేదు...

ఇప్పుడేం జరుగుతుంది?

అదే బాధ...

అయిదుమైళ్ళూ ఎలా నడిచారో తెలియదు...

అలా వెళ్ళి వెళ్ళి ఆ చీకట్లోనే ఓ హాస్పిటల్ దగ్గరకెళ్ళారు.

నర్సు హడావుడిగా బయటికొచ్చింది.

★ ★ ★

వాన ఆగిపోయింది.

బండి పాలెంరోడ్డు మీదగా నడుస్తోంది. బండిలో ఆ అమ్మాయి ప్రశాంతంగా నిద్రపోతూంది. ఎవరూ మాట్లాడటంలేదు. వెనక నుండి నడుస్తున్న యువకుల ముఖాల్లో నెత్తురుచుక్కలేదు. ఆ అమ్మాయి కాళ్ళదగ్గర తండ్రి కూర్చున్నాడు. తల దగ్గర అమ్మ కూర్చుంది. వారికిదంతా కలలా ఉంది.

ఎందుకొచ్చిందీవాన... ఎందుకొచ్చాయీ నొప్పులు... ఎందుకని ఈ గుండె కొట్టుకోవటం ఆగిపోయింది? ఎవరూ చెప్పలేదు..

కానీ ఇది ఇలా జరుగుతుందని మాత్రం ఊహించాలి. ఎందుకంటే తమ ముందు జీవితానుభవం ఉందికాబట్టి. అంటే ఇందులో తమ బాధ్యతా ఉంది. ఇది సహజమరణంకాదు. ఇది విధిరాత కూడా కాదు. ఈ వాన రాకపోయినా ఆ అమ్మాయిని అక్కడకు చేర్చటం ఆలస్యం అయ్యేది. కాకపోతే ఈ ఊర్లో కనీససౌకర్యాలుంటే ఏ డాక్టరో వచ్చి ఉండేవాడేమో... ఏమైనా జరిగిందేదో జరిగిపోయింది... బురద... భయంకరంగా బురద... చక్రాల్ని తమలోకి లాక్కుంటున్న బురద... ఆ యువకుల బట్టలమీద బురద మరకలు...ఆ బండిని ఈడుస్తున్న ఎడ్లమీద బురదమరకలు...

ఎడ్లు రోదిస్తున్నాయా అన్నట్లుంది. ఇంతవరకూ దుమ్ముతో నిండిపోయిన చెట్లన్నీ ఒక్కసారిగా పచ్చదనాన్ని నింపుకున్నాయి. ఏ పాలపిట్టో అరుస్తూ వెళ్ళింది. అది విషాదగీతం... అలానే అనిపించింది. పాలెం నిద్ర లేచింది... ఉలిక్కిపడింది. బావురుమంది.

పాలెమంతా విషాదం... ఇంటిముందు బండి ఆగింది... ఆ అమ్మాయిని నేలమీద పడుకోబెట్టారు. పొట్ట ఎత్తుగా కనిపిస్తోంది. బతకటానికీ, బతుకునివ్వటానికీ ఆ అమ్మాయి





చేసిన విఫలమైన పోరాటం ఆ వదనంలో కనిపిస్తోంది. అందరూ వచ్చి చూస్తున్నారు.

తమ ముందు పుట్టి... పెరిగి తమ కళ్ళ ముందే ఎదిగి... తమ కళ్ళముందే పెళ్ళిచేసుకొని ఉన్న ఊరిని కన్నీళ్ళతో విడిచిపెట్టిన ఆ చిట్టితల్లి వదనం మరీ మరీ గుర్తొస్తోంది...

ఈ మరణం అందరినీ కదిలించింది... అందరినీ ఆలోచింపచేసింది. అందరూ అలా దీనంగా, విచారంగా కూర్చున్నవేళ...

అక్కడో పెద్ద కోలాహలం... అందరూ తలలెత్తారు...పూనకంవచ్చినట్టుగా కొందరు యువకులు నడుస్తున్నారు. వారి చేతుల్లో పలుగులున్నాయి, పారలున్నాయి, తట్టలున్నాయి.

"ఏమిటి ... ఏమైంది? వీళ్ళంతా ఎక్కడికి వెళ్తున్నారు?"

వారందరి కళ్ళలోనూ ఏదో కసి...

ఓ యువకుడు ఆగాడు... పలుగులూ, పారలూ కిందపెట్టారు. తలపాగాలు చుట్టారు... ఓ పలుగును భూమిలోకి దించారు... ఓ పారతో దాన్ని తట్టలోకి ఎత్తారు. అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. అందరికీ అదో ఉన్మాదచర్యలా కనపడుతోంది.

నిన్న కురిసిన వాన ఆగిపోయింది. కానీ ఆ తడి ఇంకా అలానే ఉంది. అయినాకూడా వారందరూ ఆ నేలను తవ్వుతున్నారు. ఆ బురదనీ... ఆ మట్టిని రోడ్డుమీద పరుస్తున్నారు. నిలబడి చూస్తున్నవారిలో ఉద్రేకం... ఇంకెవరో ముందుకొచ్చారు. రెండుచేతుల్లో ఆ పెళ్ళల్ని అందుకున్నాడు. తను రోడ్డుమీదకు విసిరేశాడు.

ఎవరో స్త్రీకి పూనకంవచ్చింది.

తనూ వారి నడుమకు దూకింది... అంతే... ఒకరితర్వాత ఒకరు అందరూ ఆ ప్రవాహంలో కలిసిపోయారు.

నిజం పాలెందారిపొడుగునా వారందరి శ్రమ...

పాలెం రోడ్డు ముందుకు కదిలింది...

అలా ఎంతసేపు పనిచేశారో తెలియదు.

మొదట ప్రారంభించిన యువకులు అలుపుతో ఆగిపోయారు. వారినుండి పలుగును వేరొకరు అందుకున్నారు... వారినుండి ఇంకొకరు... వేరొకరు... అలా ఆ క్రమం సాగుతూనే ఉంది.

ఇదంతా అనాగరికంగానూ, మరోరకంగానూ భావించింది కొద్దిమందే...

ముసలివారుసైతం వారందరినీ వారించలేదు. కొంతమంది తామూ కొంతసేపు పనిచేశారు. ఓపికలేనివారు ఆశీర్వదిస్తూ నిలుచున్నారు.

రోడ్డువద్దనున్న కృష్ణమూర్తి నుండి ప్రతిఒక్కరూ అందులో భాగం పంచుకున్నారు. 'పాలెం'కు రోడ్డొచ్చింది.

నిజం... 'పాలెం'కు రోడ్డే వచ్చింది!

## ఉపసంహారం

ఇప్పుడు 'పాలెం' వెళ్ళాలంటే సిటీ బస్‌లున్నాయి.

పాలెం రోడ్లు... అంటే పాలెం అడ్డరోడ్డే కాదు. పాలెం మెయిన్‌రోడ్డూ అన్నీ తారురోడ్లు... అయితే అవి గతుకులకి అతీతం కావా అని ఎవరైనా అడగవచ్చు... అంతేకాదు... రోడ్లు వచ్చాక... బస్సులొచ్చాక పరిస్థితుల్లో చాలా మార్పులొచ్చాయి.

అవి మంచివా చెడ్డవా అనవచ్చు.

ఈ ప్రపంచంలో అంతా మంచే ఉండదు. అలా అని అంతా చెడు కూడా ఉండదు! ఒక్కో సమయంలో ఒక్కటి ఎక్కువగా అనిపిస్తుంటుంది. కనిపిస్తుంటుంది. అంతమాత్రాన రెండోది అదృశ్యం కాదు.

అందులోనూ ఒకరి మంచి ఇంకొకరికి చెడుగా ఉన్న సమాజంలో మనం బతుకుతున్నాం.

అందుకే ఈనాటికీ 'పాలెం'లో రోడ్డు రావటంపట్ల చింతించేవారున్నారు. "ఇలా జరుగుతుందని మేం ముందే చెప్పాం కదా" అని గొణుక్కుంటారు. అందుకు ఉదాహరణలు చెబుతారు.

కొంతమంది ఈ విషయంలో రాజీపడ్డారు. జరిగిన మార్పుల్లో కొంతమంది వెనక్కి నెట్టబడ్డారు. మరికొందరు ముందుకొచ్చారు.

రోడ్డు రాకముందు 'పాలెం'ను నేను పరిశో

లించాను.

ఇప్పుడు నాకంటూ ఓ కార్యక్రమం ఉంది. అందులోనే నాకు సరిపోతుంది. నాకిప్పుడు నా తోటి యువకులకు విజ్ఞప్తి చేయాలని ఉంది.

కొత్త 'పాలెం' మీముందుంది. దానికిప్పుడు రోడ్డుంది.

దానికిప్పుడు మరింత ఆధునికత ఉంది. ఇవి సౌఖ్యంతోపాటు సమస్యల్నీ తెస్తుంటాయి.

అందుకే తిరిగి మనం పరిశీలనలోకి వెళ్ళాలి. అప్పుడు మనకు మరికొన్ని కొత్త విషయాలు తెలుస్తాయి... అప్పుడు మనకు లేనిదేమిటో తెలుస్తుంది. మనకు కావలసిందీ అర్థమౌతూంది...

ఇక్కడ ఇంకో చిన్న విషయం చెబుతాను. వాస్తవానికి అది చిన్న విషయం కాదు. రానున్న కాలంలో చాలా పెద్ద విషయం అది...

'పాలెం'కి రోడ్డు వచ్చిందేగానీ... 'మాలపల్లి'కి రాలేదు...

వారికి రోడ్డు అవసరంలేదని ఎవరైనా అనుకోవచ్చునేమోగానీ... వారు అనుకోనిరోజున మాత్రం అద్భుతం జరుగుతుంది.

'పాలెం' రోడ్డు ఓ కల... అది ఎప్పుడూ, ఎన్నడూ సాధ్యం కాదనే నమ్మారు కానీ అది వాస్తవం అయింది.

రేపు మాలపల్లికి కూడా అంతే...

అటూ రోడ్డు వస్తుంది... ఇంకా చాలా చాలా వస్తాయి.

★ ★ ★

ఓ వెన్నెల రాత్రి... అక్కా నేనూ కూర్చున్నాం...

అక్కా నేనూ మాట్లాడుకుంటుంటే ఒక్కసారిగా గాలి మొదలైంది...

ఆ తర్వాత కొద్దిసేపట్లోనే వాతావరణంలో మార్పులొచ్చాయి.

సన్నటి జల్లు కురుస్తోంది...

నేను లేచి లోపలకు నడవబోయాను...

"సుధీ... మనం కూర్చుందాం" అంది అక్క.

నేను అలానే కూర్చున్నాను.

వాన కొద్దిసేపు జోరుగానూ, కొద్దిసేపు చిరుజల్లుగానూ మమ్మల్ని తడిపింది.

"ఏం చేస్తున్నార్రా" అంటూ వచ్చింది అమ్మ...

"అదేంట్రా... మీ ఇద్దరూ వానలో తడుస్తూ కూర్చున్నారు" అంది అమ్మ.

"నువ్వు కూడా రా... మనందరం వానలో తడుద్దాం" అన్నాను. అక్క కూడా అమ్మని ఆహ్వానించింది.

"ఎవరన్నా చూస్తే నవ్వరూ" అంది అమ్మ.

"నవ్వుకోనీ మనకేమిటంట"

"జలుబుచేసి జ్వరం కాస్తుందేమో"

"కాయనీ... మందులు వాడుకుందాం"

ఇంకేం మాట్లాడాలో తనకు తెలియలేదు.

కొంచెంసేపటి తర్వాత అంది:

"అది కాదురా... ఉద్యోగం చేయకుండా... ఇంకా పెళ్ళి చేసుకోకుండా అదనీ ఇదనీ తిరుగుతున్నావు..."

"నీకలాంటి భయం వద్దు. నాతోపాటు వర్షంలో తడిసే అమ్మాయిని చేసుకుంటాను" అన్నాను...

"నీ రాజకీయాలన్నీ ఇందుకా?"

నేనూ, అక్కా బిగ్గరగా నవ్వాం...

అమ్మ కొంచెం సిగ్గుపడింది.

"అవునమ్మా... ఇందుకోసం కూడా. ఇలా తడవటం ఎవరికీ నష్టంలేదుకదా... ఎవరేమైనా అనుకుంటారని నా కోరికల్ని దాచుకోనే స్వేచ్ఛకోసమే నా రాజకీయాలు" అన్నాను...

వాన చినుకుల శబ్దం తప్పించి మరేం లేదు...

అక్క ఆ నిశ్శబ్దంలో నుండి అంది...

"సుధీర్ నా పిల్లలు కూడా వచ్చి మావయ్యతోపాటు మేమూ ఉంటాం అంటే చాలా సంతోషిస్తాను..."

తిరిగి అక్కడ నిశ్శబ్దం.

అమ్మ మెల్లగా మా దగ్గరికొచ్చింది.

మేం ముగ్గురం అలా తడుస్తున్నాం.

వాన మమ్మల్ని కవ్విస్తూనే ఉంది.







# చమత్కార కతలు

## చెడపకురా చెడేవు

"ఏవండీ!" పెద్దగా కేకేసింది శ్రీమతి.

"ఆఁ!.." అన్నాను.

"సాంబారు చేస్తున్నాను. అందులోకి కాస్త కందిపప్పు కావాలిగానీ ప్రక్క వీధి కిరాణా దుకాణానికి వెళ్ళి తీసుకురండి" వంటగదిలో నుండే అంది శ్రీమతి.

"ఆఁ!.." అంటూ ఫైలు చూసుకోసాగాను.

కాసేపాగి "ఏవండీ!" అంది మళ్లీ.

"ఆఁ!.."

"ఇంకా మీరెళ్ళలేదా?"

"ఊఁ!.." తలదించకుండానే అన్నాను ఫైలు చూస్తూ.

అంతే, శ్రీమతి రుసరుసమంటూ నా వద్దకు వచ్చి కోపంగా నా చేతిలోని ఫైలు లాగేసుకుంది.

చిరుకోపం రాగా "ఎందుకలా లాగేశావ్?" అనడిగాను.

"కందిపప్పు తెమ్మని చెప్పి ఎంతసేపయ్యిందీ తర్వాత సాంబారు చెడిపోతే "ఇలా తగలేశావేం?" అని భోంచేసేప్పుడు నానామాటలు అంటారు. ఇప్పుడేమో తెమ్మంటే తేరు. సరే! నేనేవెళ్ళి తెచ్చుకుంటాను" అంటూ, ఫైలు టేబుల్‌మీదికి విసిరేసి చీరకొంగు నడుముచుట్టూ తిప్పి, బొడ్డు దగ్గరకుచ్చిళ్ళలో ఇరికించుకుని ప్రక్కనే ఉన్న బుట్ట తీసుకుని బయలుదేరబోయింది.

శ్రీమతికి ఎంత కోపమొచ్చిందో అర్థం చేసు



కుని "సరే! నేనే వెళ్తున్నా. ఆ బుట్ట ఇలా ఇవ్వు" అంటూ శ్రీమతి చేతిలోని బుట్ట లాక్కొని బయటకు అడుగేశాను.

"ఏవండీ!" శ్రీమతి మళ్ళీ పిలిచింది. ఏమిటి అన్నట్లు వెనక్కు తిరిగాను.

"ఎలాగూ ప్రొవిజన్ స్టోర్‌కి వెళుతున్నారు గదా! ఇదుగో ఈ లిస్టు తీసుకొని ఇందులోని సామాన్లు కూడా తేకూడదూ?" అంది శ్రీమతి.

"అలాగే"నంటూ ఆ లిస్టు తీసుకొని వెనుతిరిగాను.

"ఏవండీ!" మళ్ళీ పిలిచింది శ్రీమతి.

నాకు కోపం ముంచుకొచ్చి "ఏమిటి?" అని కసురుకున్నాను.

"ఎందుకలా కసురుకుంటారు? సామాన్లు తేవడానికి డబ్బులిద్దామని పిలిచాను. ఇవిగో డబ్బులు" అంటూ నా చేతుల్లో నోట్లు పెట్టి తను ఇంట్లోకి వెళ్ళిపోయింది వేగంగా.

నేనొక నిట్టూర్పు విడచి డబ్బు జేబులో పెట్టుకొని స్టోర్స్ కెళ్ళాను.

"రండిసార్! ఏంకావాలి?" ఆహ్వానించాడు కొట్టువాడు.

"ఇదుగో! ఈ లిస్టు తీసుకొని, మంచి సరుకులు ఇవ్వు ఆ లిస్టులోని సామాన్లతోబాటు కందిపప్పు ఒక కేజీ ఇవ్వు" అన్నాను.

లిస్టు తీసుకున్న గోపాలం చకచక లిస్టులో నున్న సరుకులన్నింటిని ప్యాక్ చేసి నా చేతి కందించాడు.

సరుకులన్నీ లెక్కించాను. కందిపప్పుతో కూడా కలిపి పదకొండు సామాన్లు లెక్కసరిపోయింది. అన్నింటిని బుట్టలో సర్దాను.

"ఎంతయ్యింది" అడిగాను.

"ఎనభై ఎనిమిది రూపాయలు సార్!"

జేబులోనుండి భార్యామణి ఇచ్చిన డబ్బు తీసి "ఇదిగో వంద రూపాయలు" అంటూ ఆ రెండు యాభైనోట్లూ గోపాలంకిచ్చాను.

గోపాలం నన్నోసారి పరిశీలనగా చూసి "ఇదుగోండి సార్! మిగిలిన బ్యాలెన్సు పన్నెండు రూపాయలు" అంటూ డబ్బునాకి ్చాడు.

డబ్బు తీసుకున్న నేను లెక్కపెట్టాను. ఇరవై రెండు రూపాయలు ఉన్నాయి. మళ్ళీ లెక్కపెట్టాను. నిజంగా... ఇరవై రెండే...

"పదిరూపాయలు ఎక్కువ ఇచ్చావు సుమీ! తీసుకో" అని ఆ పదిరూపాయలూ ఇచ్చేద్దామనుకున్నాను.

కాని, నా మనసు అందుకు అంగీకరించలేదు. వెంటనే బుట్ట చేతికి తీసుకుని వేగంగా ఇంటివైపుకు నడకసాగించాను తేరగా పది రూపాయలు వచ్చినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది.

ఇంట్లోకి రాపడంతోనే "అన్ని సామాన్లూ తెచ్చారా? లేక మీ మతిమరుపు చేష్టలు ఏమైనా ప్రయోగించారా?" అంది శ్రీమతి.

"కావాలంటే చూసుకో. అన్ని సామాన్లు సరిగ్గా తెచ్చాను. పైగా మనకు పది రూపాయలు లభించాయి కూడా" అన్నాను ఆనందంగా.

శ్రీమతి ఆశ్చర్యంతో "నిజంగానా? ఎలా వచ్చాయండి?" ఆతృతగా అంది.

"షాపువాడికి నువ్విచ్చిన రెండు యాభైనోట్లు ఇచ్చాను. వాడు వీటి ఖరీదు ఎనభై ఎనిమిది పోను పన్నెండు రూపాయలివ్వాలి. కాని, వాడు నాకు ఇరవై రెండు...."

"ఆగండి" ఒక్కసారిగా అరిచింది శ్రీమతి.

ఏమిటన్నట్లు ఆమె వైపు చూశాను.

"మీరు షాపువాడికి నేనిచ్చిన రెండు యాభై నోట్లు ఇచ్చారా!" అని అడిగింది శ్రీమతి.

"అవును" అన్నాను.

"ఆఁ!... భలేవారండి. నేను మీకిచ్చిన రెండూ వందరూపాయలనోట్లు. కళ్ళజోడు పెట్టుకుని వెళ్ళడం మర్చిపోయి... బాబోయ్... వందరూపాయలుపోయాయి...." గుండెలు బాదుకోసాగింది శ్రీమతి.

నేనెప్పుడు "ఢాం"మ్మని క్రిందపడిపోయానో నాకే తెలియదు.

-పాలకొల్లు రాజమోహన్‌రెడ్డి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291.

# "గుర్తుపెట్టుకోండి, పోషణనిచ్చే సమపాళ్లుగల ఆహారాన్నివకపోతే ఏమి జరుగుతుందో? చురుకుదనాన్నివ్వడానికి అవసరమయ్యే 'సరియైన' తీరులోని కేలరీలు మీ పాపకి అందవు.

## అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

'సరియైన' కేలరీలు అంటే ఏమిటి?
అనేదిది ఆహారంలోని ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, కొవ్వు
లు, ఖచ్చితమైన సమపాళ్లు యీ కేలరీలలో వుంటాయని. నిజానికి ఇవి
గా పెరగటానికి, చురుకుగా వుండటానికి. అవసరమైన కీలకమైన
పదార్థాలు
పకు 'సరియైన' కేలరీలు లభించేటట్లు ఖచ్చితంగా చూడాలి
హారి యిచ్చే ఆహారంలో వుండాలి. రోజూ మామూలుగా వారం
తంగా యిచ్చే ఆహారంతో అలా యివ్వగలగటం చాలా మంది తల్లులకి
కాదు

పరిష్కారం ?
క్ పోషణ నిచ్చే సమపాళ్లుగల సంపూర్ణ ఆహారం పాపకు 4 నెలలు
ప్పటి నుండి అంటే, కేవలం పాలు యిస్తే చాలని వయస్సు నుంచి.
ఆహారం
కలో ప్రొటీన్లూ, కార్బొహైడ్రేట్లూ, కొవ్వు పదార్థాలూ విటమిన్లూ,
కాల్షియం, వున్నాయి దాంతో మీ పాప చురుకుగా వుండటానికి
మైన 'సరియైన' కేలరీలు లభిస్తాయి. రుచికరంగానూ వుంటుంది.
యివ్వండి వెంటనే మీ పాపకు, పోషణనిచ్చే సమ పాళ్లలోగల

కు 6 నెలలు వచ్చినప్పటి నుంచి వీట్-ఆపిల్, వీట్-ఆరెంజ్,
వీట్-వెజిటబల్ అదనపు లాభం అందించండి
సి ప్యాక్ పైన యివ్వబడిన సూచనలను పాటించండి

---

ం సెరిలాక్ బేబీ కేర్ బుక్
డి : సెరిలాక్, పోస్ట్ బాక్స్ నెం 21 న్యూ ఢిల్లీ 110029




**పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.**

Mudra D NIL 0018 TEL

